





# రాష్ట్ర ముఖ్యమంత్రితో మీరు మాట్లాడాలా? మీ కోసం ఒక వేదిక ఉంది. అదే... "ప్రజలతో ముఖ్యమంత్రి"

రాష్ట్రవ్యాప్తంగా నిరాటంకంగా కొనసాగుతున్న "ప్రజలతో ముఖ్యమంత్రి" కార్యక్రమం ఎన్నో సామాజిక సమస్యలను పరిష్కరించింది. 1997 ఏప్రిల్‌లో ప్రారంభమైన ఈ కార్యక్రమంలో ఎంతోమంది ప్రజలు స్వయంగా ముఖ్యమంత్రితో టెలిఫోన్‌లో మాట్లాడి సమస్యలను పరిష్కరించుకోవడం విశేషం. ఈ వినూత్న కార్యక్రమంలో ప్రజలు విలువైన సమయాన్ని వివేకవంతంగా వినియోగించుకోవాలి. సామాజిక సమస్యలతో పాటు, అభివృద్ధి పథకాలపై ప్రశ్నలు అడగాలి. పరిష్కారాన్ని అందుకోవాలి.

## ఒక ప్రత్యేక అంశం మీ అందరి కోసం దూరదర్శన్‌లో ప్రతి సోమవారం సా॥ గం.6.25 ని.లకు

**ఆలస్యమెందుకు...?**

ఈ క్రింద టెలిఫోన్ నెంబర్లకు డయల్ చేయండి.

హైదరాబాద్ నుంచి : 23453229, 23453230

రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల నుంచి : (040) 23453229, 23453230, 23453231, 98480-54343

**ప్రకటించిన అంశంపై ప్రశ్నలు అడగండి - పరిష్కారం పొందండి.**

జారీచేయువారు : సంచాలకులు, సమాచార, పౌర సంబంధాల శాఖ, హైదరాబాద్.

ఇదీ సంగతులు

35

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# హాస్యం - సంగీతం







'సెంటర్ స్ప్రెడ్'లో - 'అప్పుడప్పుడు', 'జెంటిల్‌మేన్' సినిమా పాటల పుస్తకాలు కలర్‌లో

ముఖచిత్రం: కుమారి లయ

'హాసం' పత్రికలో మీరు ప్రచురిస్తున్న అన్ని వ్యాసాలు అద్భుతంగా వుంటున్నాయి. ముఖ్యంగా ఈ వారం మీరు ప్రచురించిన "పితృదేవోభవ" కార్యక్రమంలో పాల్గొన్న నాటి నేటి నేపథ్య గాయనీ గాయకుల ఫోటో చాలా అందంగా వుంది. మీరు వ్రాసిన వ్యాఖ్యలు కూడా మనసును ఆకట్టుకున్నాయి. మా హృదయాలను కదిలించాయి.

మీ హాసం పత్రిక దినదిన ప్రవర్ధమానం కావాలని కోరుకుంటూ...

**-ఘంటసాల రత్న కుమార్, మద్రాసు.**

'హాసం'లో ఒక్క తెలుగు సినీ రంగ విశేషాలే కాకుండా, హిందీ, ఇంగ్లీషు చిత్రాల విశేషాలనూ పొందుపరచడం ఎంతో బాగుంది. మన తెలుగు, మన రాష్ట్రం, మనం, మా...మా...అనే కంటే వివిధ భాషలలోని మాధుర్యాన్ని గ్రోలడం అంటే, అమృతం తాగినంత సంతోషంగా అనిపిస్తుంది నాకు. అందులోనూ అన్ని సినీ పత్రికల్లా చెప్పిందే చెప్పడం కన్నా, తరతరాల అంతరాలను వివరించే మీ కృషి చాలా గొప్పది. అంతేకాదు అటు అమెరికా-ఇటు ఇండియా వస్తూ వెడుతూండే నాకు హాలీవుడ్ గురించిన యదార్థాలను ప్రచురించడం మరింత సంతోషం కలిగించింది. హాట్సాఫ్ టు హాసం.

**-ఎ.అన్నపూర్ణ, హైదరాబాద్.**

ఒకనాటి నవ్వులు - పువ్వులు, జోకర్, పకపకలు, హాస్యప్రభ, హాస్యప్రియ, మిలియన్ జోక్స్, వికటకవి అనే హాస్య పత్రికలు కనుమరుగైన సమయంలో, తిరిగి "హాసం" ఆ లోటును భర్తీ చేస్తూ, అశేష ఆంధ్రపాఠకుల అభిమానాన్ని అనతి కాలంలో చూరగొనడం అభినందనీయం. మీ "హాసం" పత్రిక నిండు నూరేళ్ళు, పున్నమి చంద్రునిలా ప్రకాశించ గలుగుతుందనే నా నమ్మకం!

**-బచ్చు వీర్రాజు, రాజమండ్రి.**

'హాసం' పత్రిక చూసాము. సంగీత సాహిత్యాల మేలు కలయికగా ఈ పత్రికను మీరు రూపొందిస్తున్న తీరు అపూర్వము, ప్రశంసనీయమునూ! పాఠకుల అభిరుచిని పెంచే సవాలును స్వీకరించారు. మీ కృషి ఆ దృష్ట్యా సత్ఫలితాలను, సాధించి తెలుగు పత్రికాలోకానికి గర్వకారణం కాగలదని ఆశిస్తున్నాం.

**-వసుంధర( జె.రామలక్ష్మి, జె.రాజగోపాలరావు) భువనేశ్వర్.**

విలక్షణమైన శైలితో ఒక ప్రయోగంగా వస్తున్న 'హాసం' తెలుగు పాఠకుల గుండెల్లో కితకితలుపెట్టి అచిరకాలంలోనే అత్యధికుల మన్ననలను పొందడం ఆనందకరం. హాస్యరస ప్రియులైన తెలుగువాళ్లు ఇంతకాలం ఇటువంటి ఆనందానికి ఎలా దూరంగా ఉన్నారా అని ఇప్పుడనిపిస్తోంది. టీవీ వచ్చి పత్రికల మనుగడే ప్రశ్నార్థకం అనుకుంటున్న ఈ రోజుల్లో ఇలా సూపర్‌హిట్ అయిన పత్రిక ఇదేనేమో అనడం పొగడ్తకాదు. పత్రిక మార్కెట్లోకి ఎప్పుడొస్తుందా అని ఎదురు చూసేలా చేయగల పత్రికే పదికాలాలపాటు నిలబడుతుంది. ఆ లక్షణం 'హాసం'కు ఉంది. మీ విజయ పరంపర కలకాలం కొనసాగాలని మనసారా కోరుకుంటూ...

**-సరసి, కార్టూనిస్ట్, హైదరాబాద్.**

ఘంటసాలగారి స్టాంపు విడుదల సందర్భంగా



అనేక మంది సాహితీ, సంగీత ప్రముఖులను కలిశాను. అందరినోటా 'హాసం' గూర్చిన ప్రశంసలే.

**-ఎస్. లక్ష్మీగోపాలం, ములపర్రు.**

'శ్రీదేవి' నూతన తార ముఖచిత్రంతో వెలువడిన 'హాసం' పత్రికలో పుష్కలంగా ఎన్నో విషయాలు అందిస్తున్నందుకు చాలా థాంక్స్. ముఖ్యంగా పద్మనాభం ఆత్మకథ, నీతి చంద్రిక, టి.వి.రాజుగారి వివరాలు, పాత సినిమా పాటల వివరాలు కిషోర్, రఫీల వ్యాసాలు అద్భుతం. జోక్స్ నవ్విస్తున్నాయి. ఇందీవర్‌తో ఇంటర్వ్యూ చాలా నచ్చింది. మొత్తం అన్నింటిలో మించి పోయిందీ పత్రిక.

**-సి.హెచ్. నాగేశ్వరరావు, హైదరాబాద్.**

16-02-2003 'హాసం' పత్రిక ఇన్నర్ కవర్ పేజీలో సంగీత, గాయకులలో హేమాహేమీలైన మహానుభావులెందరో కలిసి దిగిన గ్రూప్ ఫోటో చూసి ఆనందం వెల్లివిరిసింది. అమర గాయకుడు ఘంటసాల స్మారక తపాల బిళ్ల, కవరు 11-02-2003న హైదరాబాద్‌లో దిగినది ఆ ఫోటో. దీనిని ప్రచురించినందుకు కృతజ్ఞతలు చెప్పుటకు మాటలు చాలవు. అందుకే

**"ఎల్లలు దాటిన హాసం!**
**ఎల్లరిని మురిపించు చిరుదర'హాసం'!"**

**-విజయరాఘవన్.కె. వరంగల్.**

నాటి-నేటి కలయికల శీర్షికలతో హాసం క్రొత్త పుంతల్ని త్రొక్కుతూ కొంగ్రొత్త అనుభూతుల్ని అందిస్తున్నది. పద్మనాభంగారి ఆత్మకథ, హ్యూమరథం, కిషోర్ జీవన ఝరి, సారంగధర పాటలు, చలం పాటలు, టి.వి.రాజు పాటలు దేవులపల్లివారి పాటలు అద్భుతం.

**-నారాయణ డి.వి.వి.ఎస్., వనపర్తి.**

ఫిబ్రవరి 16-28 నాటి హాసం పత్రిక చూడ ముచ్చటగా వుంది. నవ్వుల నదిలో పువ్వుల పడవలా పక్షానికోమారు 'హాసం' రసవత్తరంగా మాకందిస్తున్నారు. అన్నపూర్ణావారి 'ఇద్దరు మిత్రులు' సీరియల్ సినిమా నవల 11 సంచికలుగా పరవశింపజేస్తుంది. ముళ్లపూడివారి ఈ నవల చదువుతుంటే సినిమా చూస్తున్న రసాను భూతి కలుగుతుంది. మా అభిమాన నటులు శ్రీ అక్కినేని వారి చక్కనైన బాపూగారి స్కెచ్‌లు, అభిమానులకు అపురూపకానుకలు. ప్రేమచక్రవర్తి శ్రీ అక్కినేని, రాజసులోచన, ఇ.వి.సరోజల నలుపు తెలుపు ఛాయా చిత్రాలు చాలా చాలా బాగున్నాయి.

**-దోవారి నాగేశ్వరరావు, వేకూరు.**

ఫిబ్రవరి 16-28 నాటి హాసం పత్రికలో మా అభిమాన నటుడు 'యువసామ్రాట్' అక్కినేని నాగార్జున నటించిన హిందీ చిత్రం 'క్రిమినల్', తూమిలే... గీతాన్ని "అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం" శీర్షికలో చక్కని వివరణతో కలర్‌ఫుల్ చిత్రాలు నన్ను ఆకట్టుకున్నాయి. చక్కని ప్రేమ గీతాన్ని నాగార్జున రొమాంటిక్ ఫోటోలు అందించిన 'హాసం'కు అభినందనలు.

**-తాళాభక్తుల శేషుబాబు, నాగాయలంక.**

మీ ఎడిటోరియల్ చాలా బాగుంది. ఒక మంచి ఆశయం కోసం మేటి-నేటి సినీ స్టార్లందరూ కలిసి కట్టుగా ఒక్కటై...'క్రికెట్' యజ్ఞం చేసిన తీరు చాలా బావుంది. ఈ ప్రయత్నం సామాన్యమైనది ఎంత మాత్రం కాదు. భావితరాలవారు దీనిని స్ఫూర్తిగా తీసుకుని సమాజానికి ఉపయోగపడేలా మరిన్ని కార్యక్రమాలు చేసేలా ప్రయత్నించాలి.

ఈ పక్షం 'ఆ పాత(ట) మధురం'లో అందించిన 'సారంగధర' చిత్రం విశేషాలు నాకు బాగా నచ్చాయి. ఇక బాపుగారి గురించి తెలియజెప్పే 'బాపు విశ్వరూపం' శీర్షిక పత్రికకే హైలేట్.

**-మంత్రి లక్ష్మీనారాయణ, సిరిసిల్ల.**

నేను 'హాసం' రెగ్యులర్‌గా ఫాలో అవుతున్నాను. చాలా బాగుంది. చౌచౌరస్తా భలేతమాషాగా ఉంది. ముఖ్యంగా ఎమ్మెస్ స్వాతిగారు వ్రాస్తున్న 'కిశోర్ జీవన ఝరి' చాలా బాగుంది. కిశోర్‌గారి గురించి చాలా విషయాలు తెలియజేస్తున్నారు. హాసం ఇదే నాణ్యతతో మున్ముందు రావాలని కోరుకుంటు న్నాను.

**-బాలు, మంచిరియాల.**

చూడగానే సొంతం చేసుకోవాలనిపించేలా ముద్దులు మూటగట్టే ముఖచిత్రం కుమారి శ్రీదేవితో వెలువడ్డ 16-28 ఫిబ్రవరి సంచిక అనన్య సామాన్య సుందరం!

తొలి హాస్యకథ "బంటీ ఈజ్ ది సీక్రెట్ ఆఫ్ మై ఎనర్జీ" నవ్వుల పువ్వులు కురిపించింది. కామెడీ స్కిట్ రాజాగారి 'ఒరేయ్...నువ్వు నాకు నచ్చావురా...!' ఆద్యంతం హాస్యరసాత్మకం!! మన హాసం తెలుగునాట తిరుగులేని ఏకైక హాస్య సంగీత భరిత సుందరకావ్యం!!!

**-బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి.**

మీరు ప్రారంభించిన 'తెలుగు సినీ గీతకోశం' మాకెంతగానో నచ్చింది. మీ ప్రయత్నం ఎంత బాగుందో మాటల్లో చెప్పలేను. పాతపాటలు ఆడియోక్యాసెట్ల రూపంలో సేకరించుకుని దాచుకునే మాలాంటి వారికి ఎంతో సహాయంగా ఉంటుంది. 'హాసం' ద్వారా ఘంటసాల వారికి జరుగుతున్న మర్యాదలు మాలాంటి అభిమానులకు ఎంతో ఆనందాన్ని కల్గిస్తున్నాయి. గత నెల ఫిబ్రవరి11 రాత్రి జరిగిన కార్యక్రమం ఫోటో కవరు మీది 3వ పేజీగా రావడం అనేది వారిపట్ల మీకున్న అభిమానం, ప్రేమ ఎంతెలాంటివో చెప్పకనే చెబుతున్నాయి. 3 రోజుల వ్యవధిలో ప్రింటయి రావడం అనేది మమ్మల్ని ఆశ్చర్యపరిచింది. కిశోర్‌కుమార్ జీవనచరిత్ర మాకెంతో నచ్చింది. ఆపాత మధురం మొత్తం హాసానికే కొలికిపూసలాంటిది. ఈ సంచికలోని సినిమా ఏమిటో తెలుసుకునేదాకా మనసు నిలవదు కదా!

**-జి.రంగారావు, కె.పి.హెచ్.బి**

సంపుటి : 2 సంచిక:11

1-15 మార్చి 2003

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా|| కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

35

సత్కార్యాలకు ప్రచారం ఉండాలి. ప్రతిదానికీ అవసరానికి మించి ఆర్భాటం చేయడం వల్ల ప్రచారకళకు చెడ్డపేరు వస్తోంది కానీ మంచి పనులు జరిగినప్పుడు వాటి గురించి పదిమందికి తెలియజెప్పకపోతే ఎలా? లోకంలో జరిగే ప్రతి మంచి, ప్రతి చెడు మనకు తెలియాలని లేదు. కానీ మన దృష్టికి వచ్చినప్పుడు అది ఆచరణీయం, అనుకరణీయం అని తోచినప్పుడు దాన్ని తగిన రీతిలో హైలైట్ చేయడం ద్వారా ఇతర వ్యక్తులకు, గ్రామాలకు స్ఫూర్తినిచ్చిన వారమవుతామని 'హాసం' నమ్మకం. అందుకే 'అద్దంకి' గురించి ఈ ప్రస్తావన-

ప్రకాశం జిల్లాలో అద్దంకి 35,000 జనాభా కలిగిన ఓ చిన్న పట్టణం. మిగతా ఊళ్ల సరాసరితో చూసుకుంటే ఆ ఊళ్ళో కళాభిమానులు పదుల సంఖ్యకు దాటకూడదు. కానీ వారి నిష్పత్తి అక్కడ ఎక్కువ కాబట్టి ఓ విచిత్రం జరిగింది. పదిలక్షల రూపాయల ఖర్చుతో ఓ ఓపెన్ ఎయిర్ ఆడిటోరియమ్ వెలిసింది. పది సంవత్సరాలుగా ఏటేటా సాంఘిక నాటిక పోటీలు నిర్వహిస్తున్న 'కళాసాగర్',(అద్దంకి) సంస్థకు ఒక వేదిక లభించింది; ఇంకా అంతకంటె ఎంతో ఎక్కువ జనాభా, ఆర్థిక వసతి ఉన్న పట్టణాలు అసూయపడే తీరులో ఆడిటోరియమ్ రూపుదిద్దుకుంది.

రాష్ట్రప్రభుత్వం నిర్వహిస్తున్న 'జన్మభూమి' పథకం క్రింద గ్రామ ప్రజలు రోడ్లు, కాలువలు, వంతెనలు అడగడం కద్దు. కానీ కళామతల్లి ఆరాధకులయిన అద్దంకి వాసులు ఆడిటోరియం కోరుకున్నారు. వారి ఆశలు, ఆశయాలకు స్పందించి శ్రీ మట్టుపల్లి ప్రభాకరరావు అనే వ్యాపారవేత్త ప్రజలు ఇవ్వవలసిన 30 శాతం వాటాగా 3 లక్షలు స్వయంగా సమకూర్చారు. స్థానిక ఎం.ఎల్.ఏ శ్రీ బాచిన చెంచుగంటయ్య స్పందించి ప్రభుత్వం నుంచి తక్కిన నిధులు ఏర్పాటు చేశారు. ఫలితంగా కాలేజి క్యాంపస్‌లో చక్కటి ఆవరణలో ఒక ఆడిటోరియం తయారయింది.

భౌతిక అవసరాలైన కూడు, గూడు, గుడ్డ సమకూరడంతో సరిపోదని ఎన్నడో గుర్తించారు. శరీరంతో బాటు మనసు కూడా ఆరోగ్యంగా ఉండాలన్నా, బుద్ధి వికసించాలన్నా లలిత కళలు వ్యాప్తిచెందవలసినదే. ఎవరి ఇళ్లల్లో వాళ్లు టీ.వీ.లకు అతుక్కుపోవడం సాంఘిక వాతావరణాన్ని, భావప్రకటనా శక్తిని దెబ్బతీస్తుంది. ఇటువంటి రంగస్థలం ఏర్పాటు కావడం వలన కళాకారులు, కళాప్రియులు ఒక చోట కూడడం సాధ్యపడుతుంది.

శ్రీ మట్టుపల్లి ప్రభాకరరావుగారి ఔదార్యం అంతటితో ఆగలేదు. జిల్లాకేంద్రాలలో సైతం సంగీత కళాశాలలు కరువైన ఈ రోజుల్లో అద్దంకి వంటి చిన్న ఊళ్లో సంగీత కళాశాల నెలకొల్పాలని సంకల్పించారు. తల్లి నాగరత్నమ్మ గారి పేర10 లక్షల రూ॥ల ట్రస్టు ఏర్పరచి ఆమె పేరనే గత ఏడాది సంగీత కళాశాల ప్రారంభించారు. విజయవాడ దాకా వెళ్లి సంగీత కళాశాలలో చేరలేని వారికి ఇది ఒక వరం అనడంలో అతిశయోక్తి లేదు. అన్నవరపు రామస్వామిగారి చేతులమీదుగా ప్రారంభించబడిన ఈ కళాశాలలో 40 మంది గాత్రం, 10 మంది వయొలిన్ నేర్చుకుంటున్నారు. ఫీజులులేవు. ఇద్దరు ఉపాధ్యాయులకు జీతాలతోబాటు వసతి సౌకర్యం కూడా ఏర్పాటు చేయడం జరిగింది. గత పక్షం రాష్ట్రస్థాయిలో శాస్త్రీయ, లలిత సంగీతాలలో పోటీ నిర్వహించారు.

కళల పట్ల, సంగీతం పట్ల శ్రీ ప్రభాకరరావుగారి ప్రేమను, వారికి సహకరిస్తున్న అద్దంకి వాసులను, 'హాసం' అభినందిస్తున్నది. భౌతిక అవసరాలతో బాటు మానసిక అవసరాలను కూడా గుర్తించిన అద్దంకి వాసుల నుండి ఇతరులు స్ఫూర్తి పొందుతారని ఆశిస్తున్నది.

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
K.I.Varaprasad Reddy
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

Printed at: Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

Published at: 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

Editor: RAJA

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

# ఓ మొగుడు... ఓ పెళ్లాం... ఓ తాతయ్య... అదీ స్టోరీ...!

- సూరేపల్లి విజయ



"ఛీ... ఛీ" మొహం తిప్పుకొని అంది శ్రేయ.

"నేను ఛీ ఛీ" అన్నాడు మొహాన్ని యిటు తిప్పుకొని ధనుష్.

"నేను నాలుగు ఛీ ఛీ లు" వళ్ళు మండి అంది శ్రేయ.

"నేనేనిమిది "అన్నాడు తనూ తక్కువ అన్లేదన్నట్టు ధనుష్.

వాళ్ళిద్దరి వరుస చూసి కిసుక్కుమని నవ్వింది పనిమనిషి బుచ్చమ్మ ఆనక తల బర బర గోక్కుని. ఆపైన వెక్కి వెక్కి ఏడ్చి, ఇంకేమి చేయాలో తోచక, రెండు చేతుల్తో తల పట్టుకుంది.

ఉదయం నుంచీ ఆ మొగుడు, పెళ్ళాలను చూస్తూనే వుంది. కొత్తగా పెళ్లయిన పోకడలు ఏవీ కనబడకుండా వాళ్ళిద్దరూ డైలీ టీవీ సీరియల్లోలా అర్థంలేకుండా ఒకరినొకరు తిట్టుకుంటూ చెప్పిన డైలాగునే చెప్పుకుంటూ వల వల ఏడుస్తూ, బడబడా తిట్టుకుంటూ.

చిన్నప్పటినుండి తన చేతులమీద పెరిగిన ధనుష్ ఇలా ఎందుకు తయారయ్యాడా అని తలపట్టుకుంది బుచ్చమ్మ.

* * *

పాపం తనకేమి తెలుసు ఆ దంపతుల ఫస్ట్నైట్ నాడు ఏం జరిగిందో!

శ్రేయ పాలగ్లాసు తీసుకురాగానే ధనుష్ ఆమెను పక్కన కూచోబెట్టుకున్నాడు.

'హమ్మయ్య పెళ్లయిపోయింది, ఇక ప్రేమికుల్లా మనం దొంగచాటుగా కలుసుకోనక్కరలేదు' అంది శ్రేయ.

'కరక్టే కానీ, చిన్న ఇబ్బంది ఉంది. ఆర్నెల్ల క్రితం పోయేముందు మా తాత చెప్పిన ఫ్లాష్బ్యాక్ నీకోటి చెప్పాలి' అంటూ ఆమె కళ్లముందు చక్రాలు తిప్పాడు.

* * *

"ఒరే ధనూ... యిలా రారా" ఆయాసపడుతూ పిలిచాడు ధనుష్ తాత. గోడ మీద బామ్మ ఫొటో. ఆ ఫొటోకు దండ వేలాడుతుంది.

"పిలిచావా తాతయ్యా?" తాతయ్య దగ్గరికి వచ్చి అడిగాడు ధనుష్.

"కాదురా ధనూ... అరిచాను... నాగుండె ఆగి కాదురా... నేను పిలిచిన అరుపు నాకే రీ-సౌండొచ్చి ఛస్తానేమోనని హడలి చచ్చాను" అన్నాడు గుండెను లెఫ్ట్ హ్యాండ్తో పట్టుకొని.

"తాతయ్యా... నువ్వు సీరియస్లో కామెడీ అనుకోకపోతే ఒకటి చెప్పనా?"

"చెప్పరా.. మీ బామ్మా యిలానే నాన్చి చంపేది... చివరికి చావడంలో కూడా నాన్చి నాన్చి పోయింది" అన్నాడు తాతయ్య.

'నువ్వు గుండెను లెఫ్ట్ హ్యాండ్తో పట్టుకుంటే నాకు పాత సినిమాల్లో గుమ్మడి గారు గుర్తొస్తున్నారు'' అని కిసుక్కున నవ్వబోయి తాతయ్య మొహంలోని ఫీలింగ్స్ గమనిస్తూ తమాయించుకున్నాడు.

"ఎందుకు చెబుతున్నానో అర్థం చేసుకోరా?" అన్నాడు తాతయ్య.

బుర్ర గోక్కొని ఓసారి తాతయ్య వైపు లుక్కేసి మరోసారి బామ్మఫొటో వైపు లుక్కేసి "ఏమిటి తాతయ్యా?" అడిగాడు అసలు విషయం ఏమిటో అర్థం గాక.

"నువ్వా ఎర్రతోలు పిల్లను ప్రేమిస్తున్నావు కదూ" అడిగాడు తాతయ్య.

మొహన్ని చేతుల్లోకి దాచుకుని "ఛీ..పో తాతయ్యా... నగ్మా ఎక్కడైనా నన్ను ప్రేమిస్తుందా? చింపూ, శరత్కుమార్ లాంటి వాడినా నేను... కనీసం క్రికెటర్ కూడా కాదు" అన్నాడు బుంగమూతిపెట్టి.

'హుం.. నువ్వా మీనింగ్లో అర్థం చేసుకున్నావా? నేనన్నది పక్కింటి శ్రేయ గురించి.. ఆ అమ్మాయి కూడా నగ్మాలానే వుంటుంది కదా... పేరు నోరుతిరగక అలా అన్నానన్నమాట'' క్లారిఫికేషన్ యిచ్చి క్లాసు పీకాడు తాతయ్య.

"ఓహో అదా.. అవును.. ప్రేమిస్తున్నాను".

"ఎందుకు చెబుతున్నానో అర్థం చేసుకోరా" మళ్ళీ అన్నాడు తాతయ్య.

"తాతయ్యా అసలు విషయం చెప్పకుండా నువ్వలా ఎందుకు చెబుతున్నానో అర్థం చేస్కోరా... చేస్కోరా అన్నావంటే నీకన్నా ముందు, ఆ సస్పెన్స్తో నరాలు తెగి నేను పుటుక్కున పోతాను" వళ్ళు మండి అన్నాడు ధనుష్.

"అదేరా...నువ్వు... ఆ శ్రేయా పెళ్ళయ్యాక కూడ ప్రేమించుకోవాలి... ప్రేమికుల్లానే వుండాలి".

"అంటే.. అదాద్దా తాతయ్యా".. మళ్ళీ సిగ్గుపడుతూ చొక్కాచివర్లు నోట్లో పెట్టుకుని అడిగాడు ధనుష్.

'ఇలా అయితే నేను 'ఠపీ'మని చచ్చిపోతానంతే. నేనేది మొగుడు పెళ్ళాల్లా కాక ప్రేమికుల్లా వుండమని...అని ఓ సారి దగ్గి మీరు ప్రేమించుకున్నప్పుడు ఎలా వున్నారో అలాగే ఉండాలి. మారిపోకూడదు అంతే...ఎందుకు చెబుతున్నానో అర్థం చేస్కోరా" అంటూ రెండు మూడు సార్లు దగ్గి... దగ్గి ఏదో చెప్పబోతూ పుటుక్కుమని బాల్చీ తన్నేసాడు. కాళ్ళదగ్గరున్న బకెట్‌లోని నీళ్ళు కింద ఒలికిపోయాయి.

* * *

"అంటే మనం లవర్స్‌లాగే కంటిన్యూ అవ్వాలంటే ఏం చెయ్యాలి? నువ్వు నాకోసం బస్‌స్టాపు దగ్గరే కాపు కాయాలా? నేను మా తమ్ముడి ద్వారానే లవ్‌లెటర్స్ పంపాలా?" అడిగింది శ్రేయ.

"తమ్ముడు అక్కర్లేదుగానీ డైరక్టుగా ఇయ్యి. అది రాగానే నేను మా ఫ్రెండ్స్ పదిమందికి పార్టీ ఇవ్వాలి" అన్నాడు ధనుష్.

"అంటే మీ నుంచి గ్రీటింగ్స్ రాగానే నేనూ మా ఫ్రెండ్స్‌కి ఐస్‌క్రీములు కొనిపెట్టాలా?"

"అంతేకాదు, మనిద్దరం కలిసి షాపింగ్‌కి వెళ్ళినప్పుడు నువ్వేమైనా అడిగితే ఎంత రేటైనా సరే నేను కొనాలి. ప్రేమికుల దినం నాడు ఇద్దరి జేబుల్లోనూ ఉన్నదంతా ఖర్చు పెట్టేయ్యాలి..." చెప్పుకుపోతున్నాడు ధనుష్.

"...ఆగాగు, ఇవన్నీ చేయాలంటే నీ జీతం ఏ మూలకు చాలదు. మనం అప్పులపాలయిపోతాం. ఇదేం బాగోలేదు. పెళ్ళయిన తర్వాత మొగుడూ పెళ్ళాల్లా ఉండాలి కానీ ప్రేమికుల్లా ఉండడమేమిటి? నో"

"మొగుడూ పెళ్ళాల్లా అంటే...?"

"...అంటే... కొత్తేముంది? మీ అమ్మానాన్ననూ, మా అమ్మానాన్ననూ పక్కింటి వాళ్ళనూ చూట్టంలేదూ అలాగే... పగలంతా పోట్లాడుకోవడం, రాత్రి కలవడం మళ్ళీ తెల్లవారగానే పోట్లాడుకోవడం.. ముందు నిన్ను 'మీరు' అంటాను. అంది శ్రేయ.

"సరే, కానీ, నీ యిష్టం" అన్నాడు ధనుష్.

బుచ్చమ్మ చూసిందిఆ ప్రకారం జరుగుతున్నదే!

* * *

"గుడ్ మార్నింగ్ డాళింగ్" అంటూ పొద్దున్నే లేచి పాల పాకెట్ కోసం పాలబూతుకు వెళ్ళబోయిన ధనుష్‌కు తమ ఒప్పందం గుర్తొచ్చి మొగుడిలా మారిపోయి...




"ఒసే దిబ్బ మొహం దానా...టైం ఆరు కొట్టింది. యింటి ముందు ఎవడూడ్చి... ముగ్గేస్తాడనుకున్నావు? లేచి చావు".. అన్నాడు లోలోపల యిదేదో బాగానే వుందని చంకలు గుద్దుకుంటూ.

మొగుడి తిట్లకు ఉలిక్కిపడి, కళ్ళలో నీళ్ళు కక్కుకోబోయి, రాత్రి ఒప్పందం సంగతి గుర్తొచ్చి... వెంటనే తనూ పెళ్ళామ్ పొజిషన్‌లోకి షిఫ్టయిపోయింది.

"దున్నపోతులా వున్నారు.. ఒక్కరోజు ఊడ్చి కళ్లాపి చల్లి ముగ్గేస్తే చేయి అరిగిపోతుందా? మీ నోరు హుసేన్‌సాగర్ కంపులో మునిగిపోనూ" అంటూ మెటికలు విరిచింది.

'ఒసే నా పెళ్ళామా... నీకింత టాలెంట్ వుందా?' అని ఒక్క క్షణం పెళ్ళామ్ మెటికలు విరిచిన ప్రోగ్రామ్ చూసి ఆశ్చర్యపోయి చచ్చూరుకున్నాడు.

* * *

"ఆఫీసు టైమయి చచ్చింది.. టిఫిన్ తెచ్చి టేబుల్ మీద పెట్టి తగలడు" డైనింగ్ హాలులో కూచొని అరిచాడు... ధనుష్. కిచెన్ రూమ్‌లోకి తొంగి చూస్తూ ఇడ్లీ ప్లేట్ తెచ్చి "ఇదిగోండి మింగి చావండి.. దరిద్రపు సంత"... అంది శ్రేయ.

ధనుష్ కోపంగా శ్రేయ వంక చూసి యిడ్లీ ముక్క నోట్లో పెట్టుకొని తుపుక్కున ఉమ్మేసి...

"ఛ...ఛ... ఈ ఇడ్లీ గాడిదలు తినాలనా?" అన్నాడు.

"నేను చేసింది వాటికోసమే.... కాకపోతే... లు... అక్కర్లేదు" అంది అరుస్తూ.

* * *

"కాఫీ అయినా తెచ్చి తగలెట్టు" అన్నాడు ధనుష్.

"ఎక్కడ తగలెట్టాలి?" కాఫీ కప్పు తెచ్చి అడిగింది శ్రేయ.

"నా నెత్తిమీద" వళ్ళు మండి చెప్పాడు ధనుష్.

కాఫీ కప్పును కామ్‌గా ధనుష్ తల మీద పెట్టి వెళ్ళింది శ్రేయ.

బిక్కచచ్చి... చచ్చి చెడి నెత్తిమీద కప్పును తీసుకుని కాఫీ తాగేశాడు ధనుష్.

* * *

సాయంత్రం సినిమాకు బయల్దేరారు. సినిమాకు రమ్మని ధనుష్, రానని శ్రేయ... పెళ్ళికి



ముందయితే ఎవరడిగినా యిద్దరూ సంతోషంగా తయారయి దొంగతనంగా ఒకరికంటే ముందుగా మరొకరు అక్కడికి చేరేవారు. ఇప్పుడు బతిమాలించుకుని బయలుదేరింది శ్రేయ.

రోడ్డు మీద నడుస్తున్నారు. ఓ అమ్మాయి స్టయిల్‌గా వెళ్తుంటే దొంగకారుస్తూ చూసాడు ధనుష్.

అది రోడ్డని కూడ చూస్కోకుండా, అతని కాలు గట్టిగా తొక్కింది శ్రేయ. ఇది వరకైతే హాయిగా జోక్‌వేసేది. ధనుష్ సీరియస్‌గా భార్యకేసి చూసి అది రోడ్డని గుర్తొచ్చి, కామ్‌గా వూర్కుండిపోయాడు. లోలోపల పళ్ళు పట పటలాడిస్తూ!

ఎప్పుడు సినిమాకు వెళ్ళినా మల్లెపూలు కొనేవాడు ధనుష్. ఆ పూలని చూసి పులకించి తలలో పెట్టుకుని మా మంచి ధనుష్ అని తెగ మురిసి పోయేది, ఆ రోజా ఇంట్రవెల్‌లో తెచ్చాడు. కానీ ఇప్పుడు మాత్రం శ్రేయ...

'హు... సెకండ్ హ్యాండ్‌వి తెచ్చారా? ఎవరో పెట్టుకుని వాడిపోయాక, సగం రేటుకు అమ్మేసి వుంటారు'' అంది.

'నేనూ హుఁ... నిన్ను చూస్తుంటే డోకొస్తుంది.. ముసలి.. ముతక డొక్కులా అయిపోయావ్. పక్కింటి ఐశ్వర్యరాయ్ చూడు... ఎంత బావుంటుందో... అంతెందుకు సౌందర్య చూడు... అబ్బ... అందం అంటే అది'' అన్నాడు ధనుష్.

"మరే... హృతిక్కు ఎంతబావుంటాడు. అమితాబ్ సన్ అభిషేక్... మీసాల్లేకున్నా హిందీ హీరోలు బావుంటారు. సూపర్‌స్టార్ కృష్ణ యిప్పటికీ హ్యాండ్‌సమ్మే... మీరు అందులో 'సమ్' కూడా లేరు'' అంటూ మెటికలు విరిచే ప్రోగ్రామ్ మొదలెట్టి నాన్‌స్టాప్‌గా కంటిన్యూ చేసేసింది శ్రేయ.




అదిగో... అలా ట్రాక్ తప్పి గొడవైపోయింది.

వాళ్ళిద్దరూ మొగుడూ పెళ్ళామ్స్ ఆటలో జీవించిపోయారు. ఉదయం నుంచి రాత్రి వరకు యిదేవరుస.

ఈ వరస మూడు రోజులు వరుసగా చూశాక బుచ్చమ్మ ఓ సాయంత్రం శ్రేయను కూచోబెట్టి అడిగింది.

"అమ్మా, ఈఇల్లింట్లో నలభై ఏళ్ళుగా పనిచేస్తున్నాను. బాబును ఇంతప్పటి నుంచీ ఎరుగుదును. గట్టిగా మాట్లాడి ఎరగడు. అలాటిది ఇప్పుడేటమ్మా... ఇలాగ.. ఏం జరిగింది?''

"మొగుడంటే ఇలాగే ఉండాలిగా'' అంటూ శ్రేయ తాతయ్య గాథంతా చెప్పుకొచ్చింది. ఇంతలో ధనుష్ కూడా ఆఫీసు నుండి తిరిగి వచ్చాడు. అంతావిని బుచ్చమ్మ పకపక నవ్వింది.

"బాబూ తాతగారు మీ బామ్మ చేతిలో ఎన్ని అవస్థలు పడ్డాడో గుర్తులేదూ'' అని అడిగింది.

సరిగ్గా అప్పుడు గుర్తొచ్చాడు బాల్చీ తన్నేసిన తాతయ్య. బాల్చీ తన్నేస్తూ కూడా "ఎందుకు చెబుతున్నానో అర్థం చేస్కోరా'' అన్నాడు.

అలా ఎందుకు చెప్పాడో ఇప్పుడర్థమయింది.

'తాతయ్యా... గోడకు వేలాడేసిన బామ్మ ఫోటో ఎందుకు చిటపటలాడుతూ వుంటుందో, నువ్వెందుకు ఎప్పుడు నెత్తిమీద బొడిపలు కనిపించకుండా టోపీ పెట్టుకుంటావో, అర్థమైంది.' అని కూడా అనుకున్నాడు జాలిగా తాతయ్యను తలచుకుని.

దాంతో పాటు అతనికి మరో విషయం కూడా అర్థమయింది. భార్యా భర్తలు మోడర్న్ ప్రేమికుల్లా వుండాల్సిన అవసరం లేదు. సగటు మొగుడు పెళ్ళాలలాగా ఉండక్కర్లేదు. ఒకరినొకరు అర్థం చేసుకొని స్నేహితులుగా మసలుతూ సఖ్యంగా ఉండవచ్చు.

మొగుడని పెళ్ళాం మీద పెత్తనం చెలాయించడం... పెళ్ళామే కదా అని నిర్లక్ష్యం చేయడం... ఎప్పుడు రోజా చూసే ఫేసే కదానని అనుకోవడం... చేయకూడదు... భార్య భర్తల్లా వుంటూ ప్రేమికుల్లా ప్రేమించుకోవాలి.

* * *

అదే సమయంలో శ్రేయ కూడా అలానే ఫీలయింది. మొగుణ్ని ఉత్తి పుణ్యానికే అనుమానించడం, సాధించడం చేయకూడదు. భర్తను నిరంతరం ప్రేమిస్తూ వుండాలి. ఎప్పుడూ ప్రేమతాలూకు ఫ్రెష్‌నెస్ పోనివ్వకూడదు. కాలం గడిచే కొద్ది మంచులా కరిగిపోయేది ప్రేమ కాదు. అలా కరిగి పోకుండా మనసు ఫ్రీజర్‌లో ప్రేమను భద్రపర్చుకోవాలి.

* * *

**ఫినిషింగ్ టచ్**

"హేవండీ... మొగుడు కమ్ లవర్ కమ్ ఫ్రెండుగారూ'' అంటూ ధనుష్ చొక్కాగుండీలు పీకి... "నాకు సిగ్గేస్తుంది'' అంది శ్రేయ.

'సేమ్ డైలాగ్, సేమ్ ఎమోషన్' అన్నాడు ధనుష్ ఆమె వైపు ప్రేమగా చూస్తూ.



పిఠాపురం నాగేశ్వరరావు వర్ధంతి (మార్చి 5) సందర్భంగా...

# హాస్య గీతాల గోపురం పిఠాపురం



భారతీయ చలన చిత్రసీమను పరిశీలిస్తే జంట గాయకులు అంటే గుర్తొచ్చేది మాధవపెద్ది-పిఠాపురం జంటే. యాభై వసంతాల పాటు తమగాన వైభవంతో చకచ్చకితం చేసిన "పిఠాపురం నాగేశ్వరరావు - మాధవపెద్ది సత్యం"లను వేరు వేరుగా చేసి మాట్లాడటం, అరుదు.

తూర్పుగోదావరి జిల్లా పిఠాపురంలో 1930 మే 5న విశ్వనాథం-అప్పయమ్మ దంపతులకు జన్మించిన నాగేశ్వరరావు ఇంటి పేరు "పాతర్ల గడ్డ" వారు. ఊరి



పేర్లను తమ పేరుకు ముందు చేర్చుకోవడం కేరళీయుల, తమిళుల సంప్రదాయం. తెలుగులో అలా ఊరి పేరుతో ప్రశస్తిగాంచిన వారిలో మొదటి వ్యక్తి చిత్తూరు (ఉప్పల దడియం) నాగయ్య కాగా రెండవవారు మన పిఠాపురం నాగేశ్వరరావు. పిఠాపురంలోనే ఆర్.ఆర్.బి హెచ్.ఆర్. ప్రభుత్వ హైస్కూల్‌లో ఎస్.ఎస్.ఎల్.సి. దాకా చదివిన పిఠాపురం చిన్ననాటనే రంగస్థలంపై కాలుమోపారు. తండ్రి విశ్వనాథం కూడా రంగస్థల నటుడే కావడం వల్ల తగు ప్రోత్సాహం లభించింది.

గొప్ప అందగాడు కాకపోయినా, చక్కని స్వరంతో బాగా పాడేవారు పిఠాపురం. 1944లో స్నేహితులు చెలికాని భాస్కరరావు, రేగిల్ల సుబ్బారావుల ఆధ్వర్యంలోని "నవ్య కళా సమితి" వారి నాటకాల్లో నటించారాయన.

## అపూర్వ సహోదరులు



పిఠాపురం నాగేశ్వరరావు సినీ కెరీర్‌లో పాడిన పాటలన్నీ ఒక ఎత్తు కాగా మాధవపెద్ది సత్యంతో కలిసి పాడిన పాటలు, కలిసి చేసిన స్టేజీ ప్రోగ్రామ్స్ ఒక ఎత్తు. వీరిరువురు కలిసి ఆంధ్రప్రదేశ్ గాక కలకత్తా, ముంబైల్లో స్టేజీ ప్రదర్శనలిచ్చారు. 'అవేకళ్లు'లో ఘంటసాలతో పాడిన "మా వూళ్లో ఒక పడుచుంది" పాటను స్టేజీ ప్రోగ్రామ్స్‌లో మాధవపెద్దితో పాడి సినిమాల్లో కూడా వారిరువురే పాడేరేమోనన్నంత భ్రమను కలిగించేవారు స్టేజీపై "అన్నా-తమ్ముడూ..." అంటూ చేసే చిలిపి చేష్టలు ప్రేక్షకులను అలరించేవి.

పిఠాపురం సత్యంతో కలిసి పాడిన పాటల్లో "అయ్యయ్యో చేతిలో డబ్బులు పోయెనే" (కులగోత్రాలు) "ఆ దేవుడు మనిషిగా పుట్టాలిరా"(అంతస్థులు), "రావేలా దయరాదా"(కథానాయకుడు), "తోలు తిత్తి ఇది పరా మన తోటిగెల్చె ధీరులెవ్వరురా" (సువర్ణసుందరి), "తోలు తిత్తి ఇది తూటులు తొమ్మిది" (పాండురంగ మహత్యం), వంటివి కొన్ని మాత్రమే.

శ్రీకృష్ణ తులాభారం, బాలనాగమ్మ, కృష్ణార్జునుల యుద్ధం, దేవదాసు, ఏకలవ్య, లోభి, చింతామణి, రంగూన్‌రౌడి తదితర నాటకాల్లో అర్జునుడు, కృష్ణుడు, దుర్యోధనుడు, శ్రీహరి, సుబ్బిశెట్టి వంటి పాత్రలు పోషించారు. మరో విశేషమేమిటంటే పాడుకోలేని ఇతర నటీనటులకు తెర వెనుక నుండి పాటలు, పద్యాలు, శ్లోకాలు పాడే విధానానికి శ్రీకారం చుట్టింది పిఠాపురం వారే. నాటక రంగంలో రాణిస్తున్నా "నటకులు పంక్తి బాహ్యులు"గా ఇరుగు పొరుగువారు అంటుండటంతో తల్లిదండ్రులు నాటకాలు వదల మన్నారు. కానీ పిఠాపురం ఓ అడుగుముందుకు వేసి సినిమాల్లో పాడాలని, ఆడాలని ఇంట్లో ఎవరికీ చెప్పకుండా మద్రాసు చేరుకున్నారు.

మద్రాసులో దిగి జేబులో చూసుకుంటే ఉన్నవి 10 రూపాయలే. అవి ఖర్చవగానే హోటల్‌లో సర్వర్‌గా చేరారు. కొంతకాలం బంధువుల ఇంట్లో తల దాచుకున్నారు. 1946 మే నెలలో తొలిసారిగా కోన ప్రభాకరరావు నిర్మించిన 'మంగళసూత్రం'లో "హాయిగా పాడవే కోయిలా" పాటపాడి సినీరంగ ప్రవేశం చేశారాయన. పారితోషికంగా 250 రూ॥లు అందుకున్నారు. కాగా, ఆ తొలి పాట పాడే నాటికి ఆయన వయసు 16 ఏండ్లే. ఆ వెంటనే "పల్నాటి యుద్ధం" (1946)లో హిందీ, తమిళంలోని జెమినీ వారి 'చంద్రలేఖ'లో పాడే అవకాశాలు వెంట వెంట రావడంతో పిఠాపురం గాయకుడిగా పరిశ్రమలో నిలద్రొక్కుకున్నారు.

ఎల్.వి.ప్రసాద్ దర్శకత్వంలో వచ్చిన 'ద్రోహి' (1948)లో "నవ్వ రాదె బుల్ బుల్" పాట పిఠాపురం నాగేశ్వరరావుకు మంచిపేరు తెచ్చిపెట్టింది. వింధ్యరాణి, సౌదామిని, మదాలస, మాయారంభ వంటివి పిఠాపురం పాడిన తొలితరం చిత్రాలు. అయితే 50 దశకం ఆరంభం నుండి సుమారు ఓ పాతికేళ్ల పాటు అంటే 1975 దాకా పిఠాపురం పాడని సినిమా లేదంటే అతిశయోక్తికాదు. పిఠాపురం పాడిన సోలో పాటలు, యుగళగీతాలు దాదాపుగా అన్నీ హాస్య గీతాలే. ఇక మాధవపెద్దితో కలిసి పాటల గురించి చెప్పనవసరంలేదు.

ఆయన పాడిన పాటలు ఇప్పటికీ తొలి, మలితరం సినీ గీతాభిమానులను అలరిస్తూనే ఉన్నవి. తెలుగులోనే గాక తమిళ, సింహళ, కన్నడ, హిందీ భాషల్లో మొత్తం 7 వేల పాటలు పాడారు పిఠాపురం.

ఘంటసాలతో ఆయనకు సన్నిహిత సంబంధాలుండేవి. ఆయన ప్రోత్సాహంతోనే ఎక్కువ పాటలు పాడినట్లు పిఠాపురం చెప్పుకునే వారు. 'మాఊళ్లో ఒక పడుచుంది' (అవేకళ్లు) పాటను ఘంటసాలతో కలిసి పాడారు. పి.బి.శ్రీనివాస్‌తో 'గూటిలోన చిలక' (సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి), 'హల్లో మేడం సత్యభామ పైన కోపం లోన ప్రేమ' (లేత మనసులు) పాటలు పాడారు.

పిఠాపురం-మాధవపెద్ది సత్యంతో కలసి రేలంగి-రమణారెడ్డిలకు ప్రధానంగా పాడారు. వీరిరువురు సోలోలుగా బాలకృష్ణ, పద్మనాభం, రాజబాబు, తదితరులకు పాడారు.

ముఖ్యంగా చెప్పుకోవలసినది మరొకటుంది. అక్కినేనిగారికి తొలి చిత్రాల్లో గాత్రమందించిన వారిలో పిఠాపురం కూడా ఒకరు. ఇంకా కన్నడంలో రాజ్‌కుమార్, ఉదయకుమార్, తమిళంలో శివాజీ గణేశన్‌లకు కూడా పాడారాయన.

50 సంవత్సరాలు సినీ గాయకునిగా ఆయన సేవలకు గుర్తింపుగా మద్రాసు సంగీత అకాడమీ వారు 'ఆంధ్రా మహమ్మద్ రఫీ' బిరుదునిచ్చారు. కళాసాగర్‌వారు 'జనతా సింగర్', యువకళా వాహిని వారు 'గానగంధర్వ' బిరుదాలతో గౌరవించారు. 1996 ఫిబ్రవరి 11న విశాఖలో ఘంటసాల వర్ధంతి సభలో సుబ్బిరామిరెడ్డి 10 వేల రూ॥ల నగదుతో సత్కరించారు. ఇంకా హెచ్.ఎం.వి. వారి సన్మానం కూడా అందుకున్నారాయన. 1975లో భార్య, 1985లో కొడుకు మృతిచెందడంతో 1986లో స్వగ్రామం పిఠాపురం తిరిగి వచ్చారు. అప్పటికే దాదాపుగా తెరమరుగైన పిఠాపురం చివరి పాట "బొమ్మరిల్లు" (1978)లో "చల్లని రామయ్య - చక్కని సీతమ్మ" పాడారు. 1996 మార్చి 5న మృతి చెందిన పిఠాపురం నాగేశ్వరరావు సినీ హాస్య గాన శిఖరంగా మరపురారు మనకు.

-హెచ్.రమేష్‌బాబు

# పిఠాపురం హిట్స్

## చిత్రం: ఉమా సుందరి (1956)

రచన: సదాశివబ్రహ్మం సంగీతం: అశ్వత్థామ

మాయా సంసారం తమ్ముడూ ఇది మాయా సంసారం తమ్ముడూ
నీ మదిలో సదాశివుని మరువకు తమ్ముడూ ॥మాయా॥
ముఖము అద్దము ఉందీ మొగమాటమెందుకు
సుఖ దుఃఖములు లెక్కి చూసుకో తమ్ముడూ ॥ముఖ॥
సకల సమ్మోహన సంసారమందున ॥2॥
సుఖాలు సున్నా దుఃఖాలే మిగులన్నా ॥2॥ ॥మాయా॥
కోరి తెచ్చుకున్న భారమంతే కానీ
దారా పుత్రులు నిను దరి జేర్చుతారా ॥కోరి॥
పేరు చూసి నిజమూ తెలుసుకో తమ్ముడు ॥2॥
భారం సత్యం సర్వం పరమాత్మ ॥మాయా॥
వచ్చినప్పుడు వెంట తెచ్చినదేముంది ॥2॥
పోయేటప్పుడు కొని పోయేదేముంది ॥2॥
అద్దె కొంప లోకమంతేరా తమ్ముడు
వద్దు పొమ్మన గానే వదిలేసి పోవాలి ॥మాయా॥

## చిత్రం: సంఘం (1954)

రచన: తోలేటి సంగీతం: ఆర్.సుదర్శనం

పెళ్ళీ... పెళ్ళీ పెళ్ళీ పెళ్ళీ...
ఈడైన దానితో జోడీగా హాయిగా ॥ఈడైనా॥
ఈలోకమందు సౌఖ్యాల పొంది అనందమొందగా
పెళ్ళీ... భలే మజా పెళ్ళీ... ఆహాహా పెళ్ళీ...
పందిళ్ళకింద విందులు చేసే అత్తిల్లే స్వర్గం ఆనందమార్గం
భూలోక స్వర్గం ఆనందమార్గం
పందిళ్ళకింద విందులుచేసే అత్తిల్లే స్వర్గం ఆనందమార్గం
అమ్మాయికి అబ్బాయి అబ్బాయికి అమ్మాయి ॥2॥
చేరిన సంసార జీవితం భలే భలే
చేరిన సంసార జీవితం సంఘంలో పూజితం
ఈ లోకమందు సౌఖ్యాల పొంది ఆనందమొందగా
పెళ్ళీ... ఛంఛంఛం పెళ్ళీ... డుండుండుం పెళ్ళీ
ప్రేమకి జాతి కీర్తి నీతి రీతి లేదయ్యోయ్
తెలుపు నలుపు లేదయ్యోయ్
మూడు ముళ్ళు వెయ్యయ్యోయ్
పెళ్ళీ... జిల్ జిల్ జిల్ పెళ్ళీ... టకటకటక పెళ్ళీ
దేవుడు నన్నే చల్లగ చూస్తే
అప్పుడే నాకు అవుతుంది పెళ్ళి నాకూ అవుతుంది పెళ్ళి ॥దేవుడు॥
సరోజ గిరిజ వనజ జలజ మాలతి మాధవి మల్లిక మోహిని
ఎవతో ఓ భామిని ఆమే నీ కామిని
పట్నం పిల్లో పల్లెటూరి పిల్లో చిక్కిన రాజా చక్కిరకొట్టు
జణక్కు తకథిమి జణక్కు తకథిమి టికుటికుటికుడుండుం
వైవాహ కంకణం ప్రాప్తి బంధనం దైవ నిర్ణయం ॥వైవాహ॥
పెళ్ళీ... తళుక్కుజన పెళ్ళీ...
తదిగిణతోం పెళ్ళీ ॥ఈడైనా॥

## చిత్రం: లక్ష్మీనివాసం (1967)

రచన: ఆరుద్ర సంగీతం: కె.వి.మహదేవన్

సోడా సోడా ఆంధ్రసోడా!
గోలిసోడా! జిల్ జిల్ సోడా!
సోడా తాగు తెలుగోడా - చల్లని సోడా
దీని మహిమ చెప్పలేడు దేవుడుకూడా
నెత్తిమీ గంగవున్న ఈశ్వరుడైనా - అహ
నిత్యసుధలు తాగుతున్న దేవతలైనా
నెత్తిమీ గంగవున్న ఈశ్వరుడైనా - అహ
నిత్యసుధలు తాగుతున్న దేవతలైనా
ఆంధ్రసోడా కోరికోరి తాగుతారోయ్ - అది
లేకుంటే వడదెబ్బకు వాడుతారోయ్ ॥సోడా॥
నాయకులు చెప్పేది ఉత్త గ్యాసు - వి
నాయకుల చప్పట్లు శ్రుద్ధ గ్యాసు
పోసుకోలు పాలిటిక్సు పరమ గ్యాసు
పోసుకోలు పాలిటిక్సు పరమ గ్యాసు
వాటికన్న ఉపయోగం సోడా గ్యాసు ॥సోడా॥
ఒక్కగుక్క తాగిచూడు మండుటెండలో -అహ
హిమాలయం చల్లదనం నీ గొంతుకలో
ఒక్కగుక్క తాగిచూడు మండుటెండలో -అహ
హిమాలయం చల్లదనం నీ గొంతుకలో
రాళ్ళు తిని తాగితే జీర్ణ మవాలి - ఆ
నీళ్ళు తాగితే సగం కడుపు నిండాలి
సోడా సోడా ఆంధ్రసోడా!
గోలిసోడా! జిల్ జిల్ సోడా!
సోడా తాగు తెలుగోడా - చల్లని సోడా
దీని మహిమ చెప్పలేడు దేవుడుకూడా

## చిత్రం: జయసింహ (1955)

రచన: జూ॥సముద్రాల సంగీతం: టి.వి.రాజు

అరెరెరెరెరె వినండిబాబూ
యిదేనండి లోకం తీరూ
ఈ జనంపోకడా యిదేనండీ
అరె నిసగమపా లోకం మోసం పామగరిసా ॥2॥
మోసం మోసం అంటారంతా ॥2॥
మోసం చెయ్యని దెవ్వరంటా ॥నిస॥
ఆయాసమంతా గ్రాసంకోసం
లోకం పలువేషం ఈ లోకం పలువేషం
జగమంతా బల్ మోసం ॥అరె నిస॥
మోసాలు చేసి మోక్షం కోరి
యిచ్చే టెంకాయా దేవుడికిచ్చే టెంకాయా! ॥అరె నిస॥
అడుక్కుతినటం మరిగినవాళ్ళ
కాళ్ళు, కళ్ళూ, కీళ్ళూ, మోకాళ్ళూ, కళ్ళూ, కీళ్ళూ!
వ్యాపారి వాడే తరాసుముల్లూ
తక్కెడలో రాళ్ళూ అరె అంతా మోసంరా
జగమంతా వేషంరా ॥అరె నిస॥



ప్రముఖ గాయకుడు, స్వరకర్త లలిత సంగీత విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.

ఫోన్ నెం. 040-7402993

# లలిత సంగీతం

## కైలాసవాస శివశంభో

కైలాసవాస శివశంభో కైవల్యదాత భవశంభో
గౌరీవరా గంగాధరా కరుణాకరా హరా శంభో

అ॥ ఫాలనేత్రా మమ్ము పాలింపవా - శూలహస్తా మా మొరాలింపవా
సకల భువనావనా పతిత జనపావనా - సురమౌనిహృత్సదన
శ్రీ చంద్రశేఖరా శివశంకరా అర్ధనారీశ్వరా అభయంకరా ॥గౌరీవరా॥

చ॥ దివ్యద్వాదశిలింగరూపా భవ్యమానవ కోటి హృదయ మణి దీపా
సోమేశ మల్లేశ కాలేశా త్రిపురేశ - శ్రీ వైద్యనాథేశ నాగనాథేశా
శ్రీకేదారేశత్ర్యంబకేశా - రామేశ భీమేశ విశ్వేశ్వర ఘృష్ణేశ
తరియింపజేయగా తరలిరావా - తల్లి పార్వతిగూడి కాన రావా
పాహిమాంపాహిహే పరమేశ్వరా - త్రాహి మాం త్రాహి హే జగదీశ్వరా ॥గౌరీవరా॥

చ॥ చిత్తరంజన గానలోలా - చిరయశము నొసగుమా శ్రితపాలా
సుగుణాలవాలా జాలమిక ఏలా - దీనార్త జనులమము కృపనేల
పాహిమాంపాహి హే పరమేశ్వరా - త్రాహి మాంత్రాహిహే జగదీశ్వరా ॥గౌరీవరా॥



రచన, సంగీతం : మహాభాష్యం చిత్తరంజన్
గానం : బృందగానం
రాగం : శివరంజని
తాళం : ఖండచాపు (కర్ణాటక సం॥)
ఝప్ తాల్ (హిందుస్తాని సం॥)

ఆరోహణ: స రి గ ప ద స
అవరోహణ : స ద ప గ రి స

షడ్జము, చతుశృతి రిషభం, సాధారణ గాంధారం, పంచమం, చతుశృతి దైవతం యీ రాగంలోని స్వరాలు.

కర్ణాటక శాస్త్రీయ సంగీతంలోని శివరంజని రాగాన్ని ఎక్కువగా లలిత శాస్త్రీయ, లలిత సంగీతాలకే ఉపయోగించడం జరుగుతున్నది. సంగీత త్రిమూర్తులయిన త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితర్, శ్యామ శాస్త్రి, తరువాతి తరంవారయిన పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్ మున్నగువారు ఎవరూకూడా యీ రాగంలో కీర్తనలు రచించినట్లు కనబడదు. ఆధునిక వాగ్గేయ కారులైన శ్రీ బాలమురళీకృష్ణగారు మాత్రం యీ రాగంలో "శ్రీ రాజ రాజేశ్వరా" అనే కీర్తనను రచించి వేములవాడలో స్వామివారి సమక్షంలో గానం చేశారు. లలిత సంగీతంలో యీ రాగం బాగా ప్రచారంలో వుంది. అంతరగాంధారాన్ని కూడా కలుపుకుని యీ రాగంలో లలిత గీతాలకు బాణీలు కూర్చడం పరిపాటి. ఎంతోమంది స్వరకర్తలు సుమధురమైన గీతాలు మనకందించారు. ఆకాశవాణిలోను, చలన చిత్రాలలోనూ ఈ రాగంలో పలు భాషలలో సైతం మంచి పాటలు వచ్చాయి. లలిత సంగీతంలో, ఆకాశవాణిలో శివరంజని, మిశ్ర శివరంజని ఆధారంగా వివిధ స్వరకర్తలు అందించిన గీతాలెన్నో వున్నాయి. నా సంగీతంలో "నను విడువ బోకుమా క్షణమైన ప్రియతమా" (గానం: శివకామేశ్వరి, రచన : బాలకృష్ణ ప్రసాద్). క్రీస్తు జననం సందర్భంగా "నీలి నీలి గగనంలో ఒక తార మెరిసింది" (గానం : మోహనరాజు, వేదవతి రచన : ఫాదర్ మధ్యాన్ రెడ్డి), పి.వి.సాయిబాబా సంగీతంలో "శ్రీ వేంకటేశా తిరుమలేశా" (గానం: శశికళ, రచన:డా॥జె.బాపురెడ్డి), రజనీగారి సంగీతంలో "తళుకు జల్తార్ బుటాలల్లిన నీలవల యమ్మీ గుడారం" (బృందగానం, రచన:కృష్ణశాస్త్రి) మొదలగునవి మచ్చుకుకొన్ని.



భజన సంప్రదాయం మనకు అనాదిగా వస్తున్న విధానమే. సరళమైన బాణీతో పదిమంది కలిసి సామూహికంగా గానం చేయడానికి వీలుగా ఉండే విధాన మిది. అన్నమయ్య, పురందరదాసు, రామదాసు, తూము నరసింహదాసు మొదలగు వారి రచనలు అధికశాతం ఈ కోవలోవే. త్యాగరాజస్వామివారు కూడా అందరికీ అందుబాటులో ఉండే విధంగా భజన సంప్రదాయం, ఉత్సవ సంప్రదాయ కీర్తనలు రచించారు. అవన్నీ నేటికీ అందరూ పాడుతూంటారు.

ప॥ దస సాస | సరిస దప | దాసా, | ;;, | దస సరిరి | రిగరిస ద | సగరి, | ;;, |
కై . లా స | వా . స శివ | శంభో. | . . . | కై . వ . ల్య | దా . య క వ | శం . భో | . . . |

దరిసరిస | దా ;, | పస దస ద | పా ;, | గపదసస | సద గరి | స దసా, | ;;, |
గౌ . రీ . వ | రా . . | గం . గా . ధ | రా . . | కరుణా . క | రా . హరా | శం . భో . | . . |

అ॥ పదదదా | దాపాగ | గపపదప | దా ;, | పదసదప | పాపగగ | రిగగదప |
ఫా . లనే | త్ర మమ్ము | పా . లిం . ప | వా . . | శూ . లహ . | స్తా మా . మొ | రా . లిం . ప |
పా ;, | గపపపప | పదపగరి | గపపపప | పదపగరి | గగపగప | దాసదప |
వా . . | సతలభువ | నా . వనా . | పతితజన | పా . వనా . | సురమా . ని | హృత్సదన |
పపదసద | సా ;, | దస సాస | సరిస దప | పపదసద | సా ;, | దాస సరి | రిగరిసద |
ఋషిజీ . వ | నా . . | శ్రీ . చంద్ర | శే . ఖరా . | శివశం . క | రా . . | అర్ధ నా . | రీ . శ్వరా . |
దసససగస | రి ;; |
అభయం . క | రా . . || గౌరీవరా ||

1.చ॥ పదదపద | దదపాగ | పాదా, | ;;, | పదదపద | సదపగగ | రిగగసరి | గదపా, |
ది . వ్యద్వా . | దశ లింగ | రూపా . | . . . | భ . వ్యమా . | నవకో . టి | హృదయమణి | దీ . పా . |
పదపాగ | గపపాప | పదపాగ | గపపాప | గాపగప | దసదాప | పదపగప | దాదా, |
సో . మేశ | మ . ల్లేశ | కా . లేశ | త్రిపురేశ | వై . ద్య | నా . థేశ | నా . గనా . | థేశా . |
పాదాస | సాసాస | సరిస దా | సా ;, | రిసదాద | సదపాప | పదపాగ | గపపాప |
శ్రీ కే . | దారేశ | త్ర్యం . బకే | శా . . | రా . మేశ | భీ . మేశ | వి . శ్వేశ | ఘృ . ష్ణేశ |
పపదసస | రిగరి | రిగరిసరి | గా ;, | సరిరిసరి | గరిసదద | దసదగరి | సా ;, |
తరియిం . ప | జేయగా | తరవిరా . | వా . . | త . ల్లిపా . | శృతిగా . డి | తా . నరా . | వా . . |

"శ్రీ చంద్రశేఖరా శివశంకరా" వలె
మొదటి చరణంలోని "పాహిమాం పాహిహే పరమేశ్వరా...." పాడాలి.
తరువాతి పంక్తులు
ఆ తరువాత పల్లవిలోని "గౌరీవరా..." పాడాలి.

2.చ॥ పాదదా | దదపాగ | పాదా, | ;;, | పదసదప | పదపగా | రిగగదప |
చిత్రరం | జన గాన | లోలా . | . . . | చిరయశము | నొసగుమా | శ్రితపా . . |
పా ;, | పపదసస | రిగరి, | రిగరిసస | రిగా, | దససగరి | సరిసదప |
లా . . | సుగుణా . ల | వా . లా . | జా . లమిక | ఏలా . | దీ . నా . ర్త | జనులమము |
దసదగరి | సా ;, |
కృపనే . . | లు . . |

"శ్రీ చంద్రశేఖరా శివశంకరా" వలె
మొదటి చరణంలోని "పాహిమాం పాహిహే పరమేశ్వరా ..." పాడాలి.
తరువాతి పంక్తులు
ఆ తరువాత పల్లవిలోని "గౌరీవరా..." పాడాలి.



ఒక అర్థ శతాబ్ది పూర్వం మన రాష్ట్రంలో ఎన్నో భజన కూటములు ఉంటూండేవి. సంకీర్తనంలో తరించాలని పలు భక్త బృందాలు నిరంతరం దేవాలయాల లోనూ, పూజా మందిరాలలోనూ, బ్రహ్మోత్సవాలు తదితర భగవత్సేవా కార్యక్రమాలలోనూ భక్తితో సంకీర్తన చేసేవారు. చెక్కభజన బృందాలు కూడా వుండేవి. చిరతలు వాయించుకుంటూ తాళానుగుణంగా నృత్యం చేస్తూ భగవదారాధన చేసేవారు. శాస్త్రీయ సంగీతంలో రచనలను కీర్తనలు, కృతులు అని రెండు విధాలుగా పెద్దలు విభజించారు. మౌలికంగా రెండూ ఒకటే అయినా, సాంకేతికంగా యీ రెంటికీ కొంత విభేదమున్నది. పల్లవి, అనుపల్లవి, చరణాలు అన్నీ ఎక్కువ సంగతులతో సంగీతానికే అధిక ప్రాధాన్యత కలిగిన రచనలను కృతులు అనీ, ఎక్కువ సంగతులు లేకుండా బాణీ సరళంగా వుంటూ, చరణాలు అధిక సంఖ్యలో సైతం వుంటూ సాహిత్య ప్రాధాన్యత కలిగి పండితులు, పామరులు అందరూ కూడా పాడుకోవడానికి అనువైనవిగా వుండేవి కీర్తనలు అనీ, శాస్త్రంలో వివరించబడింది.

"శ్రీ చిత్తరంజనం" అనే నా వాగ్గేయ సంపుటి లోని "కైలాస వాస శివశంభో" కీర్తనను శివరంజని రాగంలో పైన తెలుప బడిన భజన సంప్రదాయ పద్ధతిలో రచించాను. ద్వాదశ జ్యోతిర్లింగ ప్రస్తావన కూడా యిందులో వున్నది.

## శివరంజని / మిశ్రశివరంజని రాగాలు ఆధారంగా కొన్ని చిత్ర గీతాలు




| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| 1. అంతాభ్రాంతి యేనా | దేవదాసు | కె.రాణి | సి.ఆర్.సుబ్బరామన్ |
| 2. ఏల పగాయే ప్రభో మనకు | లైలా మజ్ను | ఆర్.బాలసరస్వతి | సి.ఆర్.సుబ్బరామన్ |
| 3. శ్రీరాముని చరితమును తెలిపెదమమ్మా (కొంత భాగం) | లవ కుశ | లీల, సుశీల | ఘంటసాల |
| 4. శివరంజని నవరాగిణి | తూర్పు పడమర | బాలసుబ్రహ్మణ్యం | రమేష్‌నాయుడు |
| 5. ఆకాశవాణిలో ప్రతి రోజూ వినబడే సిగ్నేచర్ ట్యూన్ | | వయొలిన్ సోలో | |
| | హిందీ | | |
| 1. కహీం దీప్ జలే కహీం దిల్ | బీస్ సాల్ బాద్ | లత | హేమంత్ కుమార్ |
| 2. ధర్తీ కో ఆకాశ్ పుకారే | మేలా | షంషాద్ బేగం, ముఖేష్ | నౌషాద్ |
| 3. ఓ మేరే సనమ్ | సంగమ్ | ముఖేష్, లత | శంకర్ - జై కిషన్ |
| 4. మేరే నైనా సావన్ భాదో ఫిర్ భీ మే రామన్ ప్యాసా | మెహబూబా | కిశోర్, లత | ఆర్.డి.బర్మన్ |
| 5. ఓ సాథీ రే తేరే బినా క్యాజీనా | ముకద్దర్ కా సికిందర్ | కిశోర్ | కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ |
| 6. బహో రో పూలో బర్‌సావో | సూరజ్ | రఫీ | శంకర్ - జై కిషన్ |

### STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS OF HAASAM HAASYA SANGEETHA PATHRIKA HYDERABAD AS REQUIRED UNDER RULE 8 OF NEWSPAPERS (CENTRAL) RULES, 1956
### FORM IV (See Rule 18)

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | Hyderabad |
| 2. | Peroidicity of Publication | Fortnightly |
| 3. | Printer's Name<br>Whether citizen of India?<br>Address | K.I.Varaprasad Reddy<br>Indian<br>502, Sri Balaji Nilayam,<br>13-1-212, Moti Nagar,<br>Hyderabad-18. |
| 4. | Publisher's Name<br>Whether citizen of India?<br>Address | K.I.Varaprasad Reddy<br>Indian<br>502, Sri Balaji Nilayam,<br>13-1-212, Moti Nagar,<br>Hyderabad-18. |
| 5. | Editor's Name<br>Whether Citizen of India<br>Address | Raja<br>Indian<br>32,Suneetha Apartments,<br>Amberpet, Hyderabad-18. |
| 6. | Name & Addresses of Individuals Who Ownthe Newspapers | Hummus Infoway Pvt. Ltd.<br>502, Sri Balaji Nilayam,<br>13-1-212, Moti Nagar,<br>Hyderabad-18. |
| 7. | Shareholders holding more than one percent of the total Capital | 1. K.I.Varaprasad Reddy<br>2. P.Subbarao |

I, K.I. Varaprasad Reddy, hereby declare that the particualrs given above are true to the best of my knowledge and belief.

Date : 01-03-2003.

sd/-
K.I.Varaprasad Reddy
Publisher






"ఒరే రమేషూ! మన టీచర్స్ మనకి చాలా అన్యాయం చేస్తున్నార్రా"

"ఎలా?"

"ఒక్కటి... రెండు... ఇలా తక్కువ ర్యాంక్సు వచ్చిన వాళ్ళని పాస్ చేయిస్తూ నలభై యాభైఇలా ఎక్కువ ర్యాంక్సు వచ్చిన వారిని ఫెయిల్ చేస్తున్నార్రా"



"రవి తెలివైన కవి అని పొగుడుతున్నావు ఏమిటో ఆ తెలివి"

"అతడు చెవిటివాళ్ల ముందర మాత్రమే తన కవితలను వినిపిస్తాడు"

"ఆ అమ్మాయికి ప్రేమించిన వాడితోనే పెళ్లి జరిపిస్తున్నా ఎందుకురా అలా దిగులుగా వుంది.?"

"శుభలేఖలో వరుని పేరు ముందు చిరంజీవి అని వుందిట గానీ తన పేరుకు ముందు ఆర్తీ అగర్వాల్ అని లేదుట. అదీ బాధ!"





"డాక్టర్... దయచేసి నన్ను పరీక్షించి నా రోగాన్ని చికిత్స చేయండి. అదేం మాయరోగమో-ఎప్పుడూ నాకు నా కళ్లజోడు కనబడి చావదు. అదెక్కడ పెట్టానో గుర్తుకురాక చస్తున్నాననుకోండి"

"ఇంతకీ నీకున్న జాడ్యం... మతిమరుపా? లేక దృష్టిలోపమా-వీటిలో దేనికి చికిత్స చేయాలి?".



"ఏమిటి... ఈ రోజిలా ఆఫీసుకి వచ్చేసావు?" అంటూ ఆశ్చర్యంగా అడిగాడు అరుణ్ భార్యను చూస్తూ.

"మరేం లేదండి... ఇంట్లో పనిమనిషి కనబడటం లేదు. మీరు ఆఫీసులో వున్నారో లేదో చూద్దామని-"



"పెళ్లయి పదేళ్లయింది అయినా ఇంకా..."

"...పిల్లలు పుట్టలేదా...?"

"కాదు, మావారికి వంట చెయ్యడం ఇంకా రాలేదు"

"మీరు స్కూలులో చెప్పినట్లుగా చక్కటి ఆరోగ్యం కోసం పెందరాళే పడుకోవడం, పెందరాళే లేవటం అలవాటు చేసుకున్నానండీ?" అన్నాడు వంశీ తన చిన్నప్పటి టీచర్ కనిపించినప్పుడు.

"వెరీగుడ్... ఆరోగ్యం బాగుందా?" అడిగారు టీచర్.

"ఆరోగ్యం చాలా బాగుందండి... కాని మా ఆవిడ మాత్రం ఎవరితోనో లేచిపోయింది!".








మహారాజు : (చప్పట్లు చరుస్తూ) ఎవరక్కడ!?

సైనికుడు : ఓ రెండడుగులు ముందుకేసి పక్కకి తిరిగి చూడండి ప్రభూ! ఎవరో తెలుస్తుంది.

రోడ్డు మీద వెళుతున్న అమర్‌ను ఇద్దరు అగంతకులు ఆపేసారు.

"దయచేసి ఒక రూపాయి నాణెం ఇస్తారా"

"ఎందుకు!?"

"మీ రిస్టువాచీని, పర్సుని మా ఇద్దరిలో ఎవరేది తీసుకోవాలో టాస్ వేసి తేల్చుకోవడానికి"





"నాలో పరివర్తన వచ్చింది గురూ! దొంగతనాలు హత్యలూ, మానభంగాలూ మానేసా!"

"మరైతే ఇప్పుడేం చేస్తున్నావ్?"

"వివిధ పత్రికలకు క్రైమ్ కథలు రాస్తున్నా"

"నా భార్య మాటాడే మాటలలో కేవలం పదిశాతం మాత్రమే నేను వింటున్నానట.... మొన్న డాక్టర్ చెప్పాడు"

"అబ్బ నువ్వెంత అదృష్టవంతుడవురా"

"ఏం అదృష్టం నా బొంద! ఆ సంగతి తెలిసిందగ్గర నుండి నా భార్య పదిరెట్లు ఎక్కువ మాటాడుతోంది".



"మన కొత్త కోడలు నన్ను లెక్క చేయడం లేదండి" అంది భార్య

"లెక్కలలో పూరేమో?" అన్నాడు లెక్కల మాష్టరుగా పనిచేసే భర్త





"అదేంటి బిల్లు కట్టనివాళ్ళని పిండి రుబ్బమనకుండా గ్లాసులు, ప్లేట్లు ఎత్తిస్తున్నారేంటి"

"ఆ మధ్యన పిండి రుబ్బమన్న వాళ్ళందరూ పిండి రుబ్బేసి ఆ తర్వాత పిండిని తినేస్తున్నారు. అందుకని..."

"చిన్ని కృష్ణుడు గోవర్ధనగిరిని అలా చిటికెన వ్రేలితో ఎత్తి గోవుల్ని, గోపాలురనీ కాపాడాడు" అంటూ చెబుతున్నాడు తండ్రి

"అంతా అబద్ధం అంత గొప్ప ఘనకార్యం చేసినప్పుడు మరి గిన్నిస్‌బుక్‌లో అతని పేరు పడలేదేం!?" అడిగాడు కొడుకు.



ఈ జోక్‌లను పంపినవారు :

పి.వి.మురళీకృష్ణ, పి.సురేష్‌కుమార్, హైదరాబాద్



**జరిగిన కథ**

అజయ్ అనే శ్రీమంతుడు, విజయ్ అనే పేదవాడు ఒక ఏడాదిపాటు తమ తమ స్థానాలను మార్చుకోవాలని నిశ్చయించుకుంటారు. అజయ్ స్థానంలో వచ్చిన విజయ్ మేనేజర్ భానోజి మోసం చేస్తున్నాడని గమనించి అతని కూతురు సరళతో ప్రేమ నటిస్తుంటాడు. విజయ్ స్థానంలో వచ్చిన అజయ్ చెల్లెలు మీనా కాపురం సరిదిద్దే ప్రయత్నంలో బావ బుజ్జిని బెదిరిస్తాడు. బుజ్జి భార్యను కలవడానికి చాటుగా వస్తుంటాడు. మోటారు మెకానిక్‌గా పని చేస్తున్న అజయ్‌కు తన కొలీగ్ ప్రకాష్ చెల్లెలు పద్మతో పరిచయం అవుతుంది. తన బర్త్‌డే ఫంక్షన్‌కి ఆహ్వానించడానికి వచ్చిన సరళతో విజయ్ చనువుగా మాట్లాడడం గమనించి అజయ్ మేనత్త మందలిస్తుంది. సరళ పెట్టుకువచ్చిన నెక్లెస్ కనబడకుండా పోయిన అజయ్ తల్లి జవహారీలోదని గ్రహించి అలా ప్రేమ నటించానని విజయ్ చెప్తాడు. పార్టీకి వెళ్లినప్పుడు సరళ అంటే తను మనసు పడుతున్నట్టు తెలుసుకుంటాడు. పద్మ అజయ్ ఇంటికి విందుకు వస్తుంది. వారిద్దరి మధ్య ప్రేమ వెల్లడవుతుంది.

(ఇక చదవండి)

# అన్నపూర్ణావారి ఇద్దరు మిత్రులు



## సీరియల్ - నం 12

**రచన : ముళ్లపూడి వెంకటరమణ**

మీనా చాలా రుచిగా వంటచేస్తుంది. అజయ్ యెప్పుడూ, ప్రతి వంటకాన్నీ మెచ్చుకుంటూ తింటాడు. ఆ రోజు పద్మ సరసన, సరస మాడుతూ తిన్నవన్నీ మరీ రుచిగా వున్నాయి. పాయసం సరేసరి. తను డబ్బాడు పంచదార పోశాడు. ఇపుడు పద్మ తియ్య చూపులు, తియ్యని పలుకులు కలుపుకుని మరీ సేవించడంతో అతి మధురంగా ఉంది. మీనా, వాళ్ళనీ, ఆ పిచ్చ ధోరణినీ చూచి నవ్వుకుంది. బుజ్జి కబుర్లు చెబుతాడే గాని ధ్యాసంతా విస్తరి మీదనే వుంది. ఇది చూసి కూడా నవ్వుకుంది మీనా. భోజనాలు కాగానే నలుగురూ సావిట్లోకి వచ్చారు. ప్రకాష్ కూడా వచ్చివుంటే, ఏకంగా తాంబూలాలే ఇచ్చేసు కుని ఉందుం అనుకుంటూ, పళ్లెంలో తమలపాకులు, వక్కలు పట్టుకువచ్చింది.



"నో నో ఆగు, అప్పుడే తాంబూలమా?" అంటూ లేచాడు అజయ్. అందరూ విస్తుబోయారు. "డిన్నరింకా పూర్తికాందే. ఇంకా ఫ్రూట్సు, ఐస్క్రీం-ఎన్ని వున్నాయ్. మీనా! వెళ్లి ప్లేట్లు తీసుకురా" అంటూ పురమాయించి, కిటికీ దగ్గరకు వెళ్ళాడు-పళ్ళబుట్ట తను పెట్టిన చోట ఉందిగాని, పళ్లు ఉండాల్సిన చోట లేవు. ఎక్కడున్నాయో చెప్పే ఎడ్రసు చీటీ కూడా లేకుండా గల్లంతయిపోయాయి. "మీనా ఇందులో ఆపిల్స్ పెట్టాను. కనబడవేం?" అన్నాడు.



'ఏమో అన్నయ్యా! పెడితే ఏమవుతాయి?'

అజయ్, బుజ్జిభుజం తట్టి నవ్వాడు - 'ఏం బావా! ఏమనుకోంలే. నిజం చెప్పు.'

'బాగుంది, విందుకు పిలిచి దొంగతనం అంటగడతారా?' అన్నాడు బుజ్జి గారంగా.



'ఎంతటి సుదినం! ఎంతటి సుదినం! భజన దివ్యంగా జరిగింది పో' అంటూ - అనుకుంటూ సందడిగా వచ్చాడు రామదాసుగారు.

'నాన్నా ! ఇందులో ఆపిల్స్...'అంటూ అడిగాడు అజయ్.

'అవున్రా - అవే. కొబ్బరికాయ కుళ్లిపోయిందని పరితపిస్తూవుంటే, కిటికీలో ఆపిల్ పళ్లు ఆ కోదండరాముడే చూపించాడు. ఒరేయ్, ఒరేయ్! భక్తులు ఎంత పరవశులయ్యారనుకున్నావ్?' అన్నాడాయన ఊరికే పొంగిపోతూ.



సావిట్లో వారంతా నిట్టూర్చారు.

'ఇంద! కళ్లకద్దుకు మరీ తిను' అంటూ , నాలుగు ఆపిల్ ముక్కలు కుమారునికి చేతిలోపెట్టి, నలుగుర్నీ చూసి మరోమారు పొంగిపోయాడు రామదాసుగారు.

'అహా! ఇల్లు ఎంత కళకళలాడుతోంది! అదే వుంటే ఎంత సంతోషించేది' అనేవరకూ ఆయన కంఠం గద్గదం అయింది. మనసులో ఏదో మంచి ఊహ వెలిగింది. "అమ్మా



మీనా రేపోమాపో నువ్వు అత్తారింటికి వెళ్లిపోతావు. ఇహ మిగిలేది వాడూనేనూను. ఇద్దరు పక్షులం, బిక్కుబిక్కుమంటూను...పద్మలాంటి కోడలు ఈ ఇంట్లో మసలుతూవుంటే, ఎంత శోభగా వుంటుంది!' అన్నాడాయన.

పద్మ సిగ్గుతో తలవంచుకుంది.

'విన్నావా నాన్న ఏమంటున్నాడో?' అంది మీనా.

'వినలే' అంది పద్మకొంటెతనానికి. ఈ మాట దాసుగారి చెవినపడడంతో, 'ఒరేయ్ నువ్వే కాస్త గట్టిగా 'చెప్పు' అన్నాడాయన అమాయకంగానో, గడుసుగానో.



తండ్రి ప్రసాదించిన ఈ మహదవకాశాన్ని అజయ్ పూర్తిగా సద్వినియోగం చేసుకున్నాడు. పద్మ దగ్గరగా వచ్చి వంగి, మా నాన్న ఏమంటున్నాడంటే -' అన్నాడు గట్టిగా.

'నాకేం బ్రహ్మచెముడు లేదు.'

***

కొందరికి బుద్ధి వుంటుంది. కొందరికి పుడకల దాకా మారదు. కొందరికి గూబ బద్దలయినపుడు మారుతుంది. కొందరికి అసలు మారదు. మారకపోడానిక్కారణం-అసలు ఉండకపోవడమేనంటారు బుద్ధిమంతులు. పరంధామయ్య గారి కేసు ఈ బాపతేనని, ఆయన ధోరణి చూసిన వారిలో గిట్టనివాళ్లు చాటున అంటారు. కాకపోతే, ఇన్నేళ్ళయినా ఆలుమగల్ని అలా వేరుంచడమేల అంటారు.

బుద్ధి మారటం ఆయనకు గిట్టదని కాదు. మాట వరసకి, వాళ్ళింటి కుక్కంటి బుద్ధి మారటం లేదని ఆయన విసుక్కుంటూ వుంటారు. ముఖ్యంగా అది తన మంచం ఎక్కి విశ్రమించినప్పుడల్లా ఈ బుద్ధి చర్చ వస్తుంది.



"ఛీ ఛీ! ఈ వెధవకుక్క, మళ్ళీ మంచం ఎక్కిందీ. ఎన్నిసార్లు కొడితేనేం? ఎక్కణ్ణుంచి వస్తుంది బుద్ధి! కుక్క బుద్ధి కుక్కబుద్దే" అన్నాడాయన సావిట్లోకి వస్తూనే. ఈ ముక్క పదిమార్లేనా వల్లించందే రోజు గడవదు. కుక్కని తరిమి గదిలోకి వెళ్ళాడాయన.

అత్తవారింటినుంచి, సైకిలుతొక్కి అలసి అప్పుడే ఇంటికొచ్చిన బుజ్జికి, సావిట్లో కాళీ మంచం కనబడగానే ప్రాణం లేచొచ్చింది. అమాంతం పడుకుని ముసుగుతన్నాడు. పరంధామయ్య గారూ అదే సదుద్దేశంతో శయ్య సమీపించి, మసక వెల్తురులో మంచం మీది శాల్తీని గమనించి మండిపడ్డాడు.

'ఓసి నీ దుంపతెగ, మళ్ళీ తగలబడ్డావ్" అంటూ బడిత తిరగేసి రెండు బాదులు బాదాడు.

మాతా పితలను ఎలుగెత్తి పిలుస్తూ చూరెత్తుకెగిరి దిగిన బుజ్జి, తండ్రి తనను చంపేశాడని ప్రకటన చేశాడు. నడుం విరిగిందని వెల్లడించాడు. ఆపైన, అమ్మని మరి రెండుసార్లు నోరారా ఆహ్వానించాడు.

'అయ్యో! అయ్యో! ఏం జరిగిందిరా? నా తండ్రీ' అంటూ సూరమ్మగారు దిగ్గునలేచి దబ్బునవచ్చింది.

'అమ్మా, చచ్చిపోయానే, అమ్మో! అమ్మో! ముందా కర్ర లాక్కోవే అమ్మా!' అన్నాడు బుజ్జి పైశ్రుతిలో.



'ఎంత ఖర్మొచ్చిపడిందిరా నా తండ్రీ! నా బుజ్జి నాయనా!' అంటూ అదే శ్రుతిలో పెడబొబ్బలు ఆరంభించింది సూరమ్మగారు.

కర్మ సిద్ధాంతంమీద ఆవిడ ఉపన్యాసం ముగిసేలోగానే, పరంధామయ్యగారు కర్రని నేలమీద కొట్టి, 'ష్ పాడుసంత నోళ్ళు మూస్తారా లేదా?' అని గదమాయించాడు. 'ఇంట్లో ఎవరో చచ్చినట్టు అలా ఏడుస్తారేం? ఏదో కుక్క అనుకుని రెండువేస్తే, దానికింత గోలా' అని చివాట్లేశాడు.

'నన్ను కుక్కని ఎట్లా అనుకున్నావు నాన్నా?' అన్నాడు బుజ్జి ఏడుపులోనే విజ్ఞాన సముపార్జనార్థం.

'కుక్కే అనుకున్నారా గాడిదా! నువ్వనుకుంటే, మరో నాలుగు తగిలించేవాడిని. కుక్కలాగవచ్చి పడుకుని, గాడిదలాగ ఏడుస్తావేరా? అడ్డగాడిదా?' అన్నాడు తండ్రి.

'చెట్టంత కొడుకుని పట్టుకుని ఏవిటండీ, ఆ తిట్లు?' అని అడిగింది భార్య - జవాబు గురించి కుతూహలం లేకపోయినా.

'లేకపోతే, అర్ధరాత్రిదాకా తిరిగి తిరిగి యిప్పటికి ఇల్లు చేరుకుంటాడా? చెప్పు! ఎక్కడికి చచ్చావ్! సినిమాకేనా?'



'సినిమాకు కాదు బాబోయ్! హరికథకు నాయనోయ్!' అన్నాడు బుజ్జి- 'తండ్రి' అనే మాటకి పర్యాయపదాలూ, ఆర్తనాద వాచకాలూ శ్లేషించి మరీ ప్రయోగిస్తూ.

'రోజూ నీకు సినిమాలూ, హరికథలూనా? నీ అంతు తేలుస్తానుండు' అంటూ కర్ర తిరగేశాడు తండ్రి. సినిమాలూ, హరికథలూ అను రెంటిని అలా కలిపేసి కోప్పడ్డంలో ఆయన ఉద్దేశం, దేని మీద ఆయన చూపు చిన్నదైనదీ తెలుసుకుందికి సావకాశంలేదు.



'అమ్మోయ్ చంపేశాడే. తల పగిలిపోయిందే. రక్తం రక్తం' అని కాగల కథని కళ్ళకు కట్టేలా చిత్రించాడు బుజ్జి.

'అయ్యో అయ్యో, ఒక్కగా నొక్క కొడుకు. వరప్రసాది!'

'నువ్వు ముందు నోరుమూస్తావా లేదా?'



ఆవిడ ఉభయతారకమైన పనిచేసింది. ఊహ్ అంటూ నిల్చున్నపళంగా ఫిట్ తెచ్చుకునీ, పతి ఆజ్ఞ ప్రకారం నోరు మూసుకోవటంతో పాటు, ఆయన ఆట కట్టేసింది.

'వచ్చిందీ మళ్ళీ ఫిట్టూ! చంపుకు తింటున్నారు మీదుంపతెగా. ఒరేయ్ బుజ్జిగా ఆ సాల్టు సీసా ఇలా తీసుకురా' అంటూ

భార్య తల ఒడిలో పెట్టుకు కూర్చున్నాడు పరంధామయ్యగారు.

****

అజయ్‌బాబు ఆఫీసు సిబ్బంది, రివాజు ప్రకారం సాధ్యమైనంత తక్కువ పనిని, సాగినంత ఎక్కువ కాలంలో సాధించడానికి యధాశక్తి కృషి చేస్తోంది. లచ్చి ఆ గదిలోకి వచ్చినపుడు, అవతార త్రయం కళ్లూ, గుండెలూ తప్ప మరేం పని చెయ్యవు. ఏవో టైపుమిషను మీద వేళ్లలాటివి ఆడుతున్నా, కాస్త చూసిచెప్పు, అదేవిటి, ఇదేఁవిటి అని యజమానిని అల్లరిపెట్టకుండా ఆడుకుంటాయి. లచ్చిని చూడగానే కూర్మావతారానికి దాహం వేసింది.



"లచ్చీ, ఓ గ్లాసుడు నీళ్లిస్తావా?" అన్నాడు, కళ్ళతోనే ఆ పిల్ల అందాన్ని తాగేస్తూ. లచ్చి మాటాడకుండా గ్లాసుడు నీళ్లు అందించింది.

"ఈవేళ ఒకటే దాహంగా వుంది. ఇంకో గ్లాసు-" అన్నాడు కూర్మం, వెర్రిగా చూస్తూ.



లచ్చి మళ్ళీ కూజావంచి గ్లాసులోకి నీళ్ళు పోసింది. ఆ వంపుసొంపును గమనించిన వరాహానికీ దాహం వేసింది. "నాకూ దాహంగా వున్నట్టుందే లచ్చీ, ఆ చేత్తోనే-' అన్నాడు చూపులతో జుర్రేస్తూ.

లచ్చి చిరాకుపడి, కూజాతెచ్చి వచ్చింది. వరాహం దోసిలి పట్టి తాగసాగాడు.

"వరాహంగారూ! కూజానీళ్ళతో తీరే దాహమా అది?" అన్నాడు కూర్మం, గాఢంగా నిట్టూర్చి.

"లచ్చి దయతలిస్తే తీరాలి!" అన్నాడు కూర్మం కన్నులరమోడ్చి.

లచ్చి కూజా బల్లమీద పెట్టి వినురుగా కూర్మంకేసి తిరిగింది. "ఏందయ్యో! మాటలేవో కోటలు దాటుతుండయ్! ఇసుంట రమ్మంటే ఇల్లంత నాదేనన్నట్లు పరాశికాలేమో శానా జేయ బడితిరి. బద్రం! లచ్చమ్మంటే ఏమను కుంటిరి. మీకు బట్టిన దెయ్యాన్ని దుల్పుత మరి" అంటూ చురచుర చూసి, చరచర వెళ్లిపోయింది.

వరాహం గుండె దిగజారిపోయింది.

"లచ్చీ, లచ్చీ! నా తప్పేం లేదు. దొరగారితో జెప్పేవు. ఉద్యోగం కాస్త ఊడిపోతుంది. తొమ్మండుగురు పిల్లలు-ఇద్దరు భార్యలు-నీ దయ" అన్నాడు దీనంగా.

హెడ్డావతారంగారు, ఆవేళకి అక్కడవుంటే, ఎలాటి భూమిక నిర్వహించేవారో తెలియదుగాని ఆయన ప్రభుసేవలో వున్నారు. విజయ్, ఆఫీసు ఫైళ్లు చూస్తున్నాడు. పద్దులు తనిఖీ చేస్తున్నాడు. ఒక వింత బిల్లు కనబడింది.

"ఏమిటిది?" అన్నాడు.

శేషావతారం అది అందుకునిచూసి, పొడి దగ్గుదగ్గి గుటకమింగి "చిత్తం. ఇదాండి! ఇది మరీ- అన్నాడు. మళ్ళీ ఓ గుటక మింగి, 'ఇది తాజ్‌మహల్ హోటల్ బిల్లండి. సరళమ్మగారి పుట్టినరోజు పార్టీది" అన్నాడు-భానోజీగారు రావటం లేదుగదాని తలుపుకేసిచూసి.



"అది నువ్వు చెప్పేదేవిటి? చూస్తే తెలుస్తూనే వుంది. నా ఎక్కౌంటులో ఎందుకు వేశారని అడుగుతున్నాను" అన్నాడు, విజయ్ విసుగ్గా.

"చిత్తం. ఏటేటా ఆనవాయితిగా వేస్తున్న దేనండి మరి."

"అనవాయితీ ఏమిటయ్యా? అర్థంలేని మాట. భానోజీగారి కూతురు బర్త్‌డే పార్టీ చేసుకోడం ఏమిటి? ఆ బిల్సన్నీ మధ్య నేను భరించడం ఏమిటి?"

"సరిగ్గా ఆ మాటే నేనూ అనేవాణ్ణి అజయ్ బాబూ-"



కొత్త కంఠం విని విజయ్ తలపైకెత్తి చూశాడు. భానోజీగారు చిరునవ్వు ప్రసరిస్తూ లోపలికి వచ్చారు.

"-కాని, మీ నాన్నగారు వినిపించుకుంటేనా?" అంటూ కుర్చీలో, దర్జాగా కూర్చున్నారు.

శేషావతారంగారికి భానోజీగారిని చూడగానే తన మాటలు విన్నాడేమోనన్న భయం, ఈ గండం గట్టెక్కిస్తాడన్న ధైర్యం ఒక్కసారిగా ఆవేశించాయి. బిల్లు అక్కడపడేసి, మెల్లిగా అవతల పడ్డాడు.

"ఆ వూసెత్తితేనే మండిపడేవారు" అన్నాడు భానోజీగారు.

విజయ్ మాటాడలేదు. మిగతా కాగితాలు చూడసాగాడు.



భానోజీగారు స్వగతం అందుకున్నారు.

"సరళ అంటే వారి కంత అభిమానం. అమ్మాయి పుట్టిన రోజు అనేసరికి, బాణా సంచాలు, పాటకచేరీలు, హరికథలు, ఎన్నెన్నో ఉండాలని పట్టుపట్టేవారు."

విజయ్‌కి ఈ భాష, ఈ చిరునవ్వులు, ఈ ప్రేమలు అంటే చిరాకు. ఇపుడు జుగుప్స కూడా కలిగింది.

"ప్రతిదీ నాన్నగారు చేసినట్లే చెయ్యాలంటే, మనం తూగగలమా భానోజీగారూ, డబ్బు చిక్కులు ఎన్ని వచ్చిపడ్డాయో మీకు తెలీదూ?"



భానోజీగారీ మీసాలమీద వెలిసి పోయిన చిరునవ్వు వెలిసింది. "దానికే ముంది అజయ్‌బాబూ. నా అక్కౌంటులోనే రాయిస్తాను. కాని ఒక్కటే భయం. స్వర్గంలో వున్న ఆ మహానుభావుని ఆత్మ బాధపడుతుందేమోనని..."

"దుబారా ఖర్చులు తగ్గిస్తే, ఆ మహాభావుని ఆత్మ సంతోషిస్తుంది కూడా" అన్నాడు విజయ్ విసురుగా. భానోజీగారు తలవంచుకున్నారు - బహుశా స్వర్గవాసిని తలుచుకుంటూ కావచ్చు.

"మాటవరసకి చూడండి. బంగాళాలో వున్నది అత్తయ్య, నేను. ఇద్దరికోసం

ఇంతమంది పనివాళ్లు దేనికి?"

"శుద్ధ దండగ" అంటూ నిటారుగా కూర్చున్నారు భానోజీగారు.

"తగ్గించేద్దాం, మొట్టమొదట పోవలసినవాళ్లు ఆ వెంకన్నగాడు, వాడి కూతురునూ. వాడేమో ముసలివాడైపోయాడు. ఆ లచ్చేమో వయసులో వున్న పిల్ల...మన అవతారాలకి పని మీదకన్న దాని మీద ధ్యాస ఎక్కువయిందట..."



"అందులో లచ్చి తప్పేముంది? జరిగినదంతా నేను విన్నాను. ముందు ఆ కూర్మావతారాన్ని డిస్మిస్ చెయ్యండి" అన్నాడు విజయ్ కాగితాలు చూసుకుంటూ.

భానోజీగారు ఉలికిపడ్డారు. "వాడిని డిస్మిస్ చెయ్యడమా. అసలే మన ఆఫీసులో పనిచేసేవాళ్లు తక్కువ" అన్నారు.

"అందుకే వాడిని తీసేసి, పని చేసేవాళ్ళని పెట్టుకుందాం. వెంటనే ప్రైవేట్ సెక్రటరీ కావాలని ఎడ్వర్టైజ్ చెయ్యండి" అన్నాడు విజయ్ అధికార స్వరంతో.



ఇది ఆఖరుమాటనీ, ఇందుపై చర్చకు ఆస్కారంలేదనీ ఆ స్వరం విశదపరచింది. భానోజీ గారికి నోట మాట రాలేదు.

శేషావతారం మెల్లిగా గదిలోకివచ్చి, వాతావరణం గమనించి తలుపు దగ్గరే దిగడిపోయాడు, వినయానికి భయభక్తులకీ రూపకల్పన చేసిన శిల్పంలా.



"యస్. ఏం కావాలి?" అన్నాడు విజయ్

"బై అండ్ సెల్ కంపెనీ నుంచి ఖాన్ గారు ఫోన్ చేశారు సార్. కార్లు చూసుకునేందుకు ఎప్పుడు రావచ్చునో అడగమంటున్నారు మరి."

"రేపు ఉదయం పదింటికి రమ్మను."

"చిత్తం."

"కొత్తకారు కొంటున్నారా, అజయ్‌బాబూ" అన్నాడు, భానోజీ గారు ఆప్యాయత తెచ్చి పెట్టుకుని.

"కొత్తది కొనటం కాదు. పాతవి అమ్మేస్తున్నాను."

"అదేమిటి? నిక్షేపంలాటి కార్లు అమ్మడం దేనికి?" అన్నాడు, మానేజర్ భానోజీగారు ఆశ్చర్యంతో. తనకి తెలీకుండా ఇంత పెద్ద నిర్ణయం జరగటం ఇదే తొలిసారి.

విజయ్ తల ఎత్తి సూటిగా ఆయనకేసి చూశాడు. "అమ్మకపోతే, అప్పులెలా తీరుతాయ్ అదీగాక మనకి నాలుగు కార్లు అనవసరం. ఒక్కటి చాలు పని గడవడానికి..." అంటూ ఒక్క క్షణం ఆగి, "ఏమిటి ఆలోచిస్తున్నారు" అన్నాడు.



"చూస్తున్నాను ఒక్కటే అయితే ఎలా సరిపోతుందా అని..." అన్నాడు భానోజీ, విజయ్‌ని ఓరకంట చూస్తూ. "నా సంగతి కాదనుకోండి. కారే వుండాలన్న పట్టింపు లేదు. రిక్షా ఒకటి నెలవారీగా కుదుర్చుకుంటే నా పని గడిచిపోతుంది. కాని ఈ యింటికి కాబోయే కోడలుగా అమ్మాయికి కారు లేకపోతే, మన హోదాకే లోపం గదా?"

విజయ్ నవ్వాడు. "ఓస్ దానికేముంది. సరళ సంగతి నేను చూసుకుంటాలెండి. మా ఇద్దరికి కలిపి ఒక కారుచాలు. ఎలాగో సర్దుకుంటాంలెండి. ...అదిగో మాటలోనే వచ్చింది. అడుగుదాం వుండండి. ఏం సరళా! నీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు.

చివరి మాటను మటుకే విన్న సరళ, నవ్వుతూ దగ్గరకు వచ్చి, "మీ అభిప్రాయమే నా అభిప్రాయం-ఇంతకీ విషయం ఏమిటి?" అంది.

"ఏదైతేనేం. అభిప్రాయం చెప్పేశావుగా." అన్నాడు విజయ్-ఆమెవంక చిత్రంగా చూసి. సరళ తత్వం అతనికి అంతుచిక్కటం లేదు.

"పోన్లెండి. చెప్పకపోతే దాచుకోండి... నాన్నా సాయంత్రమైంది. ఇంకా ఆఫీసు గొడవలతో అజయ్‌బాబుని విసిగిస్తున్నారా?" అంది సరళ.

భానోజీ గారికి ప్రాణం లేచొచ్చింది. అనుకోకుండా కట్టు తప్పిన చర్చను ముగించే అవకాశం, అమ్మాయి ధర్మమా అని లభించింది. ముఖం వికసించింది.

"నిజమే సరళా నాకు ఆ ఆలోచనే లేదు... చూశారా. అజయ్‌బాబూ, అట్టే పనిచేస్తే మీరలసిపోతారని ఎలా తిప్పి చెబుతూందో... చూడమ్మా, కాస్త గాలి పీల్చుకోడానికి అజయ్‌బాబుని అలా ఎక్కడికైనా తీసుకెళ్లు. నేను వస్తాను. అవతల గుమాస్తాలు కనిపెట్టు కూర్చున్నారు" అంటూ సెలవు తీసుకున్నాడు.

ఆ ఒడుపును, ఆ ప్రతిభను చూసి అప్రతిభుడైపోయాడు విజయ్. తండ్రీకూతుళ్లు తోడుదొంగలా అన్న ఊహ కూడా పోయింది.

"ఫరవాలేదే, నాన్నని చాలా నేర్పుగా పంపించేశావు!" అన్నాడు.

సరళ సిగ్గుతో తలవంచుకుంది. "బాగుంది. ఇలాంటి అభాండాలు కూడానా? ఆయనే పనుండి వెళ్లిపోయారు" అంది.

"అవున్లే, నీకు పనుండి ఉండిపోయావు. ఏం?"

సరళ చిరుకోపం అభినయించింది.

"నేను రావడం ఇష్టం లేకపోతే, సూటిగా చెప్పేయరాదూ? పోతాను. డొంక తిరుగుడు దేనికి?" అంది.

"ఊరికే అన్నాను సరళా! కూర్చో"

సరళ కోపం అంతతోనే మాయమైంది. "అయిదు గంటలయింది. టిఫిన్ అయినా తీసుకున్నారా?"

"ఇంకా లేదు సరళా! ఆ మాత్రం అజ కనుక్కునేవాళ్లు యీ ఇంట్లో ఎవరున్నారు చెప్పు?" అన్నాడు విజయ్, సాభిప్రాయంగా ఆమె వంక చూసి.

"నే నున్నానుగా! పదండి టిఫిన్ తీసుకుందాం" అంటూ కదిలింది సరళ. ఆమె మాటలో ఆపేక్ష తొణికిసలాడింది. అందులో కల్లా కపటం లేవు.

**(ఇంకావుంది)**

శ్రీ గుమ్మడి ఇచ్చిన అగ్రిమెంట్ కాగితాలను శ్రీ నాగేశ్వరరావు గారు చింపేసే దృశ్యం తీస్తున్నారు.



"స్టాంపు పేపర్లు ఎన్నివున్నాయి?" అని నాగేశ్వరరావుగారు అడిగారు. "ఆరు సార్!" అన్నాను నేను

"మా నటన మీద మీకంత నమ్మకమా?" అన్నారు అక్కినేని.

"రీటేక్‌కు మీ నటనే కారణం కానక్కరలేదు - అనేక కారణాలుంటాయి సార్! స్టాంపు పేపరు-రూపాయిదే తెప్పించాను. స్టాంపు పేపర్లు అయిపోయాయి. మళ్లీ అవి వచ్చేవరకు వుండాల్సి వస్తే ఆ సమయం మరీ ఖరీదు కదా?" అన్నాను

ఆయన చిరునవ్వు నవ్వి పూరుకున్నారు.

-స్వామి చిత్రానంద, చెన్నై

# నాదస్వర కళానిధి షేక్ చినమౌలా



నాదస్వరం లేకపోతే ఏ శుభకార్యం శుభకార్యంలా అనిపించదు నాకు! ఒట్టి తూతూ మంత్రంలా అనిపిస్తుంది. ఏ మహానుభావుడు కనిపెట్టాడోగానీ ఈ నాదస్వరాన్ని! అల్లంత దూరాన నాదస్వరం వినగానే గుండెంతా పచ్చతోరణం కట్టినట్టయి పోతుంది. కళ్లనిండా పట్టుచీరల రెపరెపలు దర్శనమిస్తాయి. ఖచ్చితంగా అక్కడేదో శుభకార్యం జరుగుతూనే ఉంటుంది. అంచేతేనేమో డోలు సన్నాయిని మంగళ వాయిద్యాలన్నారు. నాదస్వరం పేరెత్తగానే ఆంధ్రులందరికీ మరొకాయన స్ఫురిస్తాడు. ఆయనే నాదస్వర విద్వాన్ షేక్ చినమౌలా!

చినమౌలా జన్మస్థలం గుంటూరు జిల్లా కరవది! జన్మదినం ప్రభవ వైశాఖ బహుళ చతుర్ధశి!

వంశపారపర్యంగా నాదస్వరం మౌలా వాళ్ల ఆస్తి! ఒకటిగాదు రెండుగాదు, దాదాపు మూడు వందల సంవత్సరాల నుంచీ కరవది దేవాలయానికి ఆస్థాన విద్వాంసులు. వంశానికి మూల పురుషుడు విద్వాన్ ఆదం సాహెబ్, దేవగాంధారి రాగంలో నిపుణుడు. ఆయన పల్లవి పాడుతున్నప్పుడు చేతులతోటి కాళ్లతోటి కూడా తాళం వేసేవాడట! వంశంలో తర్వాత చిలకలూరిపేట చినమౌలా, పెదమౌలా అనే సోదరులుండేవారు. చినమౌలా సంస్కృత విద్వాంసుడు. అమరకోశం, రామాయణం ఆయనకి కంఠోపాఠం! ఆ తర్వాతి వాడు కొమ్మూరు పెంటూ సాహెబ్! ఈయన్ని 'కళ్యాణి' పెంటూ సాహెబ్ అనీ, 'కేదారగౌళ' పెంటూ సాహెబ్, 'బిళ్హరి' పెంటూ సాహెబ్ అని పిలిచేవారట. ఎంచేతంటే ఆ రాగాల్ని ఆయన అంత సాధికారంగా, స్వారస్యంగా వాయించే వారు. ఆ తర్వాతి తరంలో చిన పీరు సాహెబ్! ఈయన విజయవాడ కనకదుర్గమ్మ ఆలయంలో 'సావేరి' రాగం వాయిస్తుంటే సుప్రసిద్ధ గాయకులు, నటులు శ్రీ జొన్నవిత్తుల శేషగిరిరావుగారు 'చిన పీరూ నువ్ సావేరి వాయిస్తుంటే కనకదుర్గాంబ ప్రత్యక్షమౌతోందయ్యా, కనక ఈ రాగాన్ని అమ్మకి అంకిత మియ్యి' అన్నారట. అలాంటి వంశంలో ఇదిగో ఇపుడు చినమౌలా! సరే, పసితనంలోనే పాలపీక బదులు సన్నాయి పీకనే నోట్లో పెట్టుకునుంటాడా? సంగీత సాగరాన్ని జుర్రేసుంటాడా?




ఊపిరితిత్తులు నాద స్వరాలూ, గుండె డోలూ అయిపోయుంటుందా?

సాక్షాత్తు 'చినమౌలా నాద' స్వర స్వరూపుడై పోయాడా! పట్టుమని పదేళ్లుండగానే కరవది ఆలయంలో కచేరీ చేశాడా! సొగసుగా మృదంగ తాళము నాదస్వరంతో జతగూర్చి రాముణ్ని సొక్కజేసిన ధీరుడైపోయాడా!

తర్వాత సంచారం మొదలు!

స్వర సంచారం మొదలు!

నాదస్వర సంచారం మొదలు!



దక్షిణ భారతదేశంలో ఆయన వెళ్లని సంగీత సభుందా?

గుళ్లూ, గోపురాలూ ఉన్నాయా?

చేయించుకోని సన్మానం ఉందా?

పొందని బిరుదులున్నాయా?

అయినా తనకి కొన్ని బాణీలని నేర్పిన నాచ్యార్ కోయిల్ శ్రీరాజం, దొరై కణ్ణు సోదరులను గురువులుగా స్మరిస్తాడు.

కంచి కామకోటి పీఠం పరమాచార్య సమక్షంలో నాదస్వకర కచేరీ చేసి ధన్యాత్ముడయ్యాడు.

శృంగేరీ పీఠం శంకరాచార్యుల సముఖంలో కచేరీ చేసి పుణ్యాత్ముడయ్యాడు!

పుట్టడం ముస్లింగానే నయినా, ఆయన ఇల్లూ, ఆచారవ్యవహారాలూ వైదిక సాంప్రదాయాన్ని ప్రతిబింబించేవి.

పట్టుబట్ట కట్టడం, కుంకుమ బొట్టుపెట్టడం, భక్తిగా రాముడికి దణ్ణం పెట్టడం,

ఏమిటని ఎవరన్నా ప్రశ్నిస్తే ఆయన ఇలా అంటాడు- "నాదోపాసకులకు మతభేదమేమీలేదు. పర్వీన్ సుల్తానా చక్కగా కుంకుమ బొట్టు పెట్టుకునేది. బడే గులాం ఆలీఖాన్ పాకిస్తాన్‌లో కచేరీ ఇస్తూ 'కన్హయ్యా' (కృష్ణుడు) అనే గీతం ఆలపిస్తే అక్కడి వాళ్లు ఆక్షేపించగా కన్నయ్య లేని సంగీతం నాక్కఖర్లేదు' అని వచ్చేశాడట. భగవత్ సాక్షాత్కారానికి వివిధ మార్గాలున్నా నాకు సంగీతమే శరణ్యం. దాన్లో పై స్థాయికి వెళ్లటమే నా లక్ష్యం. అన్ని మతాల్లోనూ సంగీతానికి, భక్తికీ సంబంధం ఉంది. మేము అనుదినం చేసే నమాజు అల్లా... ఆ...ఆ...ఆ... అనే బేంగ్ (నినాదం) మాయా మాళవగౌళ రాగం!

సంగీతం నాకు ఎంత ప్రాణమైపోయిందంటే కరవదిలో మాకు మళ్లా మాన్యాలూ, ఇళ్లూ వాకిళ్లూ ఉన్నా కేవలం సంగీతం కోసం, సంగీత వాతావరణం కోసం శ్రీ వైష్ణవుల 108 దివ్య దేవాలయాల్లో ప్రధానమైన 'శ్రీరంగం'లోనే స్థిరపడ్డాను.

శ్రీరంగం కలియుగ వైకుంఠంగా విఖ్యాత మైంది.

ఆళ్వారుల్లో పెక్కుమంది శ్రీరంగ వైభవాన్ని గానం చేసారు. తిరుప్పాణాళ్వారు, నాచ్యార్ రంగనాధుని పాద సన్నిదిలో లీనమయ్యారు.

ఎంతోమంది సంగీత విద్వాంసులు ఈ శ్రీరంగ ద్వీపంలో జన్మించారు.

ఇలాంటి పుణ్యక్షేత్రంలో ఉంటూ నిత్యం నాదస్వరార్చన చేసుకోవటం నా పూర్వజన్మ

సుకృతంగా భావిస్తాను"...అంటూ కళ్ల నుండి ఆనంద బిందువులు దొర్లిస్తారు చినమౌలా! చినమౌలాని 1976 సం॥లో 'కళై మామణి' అనే బిరుదంతో తమిళనాడు ప్రభుత్వం సత్కరించింది!

1977లో భారతప్రభుత్వం 'పద్మశ్రీ' బిరుదంతో గౌరవించింది! కేంద్ర సంగీత నాటక అకాడమీ 1977లోనే అవార్డునిచ్చి తరించింది!

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 1980లో 'గానకళా ప్రపూర్ణ' బిరుదు,... 1981లో రాజమండ్రి సంగీత రసికులు 'గాంధర్వ కళానిధి' బిరుదు...

1984లో మచిలీపట్నం 'సరస్వతీ కళా సమితి' వారు 'నాద స్వర కళానిధి' బిరుదు...

ఆంధ్రవిశ్వవిద్యాలయం 1985లో 'గౌరవ డాక్టరేట్' పట్టము...

1987లో తెలుగు విశ్వవిద్యాలయం సత్కారం...

1988లో విజయవాడ త్యాగరాజ సంగీత కళా సమితి 'సంగీత విద్వన్మణి' బిరుదు...

ఇవేకాకుండా, అమెరికా, సోవియట్ యూనియన్, హాంకాంగ్...లాంటి దేశాల్లో నాద స్వర కచేరీ!

రాముణ్ణి, అల్లాని...కృష్ణుణ్ణీ, త్యాగయ్యనీ... నాదస్వరంతో పూజించే ఒక మహా విద్వాంసుడు, ఒక సత్పురుషుడు, ఒక తత్త్వవేత్త...అన్నిటినీ మించి ఒక మానవతా వాది శ్రీ షేక్ చినమౌలా!

**-తనికెళ్ల భరణి**

అద్దంకి నుంచి శ్రీ మోటుపల్లి రామదాసు గారు పంపిన సమాచారం ప్రకారం షేక్ చినమౌలా జననం 5.12.1924, మరణం: 13.04.1999 (మంగళవారం).

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

**1953**

❑ 'పతితా', 'ఆహ్' ల హిట్‌తో శంకర్-జైకిషన్‌లు తమ హవా కొనసాగించారు. అలాగే 'షికాస్త్'(లతా పాడిన 'కారే బద్‌రా తూ న జా...'), 'ఆస్', 'నయాఘర్', లతో పాటు 'ఔరత్' చిత్రంలోని పాటలు కూడా వీరికి మంచిపేరు తీసుకువచ్చాయి.

❂ 'పతితా' చిత్రంలోని 'కిసీనే ఆప్‌నా బనాకే ముఝ్‌కో...' పాట 'రాధా బినా హై కిషన్ అకేలా...' ('కిషన్ కన్హయ్యా' (1990)- రాజేష్‌రోషన్), 'నయా ముసాఫిర్ సఫర్ పురానా...'(ధన్‌వాన్(1993)-ఆనంద్ -మిలింద్ )లకు స్ఫూర్తి నిచ్చిందనవచ్చు.

❂'ఆహ్' చిత్రం కమర్షియల్‌గా ఫ్లాప్ అయినప్పటికీ ఆ చిత్రంలోని 'రాజా కి ఆయేగీ బారాత్...'(తర్వాత ఇదే టైటిల్‌తో ఓ చిత్రం కూడా రూపొందింది), 'ఆజా రే అబ్ మేరా దిల్ పుకారా...', 'జానే న నజర్...' పాటలు సూపర్ హిట్ అయ్యాయి. ఆర్.కె. సంస్థ రూపొందించిన చిత్రాలలో కేవలం ఇద్దరు గాయనీగాయకులు(లతా, ముకేష్) ఉన్నది కూడా ఈ చిత్రమే!

'ఆహ్' చిత్రంలో నర్గీస్, రాజ్‌కపూర్

❑ 'అనార్కలి' విడుదలయినది ఈ సంవత్సరమే. అజరామరమైన ఈ చిత్ర సంగీతం సి.రామచంద్రకు మంచిపేరు తీసుకు వచ్చింది. లతా గానం చేసిన 'యే జిందగీ ఉసీ కీ హై...', 'మొహబ్బత్ ఐసీ ధడ్కన్ హై...', హేమంత్‌కుమార్ గానం చేసిన 'జాగ్ దర్దే ఇష్క్‌జాగ్....', 'జిందగీప్యార్ కి దో చార్‌ఘడీ...'

సి.రామచంద్ర

పాటలు వారి కెరియర్‌లో చెప్పుకోతగ్గ మంచి హిట్ గీతాలుగా నిలిచిపోయాయి.

❂'జీవన్‌జ్యోతి' చిత్రం ద్వారా షమ్మీకపూర్‌కు ఎ.ఆర్.కర్దార్ బ్రేక్ నిచ్చారు. ఈ చిత్రంలో 'సో జా రే సో జా...' అనే పాటలో రెండు లైన్లను షమ్మీ స్వయంగా పాడారు. గీతా - రఫీల డ్యూయెట్ 'లగ్ గయీ అంఖియాన్ ఓ మేరే బాలమ్...'తో ప్రారంభమైన రఫీ-షమ్మీ ల బంధం దరిమలా ఉచ్చస్థితికి చేరుకుంది. (ఎస్.డి.బర్మన్ స్వరపరిచిన ఈ గీతానికి సాహిర్ లుధియాన్వి సాహిత్యాన్నందించారు.)

❂ గులామ్ మొహమద్ స్వరకల్పనలో షమ్మీ కోసం 'రైల్ కా డిబ్బా', 'లైలా -మజ్ను' చిత్రాలకు కూడా రఫీ పాడారు.

గులామ్ మొహమద్

శాంతారాం 'తీన్ బత్తీ చార్ రాస్తా' చిత్రానికి పండిట్ శివరాం(గాయని జయశ్రీ శివరాం తండ్రి) సంగీతం ఇచ్చారు. ఈ సినిమాలో పలుభాషలకు చెందిన కుటుంబసభ్యులు కలిసి పాడే పాటకై బెంగాలీ, హిందీ, మరాఠీ, గుజరాతీ ఇత్యాది భాషలకై వేర్వేరు గేయ రచయితలను, సంగీత దర్శకులను ఉపయోగించారు.

❂బిమల్‌రాయ్ నిర్మించిన 'దో బిఘా జమీన్' చిత్రం ద్వారా సలీల్‌చౌధురి హిందీ చిత్రరంగ ప్రవేశం. లతా, మన్నాడే, శైలేంద్రలతో అతని అనుబంధం ప్రారంభమయింది కూడా ఇప్పుడే. 'అప్‌నీ కహానీ', 'ఆజా రీ ఆ...', 'అజబ్ తేరీ దునియా..' పాటలు మంచి హిట్ అయ్యాయి.

❂మహేంద్రకపూర్ తొలిసారిగా 'మద్‌మస్త్' చిత్రంకోసం 'కిస్‌కే జుల్ఫ్ కి తస్వీర్ హై...', 'అంఖే దిఖ్‌తా హై...' అనే రెండు గీతాలను వి.బల్‌సారా సంగీతంలో పాడారు.

'ఫుట్‌పాత్' చిత్రంలో మీనాకుమారి, మాస్టర్ రోమి

❂'ఫుట్‌పాత్' చిత్రం ఖయ్యాంకు ఓ చిన్న బ్రేక్ నిచ్చింది. తలత్ మెహమూద్ పాడిన 'షామ్ ఎ గమ్ కి కసమ్' బాగా పాపులర్ అయింది.

❂'బాజ్' చిత్రంతో తొలిసారిగా గురుదత్, ఓ.పి.నయ్యర్ లు కలిసిపనిచేసారు. అయితే ఈ చిత్రం నయ్యర్ కెరియర్‌కు అంతగా సాయపడలేదు.

'బాజ్' చిత్రంలో కులదీప్‌కౌర్, గురుదత్

❂చితల్కర్ స్టయిల్లో పాడిన 'భగవాన్ తుఝే మైం ఖత్ లిఖ్‌తా...', చిత్రగుప్త కు సింగర్‌గా పేరువచ్చింది. 'మన్ చాలా' చిత్రంలో కిశోర్‌కుమార్‌తో కలిసి పాడిన కామెడీ యుగళగీతం 'సర్దీ కా బుఖార్ బురా...'లతో మంచి గుర్తింపువచ్చింది.

❂ చితల్కర్ తో కలిసి క్యారెక్టర్ ఆర్టిస్ట్ ఓంప్రకాష్ ఏ.వి.యం సంస్థనిర్మించిన 'లడ్కీ' చిత్రంలోని 'వా వా నారీ సే నాగన్ భలీ....' పాట పాడారు. ఆర్.సుదర్శనం, ధనీరాం, లు ఈ చిత్రానికి సంగీత దర్శకులు.



నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



దర్శక నిర్మాత శ్రీధర్ ('నాగేశ్వరరావు, సరోజా దేవి నటించిన 'పెళ్లి కానుక' ఇత్యాది తీసినవారు) మూడు భాషల్లో ఒక చిత్రం తీశారు. తెలుగు, తమిళం, కన్నడం. ఆ సినిమాకి బెంగుళూర్లో కొంత షూటింగు జరిగింది. ఒక షాటు తర్వాత ఒక షాటు చొప్పున మూడు భాషల్ని ఒకే సారి తీశారు, ఆయా భాషల నటులతో. తెలుగులో నేను, (తక్కిన రెండు భాషల్లో నా వేషం వేసినవారు గుర్తు లేదు).

మధ్యాహ్నం వరకూ ఒక దృశ్యం షూట్ చేసి, మధ్యాహ్నం తర్వాత ఒక ఇంటి ముందున్న లాన్‌లో చెయ్యాలి. వెతికారు. ఒక చోట ఒక ఇల్లు కనిపించింది. ఇల్లు అన్నమాట ఆ ఇంటికి చిన్నది. "పెద్ద బంగళా" అనాలి. దానిముందు ఆకు పచ్చని దట్టమైన తివాసీ పరిచినట్టు - పెద్ద అందమైన లాన్. అది దర్శక నిర్మాతనీ తక్కిన వారినీ ఆకర్షించింది. "అడుగుదాం. ఇస్తే ఇస్తారు లేకపోతే ఇంకోటి అడగొచ్చు" అనుకున్నారు, అడిగారు.

ఆ బంగళాధిపతి బంగళాదేశీయుడు కాదు గాని, ఉత్తర రాష్ట్రీయుడు. మిలిటరీలో పెద్ద ఉద్యోగం చేసి రిటైరయిన వాట్ట. "ఓ గంట సేపు షూటింగ్ చేసుకుంటాం" అంటే సరే అన్నాడు. "ఆ లాన్ లాగే అతని హృదయం కూడా విశాలమే" అని అభినందించుకుని, అతనికి అభివందనాలు తెలిపారు. "సరే నేను బయటకి వెళ్తున్నాను. గేటు తెరిచే వుంటుంది. నేను తిరిగొచ్చే వరకూ వుండండి." అని చెప్పి తాళం వేసిన బంగాళాని వప్పజెప్పి ఆ వాచ్‌మెన్‌ని కూడా తనతో తీసుకుని కార్లో వెళ్లిపోయాడు ఓనరు.

లాన్ మధ్యలో దాదాపు రెండు గంటల పాటు షూటింగ్ జరిగింది. కెమెరాని అటూ ఇటూ తిప్పడం, లైట్లు పెట్టడం, మూడు భాషల నటులూ అటూ ఇటూ నడవడంతో ఆ పచ్చిక తివాసీ బాగా నలిగి పోయింది. కొంత భాగం చిరిగిపోయింది కూడా! ఎంత జాగ్రత్తగా వున్నా తప్పదు మరి! షూటింగ్ ఇంకో రెండు షాట్లుందనగా రంమ్‌యని కార్లో వచ్చి దిగాడా కమాండర్. దిగినవాడు చూశాడు. తివాసీ ధ్వంసమైపోయి వుంది! ఇంగ్లీషు, హిందీ భాషల్లో తిట్టడం మొదలుపెట్టాడు. ప్రొడక్షన్ వాళ్లు ఏదో సర్దిచెప్పి, 'మళ్లీ అందంగా తీర్చి దిద్దుతాం' అని అంటున్నాకూడా వినిపించుకోకుండా లోపలికి వెళ్లి పెద్ద తుపాకీతో వచ్చి అందరికీ గురిపెట్టి వేమూరి గగ్గయ్య క్రోధస్థాయిలో పద్యం చదివినట్టు - గద్యం చెప్పి, యుద్ధంలో శత్రువుల మీదికి ఉరికినట్టు ఉరికాడు.

అంతే! తుపాకీ చప్పుడుకి పిట్టలు ఎగిరి



**నాగేష్**

పోయినట్టు ఎక్కడున్న వాళ్లు అక్కడుండకుండా, ఎలా వున్నవాళ్లు అలా పరుగెత్తారు! రోడ్డు మీదకి పరుగెత్తిన వాళ్లు ఆ పక్కా ఈ పక్కా పిక్కబలం చూపించారు. పంచె ఊడిపోతున్నా లెక్క చెయ్యకుండా, నేనో చెట్టు పక్కకి పరుగెత్తాను. ఉన్నవాళ్లలో నాకూ తెలిసినవాడు నాగేష్. ముందు ధైర్యవంతుడిలాగా నిదానంగా నడిచినా, తర్వాత ఓ కారు వెనక నక్కాడు. కెమెరా భుజాన వేసుకుని కెమెరా వాళ్లూ, లైట్లు మోసుకుంటూ లైట్ల వాళ్లూ దొరికిన చోటుని అందుకున్నారు. ఆ కమాండరు, తుపాకీ పెట్టి కాల్చకపోవచ్చుగాని, అతని వాగ్దాటీ తుపాకీ గురీ అలా కనిపించాయి. గేటుదాకా వచ్చి, మరింత తీవ్రస్థాయిలో "ప్రశంసించి" వెనుదిరిగి నిష్క్రమించాడు.

తుపాకీ తుపాను చల్లారి నట్టయింది. పిట్టలన్నీ మెల్లిగా మెల్లిగా గూడు చేరుకున్నట్టు బిక్కు బిక్కుమని ఓ చోట చేరుకుని - ఒకటే నవ్వు. భయం పారిపోయింది గనక, గుండె చేత్తో పట్టుకుని 'బ్రతుకుజీవుడా' అని మరీ నవ్వు! "రియల్ షూటింగ్" అన్నాడు నాగేష్.

సినీతి : సినీ షూటింగులకి అందమైన లాన్స్ ఇవ్వరాదు, అడగనూ రాదు!

* * *

ఒక సినిమా షూటింగు ఆచంట దగ్గరున్న ఒక గ్రామంలో ఆ సినిమా పేరు.....గుర్తు రావడంలేదు గాని, దర్శకుడు విజయబాబు. అంతకుముందు "వధూవరులు" అని ఓ చిత్రం డైరక్టు చేశాడు. ఆ సినిమాలోని ఒక దృశ్యం పెళ్లిచూపులు. ఒక అబ్బాయి పెళ్లిచూపులకి వస్తాడన్నమాట.

అది బ్లాక్ అండ్ వైట్ సినిమా. బాగా లోబడ్జెట్ వేసుకున్న సినిమా. అంచేత, రెండో టేకూ, మూడో టేకూ అని వుండవు. క్షుణ్ణంగా రిహార్సలు చేసి, ఫస్టు టేకు ఓకే చెయ్యవలసిందే. పెళ్లికొడుకు వేసిన అబ్బాయి లోకల్ టాలెంట్. చాలా కొత్తవాడు. కెమెరా అన్నా, దర్శకుడన్నా, పక్క నటులన్నా అమిత భయం గలవాడు. దృశ్యంలో, పెళ్లికూతురు కాఫీ అతనికి అందిస్తూ కావాలని అతని మీద ఒలక బోస్తుంది. అతను పాంటు తుడుచుకుంటూ "అపశకునం, ఈ పెళ్లినాకొద్దు" లాంటి డైలాగులు చెప్పాలి.

బిక్కు బిక్కు మంటూ రిహార్సల్సు చేశాడు. "భయపడొద్దు నాయనా! టేక్!... నెగెటివ్ చాలా ఖరీదు...జాగ్రత్త...అమ్మాయి కాఫీ పొయ్యగానే లేచి డైలాగ్ చెప్పు" అన్నాడు దర్శకుడు. తల ఊపాడు పెళ్లికొడుకు. ఫెడీమంది క్లాప్ బోర్డు. అబ్బాయి ఆ దెబ్బకే అదిరిపడ్డాడు. అమ్మాయి వచ్చి కాఫీ ఇవ్వబోయి ఒలకబోసింది. అబ్బాయి లేచి డైలాగు చెప్పబోయి, "తత్తత్తత్తత్త నేనేన్నే.." అన్నాడు. అతని తత్తరపాటుకి షూటింగు

చూస్తున్నవాళ్లు ఫక్కుమని నవ్వారు.

"వన్స్‌మోర్" అన్నాడు ఛాయాగ్రాహకుడు. "ఎందుకూ? ఓ.కే. ఈ టేక్ వోకే చేదాం" అన్నాడు డైరెక్టరు. "అదెలాగ?" అని అడిగాడు సహకార దర్శకుడు "ఏముంది? సింపుల్...ఈ కారెక్టర్‌కి ఇక్కడి నుంచి నత్తి పెడదాం" అన్నాడు దర్శకుడు.

"అదెలాసార్! నత్తిపెడితే, షాట్‌పొడుగు ఇంకా ఎక్కువై నెగెటివ్ ఖర్చుకాదా?" అన్నాడు ఛాయాగ్రాహకుడు. దర్శకుడు టోపీ తీసి తల గోక్కున్నాడు. "డబ్బింగులో ఏదో చేదాంలెండి... ఇది ఓకే. రెండో టేకు లేదు. మరిన్ని తత్తత్తలూ మెమ్మెమ్మెలూ వేస్తాడు" అన్నాడు దర్శకుడు వేరేషాటుకి ముందంజ వేస్తూ.

* * *

రామానాయుడిగారి చాలా సినిమాల్లో నేను వేశానుగాని, ఏనాడూ "నా కెంత ఇస్తారు? ఏమిస్తారు?" అని అడిగే అలవాటు లేదు నాకు. ఆయనిచ్చింది పుచ్చుకోడమే. ఎప్పుడిస్తే అప్పుడు పుచ్చుకోడమే. "ముందడుగు" సినిమాలో నేనున్నాను. డేట్స్ చెప్పారు. నాయుడుగారు ఆఫీసులో వున్న సమయం కనుక్కుని, గబగబా వెళ్లి 'నమస్కారం' అని "డేట్స్ ఇచ్చారు థాంక్స్" అన్నాను. "దాందేముంది? మన సినిమాల్లో ఉండడం మామూలేగదా'' అన్నారు రామానాయుడు. 'మామూలే అనుకోండి... మరి అడ్వాన్స్ ఇస్తారా?" అన్నాను. ఆయన కళ్లు చిట్లించి, అదోలా చూసి, "ఏమిటయ్యా ఎప్పుడూలేంది అడ్వాన్సు అడుగుతున్నావు?" అన్నారు. "మీరే అన్నారు కదా సార్ "ముందడుగు" అని..." అన్నాను సినిమా టైటిల్‌ని బట్టి.

డా॥ డి.రామానాయుడు

"బలేవాడివయ్యా...అందుకా ముందు అడుగుతున్నావు..." అని నాయుడుగారూ నవ్వేశారు.



కళ్యాణం రఘురామయ్య 'ఈలపాట' రఘురామయ్యగా ప్రసిద్ధుడు. కుడిచేతి చూపుడు వేలుని మడిచి, నోట్లోని నాలికని ముడిచి, వేలు పెట్టి ఈల పుట్టించి సంగీతమో పాటో ఆలపించే వారు. అదొక టెక్నిక్. ఆ టెక్నిక్‌లో ఆయన గట్టివాడు. అదలా వుండగా, స్టేజి మీద నటుడు. పాట మాట ఎలా వున్నా పద్యం చదవడంలో పేరు గాంచినవాడు. గుక్క పట్టి రాగాన్ని తిప్పి తిప్పి స్థాయి మార్చి నిలపడంలో అఖండ కంఠుడు. పద్యం కంటె రాగానికి ప్రాముఖ్యత ఇవ్వకపోతే ప్రేక్షకులు ఊరుకునేవారు కాదు. ఎంతసేపు రాగం తీస్తే అంత సేపూ చప్పట్లే.

సినిమాల్లో మొట్ట మొదటి కృష్ణ పాత్రధారి రఘురామయ్యే. పోతిన శ్రీనివాసరావు తీసిన 'పృథ్వీ పుత్ర' (1934)లో కృష్ణుడు. మరికొన్ని చిత్రాల్లో నారదుడు. కృష్ణ నారద పాత్రలు ఆరోజుల్లో ఆయనే ఎక్కువగా నటించారు. జానపద చిత్రం 'గొల్లభామ'లో హీరో. ఒకే ఒక్క సాంఘిక చిత్రం 'పంతులమ్మ'లో నటించినట్టు జ్ఞాపకం. సినిమాల్లో నటిస్తున్నా నాటకాలు వదల్లేదు. అయితే నాటకంలో ఏ పాత్ర ధరించినా సరే, నాటకాంతంలో రఘురామయ్య చేత ప్రేక్షకులు గోలా గగ్గోలూ పెట్టి ఈలపాట పాడించుకునేవారు.

నాటకం ప్రేక్షకులకి అదో అలవాటు వుండేది. బందా కనకలింగేశ్వరరావు కృష్ణుడు పాత్ర వేసినా చివర్లో 'గుత్తి వంకాయ కూర' పాడించుకునేవారు. ప్రైవేట్ రికార్డు ద్వారా ఆ పాట పాప్యులరు. ఘంటసాల వేసినప్పుడు కూడా చివర్లో జగమేమాయో, కుడి ఎడమైతేనో పాడి తీరవలసిందే. రఘురామయ్యకీ ప్రేక్షకులకీ వున్న సంబంధం ఈ ఈలపాట సంబంధం.

ఒక సినిమాలో (పేరు గుర్తు రావడం లేదు) కృష్ణుడు. సినిమా 'ది యెండ్' తర్వాత ప్రేక్షకులు ఈలపాట అడగలేరు గదా. ఒక ఈలపాట లేకపోతే, ప్రేక్షకులు నిరుత్సాహ పడిపోతారని, దర్శక నిర్మాతలు తీవ్రంగా ఆలోచించి, ఓ చమత్కారం చేశారు. ఆ సినిమాలో కృష్ణుడు చీటికీ మాటికీ మురళి వాయిస్తున్నాడని, సత్యభామ ఓ ఘట్టంలో ఆ ఫ్లూట్ దాచేస్తుంది. కృష్ణుడు వెతుక్కుంటాడు- కనిపించలేదు..లాభంలేదని, రఘురామయ్య అవతారం ఎత్తి, నోట్లో వేలు పెట్టుకుని కాస్సేపు ఈలపాట పాడతాడు శ్రీకృష్ణుడు. ఏర్పాటు బావుంది కదా ఉభయతారకంగా.

**(మార్చి 5 ఈలపాట రఘురామయ్య జయంతి సందర్భంగా...)**

# ఈలపాట రఘురామయ్య ఫిల్మ్ హిట్స్

**చిత్రం: దేవాంతకుడు (1960)**

రచన: ఆరుద్ర సంగీతం: అశ్వత్థామ

శ్రిత జనపాల శ్రీలోలా ॥2॥
జరిగేదంతా నీ లీలా ॥శ్రిత॥
పన్నగశయనా పంకజనయనా
నీ మహిమ తెలియతరమా ఏలికైనా ॥శ్రిత॥
తపముల జేసెడి దానవకోటికి ॥2॥
విపరీతముగా వరములనొసగి....ఆ ॥విప॥
ఆపద కలిగించుట బ్రహ్మాదుల వంతు ॥2॥
అది తొలగించుట యే...నీ వంతు ॥శ్రిత॥
ఈ కలియుగమున ఏదైనా వింతయే ॥2॥
లోకములన్నియు నరులకు చేరువే ॥2॥ లోకేశా...ఆ...
లోకేశా నీవైనా లోకువే ఈ కపట నాటకము ॥లో॥
నీ కల్పితమే నీ...కల్పితమే ॥శ్రిత॥

**చిత్రం: శ్రీ రామాంజనేయ యుద్ధం (1975)**

రచన: గబ్బిట వెంకటరావు సంగీతం: కె.వి. మహదేవన్

జయతు జయతు మంత్రం జన్మ సాఫల్య మంత్రం ॥రామ్-3॥
జనన మరణ భేద క్లేశ విచ్ఛేద మంత్రం ॥రామ్-4॥
సకల నిగమ మంత్రం సర్వ శాస్త్రైక మంత్రం
రఘుపతి నిజ మంత్రం రామరామేతి మంత్రం
రామ నీల మేఘశ్యామ కోదండరామ
రఘుకులాబ్ధి సోమ పరంధామ సార్వభౌమా ॥రామ॥
నీల మేఘశ్యామ...రఘురామ్ రామ్ రామ్ రఘురామ్
జయరామ్ రామ్ రామ్ జయరామ్ ॥రఘురామ్॥
తల్లి తండ్రి గురువు నీవే తోడునీడ నీవే ॥2॥
ధరణి జనులెల్ల పాలన జేసే పరంజ్యోతివే
జాగు ఇక చాలును రామయ్య
దాసులను బ్రోవగ రావయ్య ॥జాగు॥
తెలియ తరమా పలుక వశమా నీదు మహిమా రాఘవా ॥రామ॥
రాతినైన నాతిని జేసే నీ దివ్య పాదము ॥2॥
కోతినైన జ్ఞానిని జేసే నీ నామము
నీదుసరి దైవము లేరయ్యా నిన్ను నే నమ్మితి రామయ్య ॥నీదు॥
నీదు చరణం పాప హరణం మాకు శరణం రాఘవా ॥రామ॥

**చిత్రం: రామాంజనేయ యుద్ధం (1975)**

రచన: గబ్బిట వెంకటరావు సంగీతం: కె.వి.మహదేవన్

రామా...తగునా...నీ దాసుపైన రణభేరి వేయ సాకేత సార్వభౌమ
సాకేత సార్వభౌమా శరణు శరణయా జానకిరామా
కరుణ జూపవా మారుతిపై ॥సాకేత॥
కలనైనా నిను కొలిచే నేను కయ్యానికెటు లోర్తురా
రాచరికానికి హృదయమె లేదా నెయ్యానికెడమీయదా
ప్రేమ నిజాన న్యాయమిదేనా ॥2॥
ఇంకేల ఈ శోధన ॥సాకేత॥
భక్తుల బ్రోచే వరదుడవీవే భారము నీదేనయా
ఏమరినావ చేసిన సేవా నా మొర ఆలింపవా
దాసుని దోసము దండము తో సరి ॥2॥
భండన మేలనయా ॥సాకేత॥
రామా రామా రామా

**చిత్రం: మోహినీ భస్మాసుర (1975)**

రచన: ఆరుద్ర సంగీతం: ఎస్.రాజేశ్వరరావు

మన ధాటికీనాడు ఎదురులేదు...
నను గెలుచు మొనగాడు పుట్టలేడు
మధుర మధురామృతము తరిగిపోదు
మైమరచు ఈ సుఖము ఇంక పోదు...ఆ...
అవును లే ఈ సుఖమే సుఖమే ॥2॥
శృంగార సీమలో సొగసైన భామలు ॥2॥
ఆడి మురిపించితే ॥అవునులే॥
ఊరించు ఊర్వశి వయ్యారి ప్రేయసి ॥2॥
కవ్వించు మేనకా కానిమ్ము వేడుకా
కవ్వించు మేనకా...ఆ...
అపురూప శోభతో అందాల రంభతో
అపురూప శోభతో...ఆ... ॥అపు॥
ఆడి పులకించితే ॥అవునులే॥ ॥3॥ ॥అవునులే॥

**చిత్రం: భక్త మార్కండేయ (1956)**

రచన: సముద్రాల సీనియర్ సంగీతం: విశ్వనాధన్ రామ్మూర్తి

దేవాదిదేవ దేవాదిదేవ శ్రీకర శుభకర ॥2॥
గోవింద ఆనంద సంధాయకా శౌరీ
నీల శరీరా నిఖిలాధారా ॥2॥
విదిత సురారి వీర విహార ॥2॥
నిరుపమ నిర్మల మధురాకార ॥2॥
నిత్య నిరామయ జీవోంకార ॥2॥ ॥దేవాది॥
శోభిత నయన పన్నగ శయన ॥2॥
తత్వ ప్రధాన శాంతి నిధాన ॥శోభిత॥
కరుణాభరణ కమలారమణ ॥2॥
పావన చరణ భవభయహరణ ॥2॥
వందిత సురధర తాపన మందార
దేవత లోకోపచార ॥2॥ ॥దేవాది॥

**చిత్రం: శ్రీకృష్ణమాయ (1958)**

రచన: రావూరి సత్యనారాయణ రావు సంగీతం: టి.వి.రాజు

తరమే జగాన పాతకునైన తరుణీవిలాస తరుణీ విలాస
విమోహము దాట ॥2॥ ॥తరమే॥
నారిని చేరిన వారిని మాయామోహములో గొనగా
నారిని చేరిన వారిని మాయామోహములో గొనగా
ఇహ వాంఛలలో పడునేగాని
ఇహ వాంఛలలో పడునేగాని
ఆ... ఆ... ఆ... ఆ...
పరమును కనగలడా
పరమును కనగలడా
పరమును కనగలడా ॥తరమే॥

# ఇండియన్ రుచులు కలిపి...

# షానియా ట్వెయిన్




'కమ్ ఆన్ ఓవర్' ఆల్బమ్ 3 కోట్ల 40 లక్షల కాపీలు అమ్ముడుపోయి షానియా ట్వెయిన్‌కు విశ్వవిఖ్యాతి సమకూర్చింది. ఆ పేరు నిలబెట్టుకోవడానికా అన్నట్టు రెండేళ్లు గ్యాప్ ఇచ్చి షానియా మార్కెట్లోకి తెచ్చిన కొత్త ఆల్బమ్ 'అప్' కొత్త ప్రయోగంతో శ్రోతలను ఆకట్టుకుంటోంది.

'ఈస్ట్ ఈజ్ ఈస్ట్, వెస్ట్ ఈజ్ వెస్ట్, ది ట్వెయిన్ నెవర్‌మీట్స్' అనే నానుడిని ఛాలెంజ్ చేస్తోంది షానియా ట్వెయిన్!

ఆమె కొత్తగా వెలువరించిన 'అప్' రెడ్ ఆల్బమ్‌కు బ్లూఆల్బమ్ అనే ఇండియన్ వెర్షన్ తయారుచేసి దానితోబాటు ఉచితంగా ఇస్తోంది. ఈ బ్లూ ఆల్బమ్ అంటే ఏమిటి? ఒరిజినల్ రెడ్ ఆల్బమ్‌లోని 19 ట్రాక్స్‌ను భారతీయులచేత రీమిక్స్ చేయించి తయారుచేసిన ఆల్బమ్‌యే! ఈ పనికి ఆమె ఇండియాలో పుట్టి ఇంగ్లండులో స్థిరపడిన 'సైమన్ అండ్ డైమండ్' అనే డిజెలను నియోగించి బొంబాయి పంపించి భారతీయ వాయిద్యాలను, సంగీతకారుల సేవలను ఉపయోగించుకుంది.

ఇండియన్ మ్యూజిక్‌ను ఉపయోగించుకోవాలని ఈ కెనడియన్ గాయనికి ఎందుకు అనిపించింది? "నేను ఇండియన్ రెస్టారెంట్లకు తరచుగా వెళ్లి రెండు, మూడు గంటల పాటు ఆ పాటలూ అవీ వింటూ ఉంటాను. ఆ సంగీతం నన్ను ఎంతో ఆకట్టుకుంది." అంది షానియా. 'ఫ్రమ్ దిస్ మూమెంట్ ఆన్' అనే పాట చూసిన వారికి షానియా సిల్వర్ రంగు బిందీ పెట్టుకుని, దుపట్టా వేసుకోవడం గుర్తుండేఉంటుంది.

ఈ ఇండియన్ కనక్షనే కాదు, రెడ్ ఇండియన్ కనక్షన్ కూడా ఉంది షానియాకు.

- ఆమె అసలు తండ్రి క్లేరెన్స్ ఎడ్వర్డ్ రెడ్ ఇండియన్ వంశానికి చెందిన వాడేనని వాళ్లమ్మ చెప్పిందట.
- షానియా రెండవ యేట అసలు తండ్రి గుడ్‌బై చెప్పి వెళ్లిపోతే ఆమె తల్లి జెర్రీ ట్వెయిన్ అనే ఓజిబ్వా తెగకు చెందిన అసలు సిసలు రెడ్ ఇండియన్‌ను వివాహమాడింది. షానియా పెరిగినది అతని దగ్గరే, నేర్చినది ఆ సంస్కృతినే
- షానియా తల్లి షేరన్‌ను పెళ్లాడాక జెర్రీ, షానియాను అధికారికంగా దత్తత చేసుకున్నాడు. ఆ అభిమానంతో 'ఐలీన్ రెజీనా ఎడ్వర్డ్స్' అనే స్వంత పేరు షానియాగా మార్చుకుని (ఓజిబ్వా భాషలో షానియా అంటే 'ఐయామ్ ఆన్ మైవే' అని అర్థం) ట్వెయిన్ అని సవతి తండ్రి ఇంటిపేరు చేర్చుకుంది.
- అంతేకాదు, సవతి తండ్రి, తల్లి కారు ఏక్సిడెంట్‌లో 1987లో మరణించినప్పుడు 13,14 సంవత్సరాలున్న ఇద్దరు సవతి సోదరుల బాధ్యత వహించిందామె.

## మూడు రకాలుగా ఒకే ఆల్బమ్

- 'అప్' రెడ్ ఆల్బమ్: 19 ఒరిజినల్ ట్రాక్స్. ప్యూర్ పాప్
- 'అప్' గ్రీన్ ఆల్బమ్: జానపద సంగీతంతో కూర్చిన వెర్షన్
- బ్లూ ఆల్బమ్: లాటిన్ - ఇడియన్ రుచులతో పై 19 ట్రాక్స్ రీమిక్స్ వెర్షన్
- రెడ్ ఆల్బమ్ సిడి/క్యాసెట్ కొంటే బ్లూ ఆల్బమ్ ఉచితం.

## షానియా కెరియర్ గ్రాఫ్

- 1965లో ఒంటారియో (కెనడా)లో జన్మించిన షానియా 8 ఏళ్ల వయసు నుండి తల్లి ప్రోద్బలంతో పాడేది, గిటార్ వాయించేది.
- టీవీస్టేషన్లలో, రేడియోస్టేషన్లలో, పలు వేదికలపై ప్రదర్శనలు ఇచ్చి కుటుంబానికి డబ్బు సమకూర్చేది.
- క్లబ్బులో రాత్రి ఒంటిగంట తర్వాత, మద్యం సరఫరా ఆపేశాక, షానియాను నిద్రలేపి పాడించేది ఆమెతల్లి.
- ఆమె మూడవ ఆల్బమ్ 'కమ్ ఆన్ ఓవర్'(1997)తో షానియా తారాపథం అందుకుంది. ఆ ఆల్బమ్ RIAA డైమండ్ స్టేటస్‌కు చేరుకుంది.
- 1993లో జాన్ (మట్)లాంజ్‌ను పెళ్లాడింది. ఆల్బమ్ పాటలు రాయడంలో, నిర్మాణంలో అతను భార్యకు సహకరిస్తాడు.
- ఆగస్టు 2001లో ఆమెకు మగపిల్లవాడు కలిగాడు. పేరు ఈజా.
- 'అప్' ఆల్బమ్‌లోని 'ఐయామ్ గోన్నా గెచ్చా గుడ్' యు.ఎస్.చార్ట్స్‌లో ఇప్పటికే నెంబర్‌వన్ అయింది. 2002లో 8.74 లక్షల కాపీలు అమ్ముడుపోయింది.

# బాపు విశ్వరూపం

**7**

**బాపుకు ముందు తెలుగులో కార్టూనిస్టులు లేకపోలేదు. కానీ కార్టూన్ కళకు భారీ ఎత్తున గుర్తింపు వచ్చింది బాపుతోనే. ఆంధ్రప్రజలను కార్టూన్ ఇష్టులుగా, కార్టూనిస్టులుగా మార్చిన ఘనత ఆయనదే. తెలుగు నాట క్రోక్విల్ పట్టిన వారందరికీ కులపతి బాపుయే అని నిస్సందేహంగా చాటవచ్చు.**

**కార్టూన్‌ను ఒక జనరల్ వీక్లీ 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' కవర్‌పేజీ స్థాయికి తీసుకెళ్ళిన బాపు వ్యంగ్య చిత్ర కళానైపుణ్యానికి (రాజమండ్రి నుండి శ్రీ ఎం.వి.అప్పారావు గారు 40 ఏళ్ళుగా దాచుకుని పంపిన ఈ కవర్‌పేజీ ఓ ఉదాహరణ) అద్దం పడుతూ వెలువడిన బాపు కార్టూన్‌ల పుస్తకంపై ప్రముఖ కార్టూనిస్టు శ్రీ ఎం.ఎస్.రామకృష్ణ చేసిన సమీక్ష -**

చిత్రకళారంగంలో 'కార్టూన్' అనే ఓ ప్రక్రియ ఉంది. శ్రీ తలిసెట్టి రామారావు గారి చలవ వల్ల ఆ ప్రక్రియతో కొద్దిపాటి పరిచయం మాత్రమే ఏర్పడ్డ తెలుగుపాఠకులకు, దాన్ని ఎంతో దగ్గర చేసిన ఘనత నిస్సందేహంగా శ్రీ బాపుదే! 50వ దశకంలో తెలుగు కార్టూన్‌కి ఒక శైలినీ, ఒరవడినీ కూర్చి 'నభూతో న భవిష్యతి'గా చేశారు బాపు. ఈ యాభైయేళ్ళ తెలుగు కార్టూన్ల చరిత్ర పరిశీలిస్తే, విషయాన్ని చెప్పే విధానంలో గానీ, అలవోకగా గీతలు గీయటంలో గానీ, నిలువెల్లా చమత్కారం నింపి క్యాప్షన్ రాయడంలో గానీ ఆయన స్థాయి ఎవరూ అందుకోలేనిది-సినిమా సంగీతంలో ఘంటసాలలా! అందుకే, హాస్య-సంగీతాల్ని ప్రేమించే కళా హృదయమున్న తెలుగు వారికి బాపు, ఘంటసాలలు దేవుడిచ్చిన వరప్రసాదాలు! బాపు మనవారైనందుకు ఈ గడ్డపై పుట్టిన ప్రతి తెలుగువాడూ గర్వపడాలి. అలా పడలేకపోతే తెలుగువాడినని చెప్పుకోవడానికి సిగ్గుపడాలి. కారణం-బాపు కేవలం కార్టూన్లు (అందులోనూ సోషల్ టాపిక్స్, పాలిటిక్స్, సినిమాలు, యాడ్స్, కామిక్ స్ట్రిప్స్, ఎట్సెట్రా) మాత్రమే వెయ్యలేదు; రేఖాచిత్రాలు, వర్ణచిత్రాలు (వాటిలో సరసాల చిత్రాలు, నవరసాల చిత్రాలు, దేవతల చిత్రాలు, పురాణ గ్రంథాలకు కవర్ పిక్చర్స్, కథలు-నవలలకు క్లవర్ పిక్చర్స్, వగైరా), ఎందరో ప్రముఖుల కారికేచర్స్, గ్రీటింగ్ కార్డులు, లోగోలు, పిల్లలకు వీడియో పాఠాలు, సినిమా మరియు కమర్షియల్ పబ్లిసిటీ, చలన చిత్రాలు (కొన్ని 'సంచలన' చిత్రాలు!)... ఓహ్! ఒకటేమిటి! చివరికి తన గీతకే కాదు, తన 'రాత'కి కూడా ఓ ప్రత్యేకతని కల్పించారు! ఇంత పెద్ద కాన్వాస్ వున్న మరో చిత్రకారుణ్ణి చూపండి; నా మాట ఉపసంహరించుకుంటాను.

ప్రస్తుత విషయానికొస్తే, బాపుగారి కార్టూన్లలో ప్రత్యేకత-గీతల్లో పొదుపు, మాటలపై అదుపు! ఈ రెండూ కలగలిపి ఆయన వండిన రుచికరమైన కార్టూన్ వంటకం నవ్వుల్ని కొసరి కొసరి మరీ వడ్డిస్తుంది. ఈ నిరంతర కళాతపస్వి రూపొందించిన కార్టూన్లన్నీ ఒకచోట కలబోసి పాఠకుల ప్రత్యేకంగా రెండు సంపుటాలుగా "బాపు కార్టూన్లు" పేరుతో ఒక్కొక్కటి 300 పై చిలుకు పేజీలతో, 130 రూపాయల వెలతో అందించారు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారు!

సుమారు పాతికేళ్ళ క్రితం, ఆ తర్వాత మరోసారీ నవోదయా వారు 'కొంటె బొమ్మల బాపు' పేరుతో మూడు సంకలనాలు ప్రచురించారు. అందులోని కొన్ని కార్టూన్లనూ, కొత్తగా మరికొన్ని బాపు పాత కార్టూన్లనూ (అవంటే పడిచచ్చే నాలాటి అభిమానులు ఎందరో!) కలగలిపి ఒకేచోట అందుబాటు ధరలో (600 కార్టూన్లు పైగా-కడుపుబ్బా నవ్వించే కమ్మని ఈ కార్టూన్ల వెల ఒక్కోటి ఇరవై పైసలు!) ఈ రెండు సంపుటాల్లో పొందుపరిచారు.

సంపుటి-1లో మొదటి పేజీలోని మొదటి కార్టూన్ సాలూరి రాజేశ్వర్రావు గారి ప్రతిభను మెచ్చుకుంటూ వేసింది. వారి సంగీతం శ్రోతల్ని ఎంతగా సమ్మోహితుల్ని చేస్తుందో, వారి గానంలో ఎంత మాధుర్యం వుందో, పక్కనే వున్న గానలోలుడైన ఆ మురళీకృష్ణుణ్ణి కాదని సాలూరి వారి చుట్టూ పరిభ్రమిస్తున్న కోయిలల విన్యాసాల ద్వారా తెలియచేస్తారు బాపు. కార్టూన్ సాధనాన్ని కేవలం విమర్శకే కాక మెచ్చుకోలుకూ ఎంత చక్కగా మలుచుకున్నారో గమనించండి.

ఆయన చిత్రాలు కేవలం చూసి వదిలేసేవి కావు; ఆకళింపు చేసుకుంటున్న కొద్దీ వాటిలో కొత్త కొత్త సంగతులు, విషయాలు స్ఫురిస్తాయి. కార్టూన్ ముఖ్యంగా దృశ్యప్రధానమైనది. ఆ విషయానికి బాపు ఎంతటి ప్రాధాన్యత ఇస్తారో (అలాంటి కార్టూన్లు ఈ పుస్తకంలో కోకొల్లలు!),

మన దైనందిన జీవితాల్లో కన్పించే ఎన్నో సన్నివేశాల్ని తన కార్టూన్లలో కళ్ళక్కట్టినట్టు చిత్రిస్తారు బాపు. 45వ పేజీలోని కార్టూన్‌లో, వచ్చిన అతిథికి

గృహిణి కాఫీ అందించే బ్యాగ్రౌండ్ మనలో చాలామందికి సుపరిచితమే! అతిథి కొత్త వ్యక్తి అవడం వల్లనో, భర్త కట్టడి వల్లనో పరదా దాటి రాలేని గృహిణి; ఒకవేళ వస్తుందేమోననో, అలా రాకుండానో లేదా తాను కొత్తవారి కంటపడటం ఆవిడకు ఇష్టం లేకనో, ఎడం చేత్తో డోర్కర్టెన్ని తెరుచుకోకుండా వెనక్కి నెడుతూ కుడిచేత్తో కాఫీకప్పు అందుకొంటున్న ఇంటాయన!

అలాగే 247వ పేజీలోని కార్టూన్లో లోపల్నుంచి కాఫీ తెస్తున్న ఇల్లాలు అతిథి కోసమని కప్పులో, రెండవది (తనకో లేక మొగుడు గారికో-మనకే గదా అని!) గ్లాసులో! బ్యాగ్రౌండ్లో కూడా ఎంత చక్కని మధ్యతరగతి-




మనుషుల- మనస్తత్వ చిత్రీకరణ!! అసలు బాపు బ్యాగ్రౌండ్ చిత్రించే విధానమే విభిన్నంగా ఉంటుంది. గాడీగా లేకుండా అవసరమైనన్ని మాత్రమే పాత్రలు/ప్రాపర్టీస్తో సన్నివేశానికి ప్రాణం పోస్తారు.

306వ పేజీలో ఒక్క సర్వర్-బ్యాగ్రౌండ్తో మెయిన్ కారెక్టర్లు హోటల్లో



కూర్చున్నారని సజెస్ట్ చేశారు. అలాగే 22వ పేజీలోని బస్టాప్ సీన్, 41వ







పేజీలో ఇళ్ళ స్కెలిటన్-లైన్స్తో వీధి సీన్, 96వ పేజీలో కేవలం




పూలకుండీతో పోర్టికో-సీన్ సజెషన్, 109వ పేజీలో బెంచి డిజైన్తో పార్క్ సీన్, వగైరా.




47వ పేజీలోని కార్టూన్లో తలగడని కౌగలించుకుని నిద్రలో కలవరిస్తున్న భర్త పడుకున్న తీరూ, ఆ తీయని మూలుగుడుని వణుకుతున్న అక్షరాల్లో చూపిన విధానం, అటు తిరిగి ముడుచుకుని పడుకున్న భార్య ఈ మూలుగుడు విని వెనక్కి తిరిగి చూసే యాంగిల్, అదే రెండో బొమ్మలో సగం నిద్రలో సరిగా వంటిమీద స్పృహ లేకుండా లేచిన ఇల్లాలి



చెదిరిన చీర, జుత్తూ-ఇంత సహజమైన చిత్రీకరణ ఇమేజినేటివ్ ఆర్టిస్ట్‌కే సాధ్యం! అందుకేనేమో, తన చలనచిత్రాల్ని (సాక్షి, గోరంత దీపం, ముత్యాల ముగ్గు వగైరాలు సాక్ష్యాలు!) సహజత్వానికి ఎంతో దగ్గరగా తీయగలిగారు!!

96వ పేజీలోని కార్టూన్ హైక్లాస్ సొసైటీలోని కొందరు ఆడవాళ్ళ భేషజాలపైన, మితిమీరిన ఫ్యాషన్లపైన విసిరిన వ్యంగ్యబాణం! ఆ 'ఖరీదైన' తనాన్ని కేవలం కారులోనే కాక పక్కనే వున్న పూలకుండీ, సన్‌గ్లాసెస్, స్మోకింగ్ పైప్‌ల్లోనూ, ఆమె నడిచే స్టైల్‌లోనూ చూపించారు. అమ్మాయిల బొమ్మలు వేయడంలో ఆయనది అందెవేసిన చెయ్యి కదా! అలాగే 102వ పేజీలో ఓ ఫ్యాషన్‌బర్డ్ 'ఏమే, నీ పెళ్ళికి శుభలేఖేనా పంపలేదు' అంటే రెండో సీతాకోకచిలుక 'మర్చి పోయానే-ఈసారి పంపుతాలే' అంటుంది.




వాళ్ళేమిటో తెలియాలంటే, ఆ ఇద్దరు స్త్రీలు కూర్చున్న తీరూ, వేసుకున్న డ్రెస్సూ తిలకించండి. 97వ పేజీలో మగవాళ్ళని మత్తెక్కించే స్టైల్లో బస్టాప్‌లో




నిలబడ్డ భామామణిని ఆబగా చూస్తూ ఒక్కొక్కడూ బిళ్ళబీటుగా పడుతుంటే, ముందే పడ్డవాడొకడు 'జరగవయ్యా జరుగు, ఇంకోడొస్తున్నాడు' అనడం మగవాళ్ళ వీక్‌నెస్ మీద మహాగట్టి చురక! పై మూడు కార్టూన్లలోని స్త్రీలనూ, మిగతా కార్టూన్లలోని సంసారపక్షంగా వుండే స్త్రీలనూ పాత్రోచితంగా ఆయన చిత్రించే తీరు, వైవిధ్యం చిత్తగించండి!

మంచి కార్టూన్ గీయడం మాటలు చెప్పినంత తేలిక గాదు. చక్కని విమర్శకుడు; క్లుప్తంగా హాస్యంగా వ్యంగ్యంగా క్యాప్షన్ రాసే నేర్పు గల రచయిత; మంచికోణం నుంచి సన్నివేశాన్ని ఊహించగల ఫోటోగ్రాఫర్; ఆయా పాత్రలకు రూపకల్పన, వస్త్రధారణ తగిన బ్యాగ్రౌండ్ సన్నివేశ చిత్రీకరణ చేసి ఆకట్టుకునే బొమ్మల్ని చక్కని ఎక్స్‌ప్రెషన్స్‌తో గీయగల ఆర్టిస్టు-వీరందరి సమ్మేళనమే కార్టూనిస్టు! కార్టూన్‌లో విషయం, వ్యాఖ్య, బొమ్మ-ఈ మూడు చక్కగా కలగలిసిపోవాలి. అప్పుడే అది సూటిగా పాఠకుడి మనసులో నిలబడిపోయి "అబ్బ, మంచి కార్టూన్ వేశాడ్రా!" అని కితాబు తెచ్చుకుంటుంది. ఈ విద్యలో పరిపూర్ణ ప్రజ్ఞాశాలి బాపు! అంత చక్కని హాస్య ప్రకటనాశక్తి బొమ్మ గీయటంలో గొప్ప నేర్పూ ఉండటం వల్లనే ఆయన వేసిన ఎన్నో వేల కార్టూన్లు ఏభై యేళ్ళుగా తెలుగు పాఠకుల్ని అలరిస్తున్నాయి!

118వ పేజీలో బోర్లా పడుకుని విలాసంగా ఎడంకాలు పైకెత్తి నిలబెట్టి పత్రిక చదువుకుంటున్న గడసరి కోడలి అరికాలి మీద ఓ గడుసు అత్తగారు




వేడివేడి కాఫీకప్పు పెట్టి 'కోడలు పిల్లకి కాఫీ నీళ్ళేనా ఇవ్వదూ అని నన్నంటారు, తీసుకోమ్మా' అంటుంది. వైవిధ్యంగా తన ఈ నిశ్చలనచిత్రం'లోని ఊహనే "పెళ్ళిపుస్తకం" సినిమాలో 'చలన చిత్రంగా' చూపారు బాపు!



124, 128, 130, 134, 135 పేజీల్లో ఐదారు ఫ్రేముల్లో వేసిన కార్టూన్లని పరిశీలించండి. మనం రోజూ చూసే మిడిల్ క్లాస్ ఫ్యామిలీల్లోని సున్నితమైన హాస్యం, క్యాజువల్ సన్నివేశాలు, సాదాసీదాగా వున్న డైలాగులు, సహజమైన హావభావాలు, మంచి వారి సైకాలజీ... మనింట్లోనో (?!) లేక మన పక్కింట్లోనో చూస్తున్నంత మామూ


ఏమ్మా బుగ్గమీద మొటిమ ఇంకా తగ్గలేదూ- ఆయింటుమెంటూ మాత్రల్లూ రాసిస్తాగానీ- రేపటికల్లా తగ్గిపోతుందిగా- ఏమ్మా


గోరుచుట్టా! అడెడెడే, ఎంతపని జరిగింది! మరేంభయపడకమ్మా ఈ కాప్సూల్స్ పుటుక్కోటి వేసుకోండి రేపటికల్లా ఘుమ్మని కారు తోలుదురు గాని-


ఆ ఆ ఆ- అదీ- రాంపాగింపా నేనలా వెళ్లగానే హూష్ కాకీ అయిపోతుంది. రేపు మరో ఇంజక్షనిస్తా- వర్రీ కాకండి


పొద్దున్నించి తల బద్దలై పోతోందండీ. వళ్లు సలసలా కాగిపోతోంది. కళ్లన్నీ నొప్పులు


కాస్త అమృతాంజనం రాసుకుని కళ్లుమూసుకు పడుకో- అదే తగ్గుతుంది
మందునాకెక్కస్త కాఫీ తగలెయ్


ఏవండోయ్ బజారుకేగా వెళుతూంటా అరవీసు కాఫీపొడుం పట్టండి పంచదార కూడా అయిపోయింది


నేతి వాళ్లు ఈమధ్య తెచ్చిన సరుకు నాసిరకంగా ఉందనే ఇలాయితే పద్దుమానేస్తామని గట్టిగా చెప్పండి


వచ్చేప్పుడు కొబ్బరి ఉప్మాకి బీన్సు తెండి. అలాగే తిరకంబాటు కూడా తేసుకురండి


ఇదిగో- అలా బజారెడుతున్నాగానీ ఏదైనా కావాలా!


ఇందాకా మధ్యాహ్నం విశాలి వచ్చిందండోయ్
ఏ విశాలి!


ఆడే- సత్తినారాణ తమ్ముడి కెచ్చారూ- ఆమ్మాయి
ఏ సత్తినారాణ!


అదేనండీ సత్తిగాడ్లు అంటుండేవాళ్లం-
ఓహో. ఏం చేస్తున్నాడిటే


మళ్ళీ పోయామన్నండీ విశాలిని అడగడం
ఏ విశాలి!


అదే సత్తినారాణ తమ్ము.....




గిన్నెలో కొంచెం కాఫీ మిగిలిందిగానీ- మీ గ్లాసిలా పట్టండి
ఆ కొస్తా నువ్వు తాగేద్దూ
ఫరవాలేదు- ఈ రెండు చుక్కలూ పోస్తా పట్టండి
నిన్న తాగ మన్నానా


అబ్బ- పడుదురూ ఈ కొంచెమే
నువ్వు తాగవే


అన్నపొడు బుద్ధులే- సొంతానికి చూసుకోడం తప్ప నేనన్నకు కనిపిస్తానా.....

లుగా వుంటాయి.

221 నుంచీ 240 పేజీ వరకూ 'ఆరాధన' శీర్షిక కింద అతికొద్ది గీతలతో వేసిన సైలెంట్ కార్టూన్లు బాపు ఊహా శక్తికి, కల్పనా చాతుర్యానికీ ఉదాహరణలు. ప్రేమ మందిరంలో ప్రేయసి చెవిబుట్టనే గుడిగంటగా మోగిస్తున్న ప్రేమపూజారి, కలకంఠి కన్నీటి బిందువులతో కంఠాభరణం అమర్చుకునే కట్టుకున్నవాడు, ఏడిపించగా ఏరులైన ఆ కన్నీటిలోనే మునిగిపోతున్న మొగుడుగారు, తాపీగా వుండే తాబేలు ప్రియుణ్ణి వద్దని కుందేలు కుర్రాడితో జతకట్టిన జవ్వని, ..... ఇలా వాటిలో పొదిగిన ఎన్నెన్నో భావాలు చూసి గ్రహించవలసినవే! దర్శకుడిగా తన సినిమాల్లో ఆయన మనకు చూపెట్టిన కొన్ని చిన్నచిన్న మేజిక్కులు ఇలాంటి గమ్మత్తైన ఊహలే!

కాలానుగుణంగా తన స్ట్రోక్‌లో వచ్చిన మార్పునీ, ఈనాటి మారిన వాతావరణాన్ని బట్టి ఆయా పాత్రలు ప్రవర్తించే తీరునీ చూపెడుతూ దానికి మరికొంత వెరైటీని జోడించి కొన్ని పాత కార్టూన్లని కొత్తగా తిరిగి రచించారు బాపు. అరుదైన అలాంటి కొన్ని కార్టూన్లని ఇదివర్లో 'హాసం' 1-15 డిసెంబరు 2002 సంచికలో ప్రచురించారు. మరికొన్నింటిని ఈ సంకలనంలో చూడొచ్చు! 1970లో 'ఆంధ్రప్రభ' వీక్లీలో ఎడిటోరియల్ పక్క పేజీలో ప్రతివారం బాపు వేసిన అద్భుతమైన పేజీ కార్టూన్లని కొన్నింటిని ఈ సంపుటిలో నిక్షిప్తం చేశారు (15, 16, 40, 42, 60, 173 వగైరా పేజీలు). అన్నట్టు, గురజాడ వారి కన్యాశుల్కం చమత్కారాలు ఓ డజనుపైగా కార్టూన్లుగా వేశారు; అవి చెప్పే కన్నా చూసి విశ్లేషించుకుంటే కలిగే ఆనందం వేరు! పౌరాణిక చారిత్రాత్మక, జానపద సంఘటనలల్ని కొన్నింటిని తీసుకుని హాస్యం జోడించి బాపు సరదాగా వేసిన కార్టూన్లు కూడా ఇందులో వున్నాయి. భర్తచాటు భార్యలు, భార్య మాటు భర్తలు, బెదిరించే పెళ్ళాలు, ఎదిరించే మొగుళ్ళు, దాష్టికపు అత్తగార్లు, దబాయించే కోడళ్ళు... ఇంకా ఎందరెందరో-అందరూ ఇందులో పాత్రధారులే! ఇన్ని వైవిధ్యాలు చూపినా, ఆయన శైలిలో గొప్పతనం-విషయం వికటించదు; హాస్యం హద్దు దాటదు; శృంగారం శృతి మించదు!

ఈ ఆర్టికల్‌కి కొసమెరుపుగా ఓ పెద్ద బుల్లి సంగతి-ఏ కృతికర్త అయినా తన కథలో, కార్టూన్‌లో, కవితలో-ఏవైనా పుస్తకంగా అచ్చు వేసుకున్నాక ఓ పేరున్న పెద్దాయనకో, ముందు ముందు పనికొస్తాడనుకునే ముఖ్యమైన వ్యక్తికో అంకితం ఇవ్వడం ఆనవాయితీ. కానీ ఈ కార్టూన్ సంకలనాలను బాపూ తన విజయ పతాకాన్ని మోస్తూ ముందుకు తీసుకువెళ్తున్న శిష్య వర్గానికి అంకితం ఇచ్చారు. ఆయన పెద్ద మనసుకి ఇది ఓ బుల్లి ఉదాహరణ.

ఈ 'బాపు కార్టూన్ల'లో కనిపించే పనితనం కేవలం అభిమాన పాఠకులను అలరించటమే కాక, ఎదుగుతున్న లేక ఎదిగామని అనుకొంటున్న కార్టూనిస్టులక్కూడా ఒక గైడ్‌లా, రెఫరెన్స్ బుక్‌లా పనిచేస్తుంది!

**- ఎమ్.ఎస్.రామకృష్ణ**

# "ఈ అబ్బాయి చాలా మంచోడు" లో పాట గురించి

## 'హాసం' ఆడియో రివ్యూపై కీరవాణి స్పందన



**16-31 జనవరి 2003 సంచికలో వచ్చిన 'హాసం' ఆడియో రివ్యూలో కొంత భాగం**

కీరవాణి, గంగ పాడిన 'ఒక మనసుతో ఒక మనసుకి ముడి ఎట్లా వేస్తావో' పాట తెలుగు సినీ సంగీత చరిత్రలో చాలా కాలం పాటు నిలిచిపోయే పాట. 'ప్రేమా' అంటూ కీరవాణి తీసిన ఆలాపన వింటుంటే-అలనాటి 'కానిస్టేబుల్ కూతురు'(1963) సినిమాలోని "చిగురాకుల ఊయలలో ఇలమరచిన ఓ చిలుకా" పాటలో పల్లవి అంతంలోనూ, చరణాల నుండి పల్లవిని అందుకునేటప్పుడూ పి.బి.శ్రీనివాస్, సుశీల తీసిన ఆలాపనలు (ముఖ్యంగా... మా చెల్లెలు బాల సుమా....ఏమెరుగని బేల సుమా... అంటూ 'సుమా' దగ్గర వచ్చే ఆలాపన) గుర్తొచ్చి ఆపాత మాధుర్యంతో హృదయం నిండిపోతుంది. పాత సంగీత దర్శకుల మెలోడీస్‌ని టేపుల్లో భద్రపరచుకుని రెగ్యులర్‌గా వింటూ మెమొరీ కార్డ్స్‌లో బలోపేతం చేసుకునే కీరవాణి వంటి ఇప్పటి సంగీత దర్శకులతో ఇలాంటి 'అనుసృజనాలు' మరింత తీయదనంతో బైటికొస్తుంటాయి. అలాగే ఈ పాటలో 'మనసుల కలిమిడి ఫలితం ప్రేమా'/ 'మమతల అమృత వర్షిణి ప్రేమ' లాంటి వాక్యాలకు జత పడిన ట్యూన్‌లోని నడక-'గోవుల గోపన్న' సినిమా కోసం ఘంటసాల స్వరపరచి సుశీల, జె.వి.రాఘవులు, తదితరులతో పాడిన 'ఈ విరి తోటల లోగిలిలో' పాటలోని ' నీ హృదయంలో నిండెను కాంతి/ ఎందుకు సందియమిటు రావేలా' అనే రెండు వేర్వేరు వాక్యాలతో ట్యూన్‌ని నడిపిన పద్ధతిని గుర్తుచేస్తుంది.

**నమస్కారం!**

" ఈ అబ్బాయి చాలా మంచోడు"లో "ఒక మనసుతో" అన్న పాటలో 'కానిస్టేబుల్ కూతురు' సినిమాలో 'చిగురాకుల ఊయలలో' అనే పాటలోని ఒక లైనుకు ఛాయలు వచ్చాయని అలాగే 'గోవులగోపన్న' పాటలో కూడ ఒక లైను ఛాయలు వచ్చాయని అని మీరు అన్నారు. అది చాలా కరెక్టుగా పట్టుకున్నారు. చాలా సంతోషం. పాట బాగుంది, బాగోలేదు అని కాకుండా డీటేల్డ్‌గా వినే మీరు రాస్తున్నారనే నమ్మకం కలిగింది. మీరలా రాస్తారన్న విషయం ఆల్‌రెడీ తెలిసిందే అయినా మరోసారి నిరూపించబడింది. ఇది ఇట్లా ఎందుకు జరుగుతుంది. తెలిసి జరుగుతుందా, తెలియక జరుగుతుందా అనే ప్రశ్నవేశారు. మంచి ప్రశ్న. దీనికి జవాబు కాస్త వివరంగా చెప్పాల్సి వుంటుంది.

అందానికి నిర్వచనం చెప్పమంటే ఎందరో మహానుభావుల కొటేషన్స్ ఉంటాయి. ఠాగూర్ ఇలా అన్నారని, గాంధీ ఇలా అన్నారని! నా జీవితంలో నేను కనిపెట్టిన సత్యం ఒకటి- కొటేషన్ రూపంలో చెప్పాలంటే "బ్యూటీ ఈజ్ కంఫర్ట్" అంటే మనకి అనుకూలంగా ఉండేదే అందం. అది డైరెక్ట్‌గా "బ్యూటీ ఈజ్ కంఫర్ట్" అంటే అర్థమవదు దాన్ని ఎక్స్‌ప్లైన్ చేస్తే తప్ప! సపోజ్ నేను 3వ తరగతి చదువుకునేటప్పుడు బిస్కెట్ల మీద, చాక్లెట్ల మీద తినేవస్తువుల మీద ఆట బొమ్మలమీద మాత్రమే ఇంట్రస్టు చూపుతూ...అంటే...స్త్రీలలో అందాల్ని చూడాలనీగాని, చూసే ఆ ఏజ్ ఇంకా రానీ ఏజ్‌లోగాని... కాన్వెంట్‌లో చదువుకుంటుండగా నా క్లాస్‌మేట్ ఎవడో నన్ను కొడుతుండగా ఒక టీచరు గారు వచ్చి అతన్ని మందలించి, 'దెబ్బ తగిలిందా బాబు' అని కొంచెం ఎఫెక్షన్ చూపించి పక్కకు తీసుకొని వెళ్ళి సర్దిచెప్పి పంపించి ఉండవచ్చు. అంటే ఒక ఆపద నుంచీ, ఒక ఇబ్బందికరమైన సిట్యుయేషన్ నుంచి ఆమె రక్షించింది. ఆ పర్టిక్యులర్ టీచర్‌గారి ఫేస్‌లో కొన్ని ఫీచర్స్ తీసుకోండి. ఇప్పుడు ప్రపంచంలోని మనుషుల ముఖాలన్నీ కూడా బాడీ స్ట్రక్చర్‌బట్టి గానీ,



'ఒక మనసుతో ఒక మనసుకి' పాటలో కొన్ని సన్నివేశాలు

ఫేస్‌ను బట్టి గాని కేటగిరి చేసి చూస్తే ఒక 20 లేక 30 సెక్షన్స్ తోస్తాయి. వీళ్ళందరూ ఇలా ఉంటారు అని చెప్పి!

దివ్యభారతి చనిపోతే ఆమెలో రంభ కొంత వరకు కనబడుతుంది కాబట్టి (దివ్యభారతి ఎక్కడో పుట్టి ఉండొచ్చు. రంభ ఎక్కడో పుట్టి ఉండొచ్చు. రంభ విజయవాడ అమ్మాయి, దివ్యభారతిది బొంబాయి అనుకుంటాను సరిగ్గా తెలియదు) ఆ పోలికల్ని ఆధారంగా చేసుకొని ఆగిపోయిన సినిమాని కంప్యూటర్ సహాయంతో పూర్తి చేశారు.

ఈ పోలికలన్నీ కేటగిరైజ్ చేస్తే కొన్ని సెక్షన్స్ వస్తాయి. ఆ టీచర్‌గారి ఫేస్ ఏ పోలికలతో ఉందో... ఆవిడకు ఎత్తు పళ్ళు ఉండొచ్చు, ఏవైనా ఉండొచ్చు. ఏదైనా కానీ ఆవిడ నాకిష్టం. ఎందుకంటే ఆరోజున నన్ను రక్షించినందుకు. తర్వాత ఏ పాతిక సంవత్సరాలో ముప్ఫయి సంవత్సరాలో వచ్చిన తర్వాత నాకు ఒక అమ్మాయి కనిపించిందనుకోండి. ఈ టీచర్ పోలికలు ఏమైనా అమ్మాయి ముఖంలో కనబడితే నేను ఎట్రాక్ట్ అవ్వడానికి ప్రాపబులిటీ ఎక్కువ ఉంది.

ప్రాపబులిటీ అనేది గమనించాలి. నూరు శాతం నేను ఎట్రాక్ట్ అవుతానని చెప్పలేనుగాని దానికి ఛాన్సెస్ పెరుగుతాయి. అంటే టీచర్స్ గారిని చిన్నప్పుడు ప్రేమించానా అంటే కాదు. అక్కడ నాకు కంఫర్ట్ దొరికింది. ఎవరైతే రక్షించారో వారంటే పాజిటివ్ ఇంప్రషన్.

"అలాగే మనల్ని అవమానించిన వారిపట్ల నెగిటివ్ ఇంప్రషన్స్" స్టోర్ అయిపోయి ఉంటాయి మైండులో. మైండు ఒక కంప్యూటర్‌లాంటిది. పోలికల్ని బట్టి నేను దగ్గరవాలని చూస్తుంటాన్న మాట. ఎందుకంటే ఈ పోలికల ద్వారా ఎప్పుడో చిన్నప్పుడు జరిగిన సంఘటన ట్రిగర్ అవుతుంది. ఇదో పాయింట్...

దీన్ని పక్కన పెట్టండి. మ్యాథమేటిక్స్ థీరీస్ చేసేటప్పుడు ఒక పాయింట్ వచ్చి దాన్ని పక్కన పెడతారు. మైండు స్టోర్‌లో పెట్టినట్టు! నేను ఇక్కడ ఇంకో పాయింట్ చెప్తాను. జ్ఞాపక శక్తి అనేది మనకి "డైరెక్ట్లీ రిలేటడ్ విత్ టేస్ట్" మనకు ఇష్టమైన వ్యక్తుల ముఖాలు గుర్తుపెట్టుకుంటాం. ఇష్టం లేని వ్యక్తుల్ని మరచి పోతాం. ఎవరో వస్తారు 'నమస్కారమండి... బాగున్నారా?'' అంటే మనం ఎక్కడో చూసామే అని ఇబ్బంది పడుతుంటాం! నేనండీ ఫలానా! అంటే గుర్తురావచ్చు, రాకపోవచ్చు. "అన్ వాంటెడ్ థింగ్స్" ను మనం మరచి పోతాం. వాట్ ఈజ్ అన్ వాంటెడ్ అంటే "వాట్ ఈజ్ నాట్ లైక్‌డ్ ఈజ్ అన్‌వాంటెడ్".

మనకు యిష్టంలేనిది మనకు అక్కర్లేదు. మనకు అక్కర్లేనిది మనం మరిచిపోతాం. మైండ్‌లో నుండి డిలీట్ అయిపోతుంది. మెంటల్ ప్రాసెస్ అది. మనకు తెలియకుండా మెమరీలో నుంచి పోతుంది. కంప్యూటర్‌లో అయితే మనం కావాలని డిలీట్ చేస్తాం. మన మైండ్ ఆటోమేటిక్ కంప్యూటరండీ...మనకు అక్కర్లేనివి మరచిపోతాం. అలాగే, బయటివారు కంపోజ్ చేసిన పాటలలోనైనా మనం కంపోజ్ చేసిన పాటలలోనైనా చెత్త ఉంటే ఆ చెత్తని మనం మరచిపోతాం. నేను గొప్పపాట రాశానని ఎవరైనా అంటే అతనికి పరీక్ష ఏమీ పెట్టాలంటే, అయితే మీ పాటను మీరు చూడకుండా అప్పజెప్పండి అనాలి. లేదా గొప్ప ట్యూన్ కట్టాను అనే ఎవరన్నా అంటే ఆ ట్యూన్ అప్పజెప్పమనండి.

నేను ఇవాళ్టికి కంపోజ్‌చేసిన 1042 పాటల్లో కనీసం 600 పాటలు కంప్లీట్‌గా పల్లవి, చరణం, బీజియమ్స్ కూడా...ఏ బుక్కు చూడకుండా పాడగలను. వర్డ్స్ నేను పాడలేను. (వర్డ్స్ నచ్చినవి ఉంటే అవి కూడా పాడుతాను) నా జాబ్ నేను ఏదైతే చేసానో ఆ ట్యూన్ వరకు పల్లవి, చరణం, ఫస్ట్ బీజియం, సెకండ్ బీజియం, థర్డ్ బీజియం నేను అప్పజెప్పగలను అని గర్వంగా చెప్పుకుంటున్నాను. అంటే మిగిలిన 400 పాటలు చెత్త అని ఒప్పుకోవడం గమనించాలి. నేను చేసినవి అన్నీ మంచివని అనను. ఆ 400లు చెత్త. ఆ 400 నాకు గుర్తు లేవు. చెత్త కాబట్టి గుర్తులేవు. (ఆ రికార్డింగ్ జరిగే రోజుల్లో ఆ నెలలోపు గుర్తుంటాయి. తర్వాత గుర్తుండవు).

ఫర్ ఎగ్జాంపుల్ "జామురాతిరి" ఉందండి. అది కంప్లీట్‌గా గుర్తుంది. దట్ మీన్స్ గుర్తుండటం అనేది ఒక క్వాలిఫికేషన్. ఇక్కడ ఇంకో పాయింటుంది. మీ శత్రువు కూడా మీకు గుర్తుంటాడు! అంచేత మంచిదా చెడ్డదా అనే పాయింట్ పక్కన పెడితే గుర్తున్న దాంట్లో ఏదో పవర్ ఉందని ఒప్పుకోవాలి.

**ఇపుడు మీరడిగిన ప్రశ్నకు వస్తాను**

మనం క్రియేట్ చేసే ప్రతి మ్యూజిక్ కొత్తగా క్రియేట్ చేయట్లేదండి. ఎందుకంటే సరిగమలు 7 స్వరాలు లేదా ఇంకోలా చెప్పాలంటే 12 స్వరాలు. కెలేడియేస్కోప్ అనే పరికరం ఉంటుందండీ. దాన్ని అటూ ఇటూ తిప్పుతుంటే రకరకాల డిజైన్స్ వస్తూంటాయి. అలా ఆ 12 స్వరాల నుంచి మ్యూజిక్ క్రియేట్ చేసినపుడు వచ్చేవే ఈ ట్యూన్‌లు. నేను 1978లో కాలేజిలో చదువుకుంటున్న రోజుల్లో - భానుమతిగారు సమాధానం చెప్తుతారు. మీరు అడగండి అంటూ - విజయచిత్రలో ఓ ప్రకటన ఇచ్చారు. నేను ఓ ప్రశ్న పంపించాను. "భానుమతిగారూ...ఇప్పటికే బోలెడు అద్భుతమైన పాటలు వచ్చేశాయి కదండి. సరిగమలు ఏడే కదా. ఇక ఒకటి లేక రెండు సంవత్సరాల్లో క్రియేషన్ ఆగిపోవచ్చునేమో, కొత్త ట్యూన్‌లు వస్తాయంటారా?ఎలా వస్తాయి? రావేమో? మీరు ఏమంటారు?" అని రాశాను.

నెక్స్ట్ ఇష్యూలో ఆ కార్డుకు ఆన్సర్ రాలేదండి ఎన్నో ఉత్తరాలు వచ్చి ఉంటాయి. అందులో ఫిల్టర్ చేసి పారేసి ఉంటారు. ఆ ఉత్తరం ఆవిడకు రీచ్ కూడా అయి ఉండదు.

కానీ ఆ ఉత్తరానికి ఆన్సర్ తర్వాత నాకే అర్థమయిందండి. ఎందుకంటే ఈ అనంతమైన సృష్టిలో ఎప్పటికప్పుడు కొత్తగా ఏదో ఒకటి వస్తూనే ఉంటుంది. కాకపోతే అందులోని విషయం పాతదే. కానీ ఎప్పటికప్పుడు దాని స్వరూపం మారిపోతుంటుంది. ప్రేమ కథలు ఎన్నో ఉన్నాయి. ప్రతి ప్రేమ కథలోను ఒకటే ఉంది. ప్రేమంటే ఒక అమ్మాయి, అబ్బాయి ప్రేమించుకోవడమే.

ఎలిమెంట్ అదే. కాని, డిఫరెంట్‌గా ప్రజెంట్ చేసినట్టు ట్యూన్స్ డిఫరెంట్‌గా వస్తాయండి. మనం చిన్నప్పటినుంచి విన్నది ఏదైతే ఉన్నదో మన మైండ్‌లో స్టోర్ అయిపోయి ఉంటుంది. మనం చెప్పాలనుకున్న దాని ఛాయలు ఆటోమేటిక్‌గా దాని స్వరూపం మారి మన భాషలో వ్యక్తమవుతుంది.

ఓ పాటను యిష్టపడి ఆరాధిస్తూ దాన్ని సొంతం చేసుకుంటే అది ఏదో రూపంలో బయటకు వస్తుంది. బయటకొచ్చిన ఛాయల్లో అక్కడక్కడ చిన్న గమకాలు కలుస్తుంటాయి. ఆ ప్రోసెస్ సరదాగా ఉంటుంది తప్పితే ఆశ్చర్యం పొందే విధంగా ఉండదండి. ఇవి ఏవీ కాకుండా కొత్తది ఏదో చేస్తున్నాం అనుకుంటాం. కానీ అది కూడా ఎక్కడో ఏదో ఇంప్రెస్ అయిందాని ఫలితమే. ఇలా ఇప్పుడు మీరన్న "చిగురాకుల్లో ఊయలలో"(కానిస్టేబుల్ కూతురు), పాట నాకు చాల ఇష్టమండీ. నేను దాన్ని యిష్టపడటం వలన నా సబ్‌కాన్షస్ స్టేజ్‌లో స్టోరయి అది తెలియకుండా ఎమోషన్‌లో కంపోజ్ చేసేటప్పుడు వచ్చి ఉంటుందని నేను అనుకుంటున్నాను. ఇక "గోవులగోపన్న" పాట నేను వినలేదండి. వినకుండా వచ్చేది, వినకుండా మ్యాచ్ అయి వచ్చేది అది కాకతాళీయం కావచ్చు.

కంపోజర్స్ అనేవాళ్ళు ఒక ట్రెడిషన్‌లో పెరుగుతున్నప్పుడు ఒకే రకమైన సంగీత సాంప్రదాయం కలిగినటువంటి దేశంలో, ఆ రాష్ట్రంలో వాళ్ళు పుట్టి పెరిగినప్పుడు, వాళ్ళు కంపోజ్ చేసిన వర్క్స్‌లో ఇలా కొన్ని ఫ్రేజ్‌లు కలవడం అన్నది సర్వసహజం. అలా నాకు తెలియకుండానే కలిసిన పాయింట్ అయి ఉండొచ్చు. ■

# తెలుగు సినీ 'రంగావలోకనం'

**ప్రముఖ సినీ సంగీత విశ్లేషకుడు శ్రీ వి.ఎ.కె.రంగారావుతో పాత్రికేయుడు పి.నాగేశ్వరరావు జరిపిన పిచ్చాపాటిలో దొర్లిన కొన్ని ఆణిముత్యాలివి....**

▶అసలు సిసలైన తెలుగు పాటకు ఆద్యుడు అన్నమయ్య, తెలుగులో అన్నమయ్యను మించిన సాహిత్యం ఉందనుకోవడం లేదు. ఈ రోజు ఎవరు పాట రూపంలో ఏమి వ్రాసిన అన్నమయ్య పదకవిత పోలిక ఎక్కడో కనిపిస్తుంది. సుమారు ఐదున్నర శతాబ్దాల క్రితం అన్నమయ్య ఆలపించిన వేలకువేల పదకవితలలో సుమారు పన్నెండు వేలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. త్యాగరాజు, దీక్షితార్, శ్యామశాస్త్రి తదితర వాగ్గేయకారులకు శిష్య పరంపర ఉంది. వారి కీర్తనలను తరం నుండి తరానికి అందిస్తూనే ఉంది. అన్నమయ్యకు అటువంటి శిష్య పరంపర లేదు. అయినా అన్నమయ్య పాటలు, పదకవితల వరసలు ఇవి అని ఈనాటికీ ఖచ్చితంగా చెప్పగలం. మమ్మీ-డాడీ సంస్కృతి ఆవరించ నంతవరకు తెలుగునాట ప్రతి అమ్మ నోటా అన్నమయ్య మధుర కవితలు- జో అచ్యుతా నంద...., చందమామ రావే... వినిపిస్తూనే ఉండేవి.

▶ఇక తెలుగు సినిమాలో తొలిసారిగా అన్నమయ్య పాట వినిపించింది 1936లో అంతా పిల్లలతో తీసిన 'అనసూయ' సినిమాలో 'జో అచ్యుతానంద...' పాట. సి.హెచ్. కృష్ణవేణి అనసూయగా నటించింది. ఆ తరువాత తెనాలి రామకృష్ణలో 'ఇచ్చకాలు నాకు నీకు ఇంక ఏలరా' అనే అన్నమయ్య పాట ఉంది. అనురాగం చిత్రంలో 'విన్నపాలు వినవలె...' అంటూ పదకవితా మాధుర్యాన్ని తెలుగు ప్రజలకు అందించారు.

* * *

▶తెలుగు సినిమా ... తెలుగు సినిమా పాట అతి హీనస్థితిలో ఉన్నాయన్న విమర్శను నేను అంగీకరించలేను. మార్పు అనివార్యం. పెర్ఫామింగ్ ఆర్ట్స్ ని నేను 50 సంవత్సరాలుగా గమనిస్తున్నాను. మంచీ - చెడూ నిష్పత్తి మారలేదు. మంచి పాట గానీ, మంచి సినిమా గానీ అప్పుడు, ఇప్పుడూ ఒకే నిష్పత్తిలో ఉంటున్నాయి. 1930 దశకంలో ఏడాదికి కేవలం నాలుగైదు సినిమాలే వస్తే ప్రస్తుతం కనీసం వంద సినిమాలు తయారవుతున్నాయి. అయితే వాటిలో మంచీ-చెడూ నిష్పత్తి అలానే కొనసాగుతోంది. అసలు సినిమా వ్యాపారంలో ప్రొడక్ట్ పిరమిడ్ లాంటిది. అట్టడుగునే ఎక్కువ రాళ్లు ఉంటాయి. 1936 నుండి వినవస్తున్న సినిమా సంగీతానికి కూడా అదే నిష్పత్తి వర్తిస్తుంది.

* * *

▶తెలుగు సినిమాల్లో మొట్టమొదటి రాక్-ఎన్-రోల్ పాట ఏమిటని ఒకసారి వేటూరి అడిగారు. నాకు తెలిసినంతవరకు 'మరదలు పెళ్లి' చిత్రంలో పిలిచే గోదావరి ఒడ్డు... నోరూరించే బందరు లడ్డు' అనే పాట తొలిసారిగా రాక్-ఎన్-రోల్ తరహాలో స్వరపరచి చిత్రీకరించిన పాట. శ్రీశ్రీ రాసిన ఈ పాటకు పసుమర్తి కృష్ణమూర్తి కొరియోగ్రఫీ నిర్వహించారు. ఈ పాటకు సినిమాలో లక్ష్మీకాంత నృత్యం చేసింది. అలాగే 'భాగ్యరేఖ'లో దేవులపల్లి వ్రాసిన 'కన్నె ఎంతో సుందరి... సన్నజాజి పందిరి' కూడా ఈ బాణీలోనే ఉంది.

* * *

▶తెలుగు సినిమాలు మాటలు నేర్చి పాటలు పాడటం ప్రారంభించినప్పటినుండీ వసంతాన్ని వర్ణించే పాటలూ తెరకెక్కాయి. రత్నమాల సినిమాలో 'మదనా ... స్వాగతమోయీ...' అని మల్లాది రామకృష్ణశాస్త్రి గారు రాశారు. 1940 లో కన్నడిగులు తీసిన 'భూకైలాస్'లో బలిజేపల్లి వారు 'సుమడోలీ కేళీ...' అనే వసంతగీతం వ్రాసారు 1937 లో తీసిన 'మోహిని భస్మాసుర' లోనూ 'పార్వతీ పరిణయం' లోనూ వసంత ఋతువును వర్ణించే పాటలు ఉన్నాయి....

▶ఎన్నేళ్ళు గడచినా కర్ణాటక సంగీతంలో బాణీలు మారవు... ఆనాడు త్యాగరాజు ఎలా పాడాడో ఇప్పటికి అలానే పాడుతున్నాము-అని సంగీత విద్వాంసులు అంటారు. ఇది పూర్తిగా నిజం కాదు. గాయకుడు లేదా విద్వాంసుని బట్టి ఒక కీర్తనను ఆలపించే, లేదా వాయిద్యంపై వినిపించే పద్ధతిలో తేడాలుంటాయి. రసావిష్కరణలో వైవిధ్యం ఉంటుంది. ఒకనాటి నటుడు రంజన్ పియానోపై 'నగుమోము..' వినిపించేవారు. 'అభేరి' లో ఎన్నో రసాలు...ఎలా మారిందో అది వింటే తెలిసేది. అంతెందుకు! బాలమురళి పాడిన నగుమోము.... విని మా అమ్మమ్మ 'భీంపలాస్' అనుకుంది.

* * *

▶ప్రతిభావంతుడైన సంగీత దర్శకునికి సంగీతాచరణతో విశేష పరిచయంగల దర్శకుని ప్రోత్సాహం తోడయినప్పుడు ఒకప్పటి పద సాహిత్యానికి సంగీతపు గుబాళింపు జత కలసి మంచి పాట పుడుతుందనడానికి పూజాఫలం సినిమాలో 'శివ దీక్షాపరురాలను రా...' ఒక ఉదాహరణ. ఈ ప్రసిద్ధ పదం రెండు శతాబ్దాల క్రితం ఘనం శీనయ్య అనే పదకర్త వ్రాసినది. పూర్వం కచేరీలలో, మేజువాణీలలో, భరతనాట్య ప్రదర్శనలలో ఎక్కువగా వినిపించేది.

▶'కురంజి' రాగంలో సంప్రదాయసిద్దంగా ఉండే వరసను రాజేశ్వరరావు మాస్టారు కొద్దిగా మార్చి ప్రారంభంలో ఒక హమ్మింగ్ బిట్, మధ్యలో కూచిపూడి దరువులు కూర్చి తయారు చేసిన ఈ పాటను జానకి ఎంతో మధురంగా పాడింది.



▶

* * *

ఒకసారి ఘంటసాల గారికి ఏదో పాత పాట రాగం గురించి అడుగుతూ నేను కార్డు వ్రాసాను. అందులో ఘంటసాల సంగీత దర్శకత్వం వహించిన ఒక చిత్రం గురించి ప్రస్తావన వచ్చింది. 'ఆ చిత్రంలో మీ సంగీతం నాకేమీ బాగులేదు. ఒక్క పాటా నచ్చలేదు. అయినా అందులో మూడు పాటలు ప్రజాదరణ పొందుతాయి...' అని వ్రాసాను. దానికి ఘంటసాల సమాధానం ఇస్తూ 'సంగీతం విషయంలో మీ అభిరుచి ఉచితమైనదీ, సక్రమమైనదీ మాత్రమే కాదు... నిర్మాణాత్మకమైనది కూడా..' అని వ్రాసారు. ఈ జవాబులో కనిపించింది ఘంటసాల ఆత్మసంస్కారం మాత్రమే కాదు... సృజనాత్మకమైన పాటకు, ప్రజాదరణ పొందిన పాటకు గల తేడా వారు గ్రహించారన్నది కూడా.

▶

* * *

సినిమా సంగీతంలో ఒకోసారి ఎంతో మంచి పాటలు పుట్టి కూడా సినిమాలో కనిపించకుండా పోతాయి. బంగారు పంజరం సినిమాలో శ్రీరంజని పై చిత్రీకరించిన 'పదములె చాలు రామా...'అనే పాట, మా నాన్న నిర్దోషి సినిమాలో 'అలకలు తీరిన కన్నులు ఏమనె ప్రియా...' అనే పాట ఇందుకు ఉదాహరణలు.

▶

* * *

ఆ రోజుల్లో మా ప్రాంతాల్లో ఒక గొప్ప కళాకారిణి సరిగె లక్ష్మీ నరసమ్మ. అలా అంటే ఎవరికీ తెలియదు. 'కళావరు రింగు' అంటే చాలా మందికి గుర్తుకువస్తుంది. ఆమె కొన్ని పాటలు కూడా వ్రాసింది. ఆమె వ్రాసి 'మాండ్' రాగంలో స్వయంగా స్వరపరచుకున్న పాట 'రాధను నేనై, కృష్ణుడు తానై... రాదు కదా నిదుర' నాకు ఎంతో ఇష్టమైన పాట. కళావరు రింగు ఒకే సినిమా (ఆనాటి ప్రమీలార్జునీయం) లో నటించారు.

-పి.నాగేశ్వరరావు




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ.40/-

తెలుగు సినిమా ఆవిర్భవించిన తొలిదశకంలోని నటీనటులలో చాలా మందికి పాడడం ముఖ్యమైన అర్హతలలో ఒకటిగా వుండేది. అటువంటి నట గాయనీ గాయకులు 16 మంది పాడిన 17లను ఏరి కూర్చి 'సింగింగ్ స్టార్స్' పేరిట ఓ ఆడియోక్యాసెట్‌గా హెచ్.ఎం.వి.వారు విడుదల చేసారు. ఈ 16 మందిలో పాడడం బాగా తెలిసిన వారూ వున్నారు. కొద్దో గొప్పో తెలిసిన వారూ వున్నారు.

"త్యాగయ్య" చిత్రంలో నాగయ్య పాడిన 'ఎందరో మహానుభావులు' అనే త్యాగరాజ కీర్తనతో క్యాసెట్ మొదలవుతుంది. పాడిన వారి గురించి చెప్పాలన్నా, విన్నవారి పరంగా చెప్పాలన్నా 'ఎందరో మహానుభావులు' అనే వాక్యం నిజంగా ఔచిత్యం కలిగిన శుభారంభం. ఆ రకమైన స్పందనను కలిగిస్తూనే వుంటుంది నాగయ్యగారి కంఠం. ఇక 'చండిక' లోని 'నేనే రాణినైతే ఏలనె ఈధరను ఏక ధాటిగా' పాట, 'పల్నాటి యుద్ధం' లోని 'తానా పంతము నాతోనా' పాట గాయనిగా కన్నాంబ ధాటిని, దీటు తనాన్ని




చవి చూపిస్తాయి. 'కృష్ణ ప్రేమ' లోని 'కృష్ణ రారాద ఆటలాడి పోరాదా ఒక్క పాటైనా పాడ కూడ దా' పాటలో టంగుటూరి సూర్య కుమారి అలనాడు ఒలికించిన గళ సౌరభాల్ని ఆస్వాదించవచ్చు. ఇక 'మాయాబజార్' శకునిగా ఈ తరం వారికి గుర్తున్న సి.యస్.ఆర్. పాడడం అంటే 'శకుని వున్న చాలు శని యేలననికదా' అనే పద్యమే గుర్తుంటుంది. కానీ ఆయన స్వరంలో వెస్ట్రన్ కార్డ్స్ పలికితే ఎలా వుంటుందో తెలుసుకోవాలంటే 'గృహప్రవేశం'లో 'ధన్యుడనైతిని తులశమ్మక్కా' పాట వింటే చాలు...భలే సరదాగా వుంటుంది. 'పాతాళభైరవి' హీరోయిన్ మాలతితో శాంతకుమారి 'గుణసుందరి కథ'లో పాడిన 'చల్లని దొరవేలే' పాట, 'వెంటేశ్వర మహాత్మ్యం'లో పాడిన 'ఎన్నాళ్ళని నా కన్నులు కాయగ' పాట ఈ రెండూ ఆమెలోని మృదుమధుర రసావిష్కరణ తత్వానికి అద్దం పడతాయి. ముఖ్యంగా 'గుణసుందరి కథ' పాటలో 'చందమామా' అంటూ రెండు మూడు రకాలుగా పాడుతున్నప్పుడు, రాగాలాపనలు తీసేటప్పుడు ఆమె ఎంత హాయిగా పాడిందో తెలుసుకోవాలంటే వినితీరాల్సిందే! 'లైలామజ్ను'లోని 'అస్సలామలేకుం అంతా బావున్నారా' పాటలో కస్తూరి శివరావు హాస్యరసపోషణ శ్రోతలకు హుషారునిస్తుంది. ఈ పాటల మధ్య 'మంజరి' సినిమాలో జి.వరలక్ష్మి పాడిన 'పరిపాలయమాం జననీ' కొద్దిగా బలహీనంగా (వి)కనబడుతుంది. అందుకు కాంపెన్సేషన్ అన్నట్టు 'పాతాళభైరవి'లో రేలంగి పాడిన 'వినవే బాలా' పాట క్యాసెట్‌ని బలోపేతం చేస్తుంది.

'బి' సైడున గల పాటల్లో మొదటిదైన 'శ్రిత జనపాలా' (దేవాంతకుడులో) పాట ఈ మధ్యనే విడుదలైన రఘురామయ్య సినీహిట్స్ క్యాసెట్‌లో వచ్చినదే! ఇక గాయనిగా భానుమతి గురించి ఎవరికి తెలియదు!? ఆల్‌టైమ్ సింగర్ ఆమె...! ఆవిడ పాడిన 'చక్రపాణి'లోని 'మెల్ల మెల్లగా చల్ల చల్లగా రావే నిదురా హాయిగా' పాట కూడా ఆల్‌టైమ్ హిట్ సాంగే! పి.సూరిబాబు గురించి ఈ తరంవారికి బొత్తిగా తెలియదనే చెప్పాలి. పత్రికలు, టి.వీ. వంటివి కూడా ఈ విషయంలో తమ వంతు పాత్రను సరిగా పోషించలేదనే అనుకోవాలి. అందుకే ఆయన గురించి తెలుసుకోవాలంటే ఈ క్యాసెట్‌లో వున్న 'వెంకటేశ్వర మహాత్మ్యం' సినిమాలోని 'కళ్ళు తెరువరా నరుడా' పాటను విని తీరాలి. అలాగే మరొక మంచి గాయని యస్.వరలక్ష్మి. ఈమెను య'స్వర'లక్ష్మి అని ముళ్ళపూడి రమణగారు తన ఆర్టికల్స్‌లో చమత్కరించేవారు. 'బభ్రువాహన'లో ఆమె పాడిన 'ఏమని తానాడునో నేనేమని బదులాడనో' పాట వింటే ఆయన చేత అలా అనిపింపజేయగలిగిన ఆ స్వరంలోని మాధుర్యం ఎంతటిదో తెలుస్తుంది. వీరందరూ తెలుగు సినీ సంగీత చరిత్రలో కొన్ని అధ్యాయాలుగా నిలిచిపోయిన చరిత్ర కారులు. వీరిని గురించి తెలుసుకొని తీరాల్సిన అవసరం ప్రతి ప్రేక్షక శ్రోతకీ వుంది. తెలుగువాళ్ళమై, తెలుగు సినిమాలు చూస్తూ, ఆనందిస్తూ ఈ పరిశ్రమకు సంబంధించిన ముందు తరాలవారి గురించి తెలుసుకోక పోతేఎలా!? అందుకే ఈ క్యాసెట్ ప్రతి ఇంటా ఓ రిఫరెన్స్ బుక్‌లాగ వుంచుకుని తీరాలి. ఇక క్యాసెట్‌లో వున్న చివరి మూడు పాటలూ 'బాలరాజు'లో అక్కినేనిపాట 'చెలియా కనరావా', 'పెళ్ళిరోజు'లో (పి.బి. శ్రీనివాస్‌తో) జమున పాడిన 'పెళ్ళివారమండి', 'ఆలీబాబా 40 దొంగలు'లో జయలలిత పాడిన 'చల్ల చల్లనీ వెన్నెలాయె' ఈ మూడిటిలోనూ గానానికి సంబంధించిన ఎలిమెంట్స్ కన్నా గ్లామర్‌కి సంబంధించిన ఎలిమెంట్స్ ఎక్కువ. అయినా 'సింగింగ్ స్టార్స్' అనే మకుటం కింద రాకతప్పదు కనుక అవి కూడా ఈ క్యాసెట్‌లో చోటు చేసుకున్నాయి.

ఈ పాటలను సంపాదించటం అంత తేలికైన విషయంకాదు. ఎంతో శ్రమకి, వ్యయానికి తట్టుకో గలిగినప్పుడే ఇటువంటి ప్రాజెక్ట్‌లు వెలుగులో కొస్తాయి. ఇటీవల కొన్నాళ్ళుగా ఇటువంటి క్యాసెట్‌లు విడుదల చేయటంలో హెచ్.ఎం.వి.కి వస్తున్న మంచి పేరుకి కారకుడైన యస్.పి.శివప్రసాద్ (హెచ్.ఎం.వి.లో తెలుగు విభాగానికి (ప్రోడక్ట్ ఎగ్జిక్యూటివ్)) నిజంగా అభినందనీయుడు.





చదువులావు






సత్యమూర్తి BV
గుళ్ళో గంట ఎందుకు కడ్తార్రా?




దేముళ్ళని నన్నుచూడు అనిచెప్పడానికి




కాదు, పూజారిని పిలవడానికి




కాదు వాళ్ళని మనకోసం చూడు అని చెప్పడానికి

# ఓరి.. నీ ప్రేమ బంగారం కానూ..!













హాస్యానికి, సంగీతానికి అత్యంత ప్రాధాన్యత నిస్తూ గాయకుడు రాజేష్ హీరోగా, ఖడ్గం ఫేమ్ సంగీత హీరోయిన్‌గా ఏవియస్ దర్శకత్వం వహిస్తున్న 'ఓరి.. నీ ప్రేమ బంగారం కానూ..!' సినిమా షూటింగ్ ప్రారంభమయింది. అసలీసినిమా ప్రారంభానికి ముందునుంచే ఏవీయస్ విభిన్నరీతిలో పబ్లిసిటీని ఇవ్వటం మొదలుపెట్టారు. ఆ పబ్లిసిటీకి సంబంధించిన ఫొటోలను పక్కన చూడవచ్చు.

'ఇవాళ ప్రేక్షకుణ్ణి ఆకర్షించాలంటే ఎంతో కొంత స్పెషల్‌గా వుండాలి. స్పెషల్‌గా తయారుచేయించిన ఈ డిజైన్లతో వున్న హోర్డింగ్‌లు, పోస్టర్‌లు చూసిన తర్వాత కమ్యూనికేషన్స్ మీడియాకి సంబంధించిన ఓ అధికారి కూతురు 'డాడీ ఈ సినిమా చూసి తీరాలి'అని అన్నదట. వారిపేర్లు చెప్పటం ఇక్కడ భావ్యం కాదు. సినిమాలు తక్కువగా చూసేవారి దృష్టిని ఆకర్షింపచేయాలంటే పబ్లిసిటీ వెరైటీగా, డిఫరెంట్‌గా వుండాలి అని దీన్ని బట్టి తెలుస్తోందిగా" అని అన్నారు ఏవీయస్. తమిళంలోనూ, కన్నడంలో నటించడానికి ఎన్నో ఆఫర్లు వున్నా ఏవీయస్ చెప్పిన కథ, ఆయన తనని ట్రీట్ చేసిన విధానం నచ్చి నటించడానికి తొలిసారిగా ఒప్పుకున్నానని, ఈ సినిమాలో తన పాత్రకు తానే పాడుకుంటున్నాని భవిష్యత్తులో నటుడిగా, గాయకుడిగా కూడా కొనసాగాలని వుందని తెలిపారు రాజేష్. ఈ సినిమాకి మణిశర్మ సంగీతం, కోవై సరళ ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణ. ఇదిలా వుండగా ఆనాటి ప్రారంభోత్సవానికి వచ్చిన ప్రముఖులలో కొందరు- ఓరి నీ డైరెక్షన్ బంగారం కానూ, ఓరి నీ లైటింగ్ బంగారం కానూ, ఓరి నీ మైకులు బంగారం కానూ అని అనుకోవడం జరిగింది. దీన్నిబట్టి టైటిల్ ఆల్‌రెడీ పాపులర్ అయిపోయిందన్నమాట.

(మరికొన్ని న్యూస్‌బిట్స్ 41వ పేజీలో...)

## మా టీవీ సమర్పించు


జడ్జి: కూచి సూర్యానారాయణ దీక్షితులు








సూత్రధారి : యస్పీ బాలసుబ్రహ్మణ్యం


జడ్జి వి.వి.సుబ్రహ్మణ్యశర్మ

### కార్యక్రమాల వివరాలు

### 14వ ఎపిసోడ్- 1-03-03 రాత్రి 8.30 గం॥లకు



1. **హిమబిందు**
   - ఈ పాదం ఇలలోన (మయూరి)
   - రారోయి మా ఇంటికి (దొంగరాముడు)
   - ఎన్నాళ్ళని నా కన్నులు (శ్రీ వెంకటేశ్వర మహత్మ్యం)



2. **దుష్యంత్ కుమార్**
   - ఆనందాపరమానంద (శ్రీ మంజునాధ)
   - గాజువాక పిల్లా (నువ్వునేను)
   - స్వప్నవేణువేదో (రావోయి చందమామ)



3. **ప్రతిజ్ఞ**
   - అందమైన మనసులో (జయం)
   - నను కొట్టకురో తిట్టకురో (ఫ్యామిలీ సర్కస్)
   - పల్లవించు తొలి రాగమే (రాజా)



4. **శశికిరణ్**
   - నీకోసం... నీకోసం (నీకోసం)
   - రైలుబండిని నడిపేది (నువ్వు వస్తావనీ)
   - నువ్వంటే నాకిష్టం (నువ్వులేక నేనులేను)

### 15వ ఎపిసోడ్- 8-03-03 రాత్రి 8.30 గం॥లకు




1. **సాయిఫణీంద్ర**
   - తిరుమలగిరివాసా (రహస్యం)
   - ఏమే ఒప్పులకుప్ప (మహాబలుడు)
   - నా హృదయంలో (ఆరాధన)




2. **శ్రావణి**
   - అందాల బొమ్మతో (అమరశిల్పి జక్కన్న)
   - వానకాదు వానకాదు (భాగ్యచక్రం)
   - కనరాని దేవుడే (రంగులరాట్నం)




3. **మైథిలీశరణ్**
   - స్వరరాగ గంగా ప్రవాహమే (సరిగమలు)
   - వెన్నెల్లో హాయ్ హాయ్ (ఔను వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు)
   - కలువకు చంద్రుడు (చిల్లరదేవుళ్ళు)




4. **మాధవీలత**
   - జగమే మారినది (దేశద్రోహులు)
   - గోదారి గట్టుంది (మూగమనసులు)
   - పులకించని మది (పెళ్ళికానుక)

రచన: చైతన్య ప్రసాద్ **1** గానం: నతష గుల్‌మొహర్

వహ్వ వహ్వవహ్వా
నడిచె పడుచు హవా
హోయిరబ్బా డోలుదెబ్బా
అదిరిపోయె అరబి మురబ్బ ॥వహ్॥
వహ్వ వహ్వవహ్వా
దరువు వెయ్ గురువా
చెయ్ హమేషా - ఓ తమాషా
మార్చివేయ్‌రా - నేటి భాష ॥వహ్॥
వహ్వ వహ్వవహ్వా
సైరసై అనవా
వెలగనీయీ - దిల్‌కిషమ్మా
చిలిపి నవ్వే - చుమ్మా చుమ్మా ॥వహ్॥

రచన: పెద్దాడ మూర్తి **2** గానం : ఆర్.పి.పట్నాయక్, ఉష

ఆ: నందలాలా నందలాలా మురిపాలా గోపాలా
కో: నందలాలా...గోపాలా
వీడి చూపెంత కొంటెది ఓలాలో వచ్చినామీద వాలింది ఓలాలో
పచ్చిపాలంటి నా ఈడు అచ్చంగ ఈనాడు
మీగడవుతున్నది వెచ్చబెట్టే వేడిలో... ॥అ: నందలాలా॥
అ: సందేవేళకొస్తానంటా
ఆ: చందమామ చూస్తాడంటా...
అ: మాపటేల ముద్దిమ్మంటా...
ఆ: చుట్టు పక్కలున్నారంతా...
అ: రేతిరేళ కొస్తానంటా
ఆ: లేనిపోని తంటాలంటా
అ: దొడ్డిదారి కొస్తానంటా
ఆ: దొంగబుద్ధి పోలేదంటా...
అ: సోకులిన్ని చెప్తే ఎల్లాగ...సోకు బోలెడున్నా పిల్లా...
ఆ: కాక రేగి వస్తే ఇల్లాగ...కోక నలిగి పోదామల్లా...
అ: కోకట్టు కొస్తాను...రైకట్టుకొస్తాను...
కోకలోన పాగా వేసేసుకుంటానులే.... ॥నందలాలో॥
అ: గోపాలా గోపాలా గోపాల గోపెమ్మ సిగ్గంత దోచేలా
సైయ్యాటలాడాలి కోలాటమీయాల వెన్నెల్లో వెయ్యాల ఉయ్యాల
ఆ: అగడాలు తగ్గాలంటా...
అ: ఆడగాలి అగ్గేనంటా...
ఆ: తగ్గడాలు ఉండాలంటా...
అ: లేవు మా ఇంటావంటా...
ఆ: అంత రెచ్చి పోవద్దంటా
అ: కొత్త పిచ్చి పట్టిందంటా...



ఏయ్ పోభే...ఏంటీ పో భేనా... పోనీ రా...భే...
ఆ: లిప్స్‌కి ముద్దు పెట్టేద్దాం అనుకోవచ్చు
న నడుమున చెయ్యేయచ్చు నాకేం వచ్చు
ఉండాలయ్యో హద్దూ...పద్దూ...
అ: పున్నమి నైట్స్ విరజిమ్మే ఫుల్ మూన్ లైట్స్
చూపించాయి నీలో కట్స్ ఏవో థాట్స్ పెంచేస్తున్నాయ్ నాలో బీట్స్
ఆ: ఎందుకు నువ్వు వేసేస్తున్నావ్ కిటికీ డోర్సు కర్టెన్సూ
అ: తుంటరిగాలలి ఇంట్లోకొస్తే ఒంటికి హార్టింగ్సూ
ఆ: బాడీ ఎందుకు చూపిస్తున్నావ్ లేవా నీకు సిగ్గులస్సూ
అ: సిగ్గులెవరవో చెప్పేస్తున్నాయ్ యాపిల్ బుగ్గల్సు
అ: నీకు తెల్సు నాకు తెల్సు నీదీ నాదీ ఒకటే పల్సు
చేతులు మిక్స్ అయితే చప్పట్లు కనుకే నిన్ను నన్ను పలిచే దుప్పట్లు
ఆ: నీలో ఫోర్సు...నాలో ఫోర్సు చేసేశాయ్ ప్రేమ సిఫార్సు
ఆపేయమన్నది అల్లరి ఈ ఫోర్సు మనము చేయమన్నది ఒకటే సంసార్స్
అ: నీ ఏంగిల్సు నా ఏంగిల్సు అవుతాయమ్మో ఇక మింగిల్సు
కంగారెందుకు రావే బంగార్సు
ఆ: డింగ్ డాంగ్ బెల్స్ నా బ్యాంగిల్స్ పాడేస్తాయ్ లవ్ జింగిల్సు
రాత్రికి ఒకటే రాగం శృంగార్సు
సు...సు...సు...సు...
అ: పపర పపర పప్పర పప్పర పపర పపర
పప్పర పప పపర పపర పపర పప్పర పం
పప్పర పప్పర పప్పర పప్పర పం

రచన: చైతన్య ప్రసాద్ **6** గానం: ఆర్.పి.పట్నాయక్, సునీత

అ: నీ...కలలు కావాలి ఆ: ఇలా...కలిసిపోవాలి
అ: లోలోనే...నువ్వుంటే ఆ: ఏదో...హాయిగా ॥నీ కలలు॥
అ: చూపు లేఖలు రాసి- కను పాపసైగలతు చేసి
రాయభారమే పంపనీ
ఆ: కోరచూపులు నీవా - చిరు కోరికుంటే రావా
కొత్తగానే అనిపించనీ
అ: ఈ - పులకింతలో ఈ - గిలిగింలో
చెయ్యాలింక ఏకాంత సేవా...
ఆ: నినను - మురిపించనీ మై-మరపించనీ
ఆ అలవాటు నేర్పించవా... ॥నీ కలలు॥
ఆ: తీపి కూడా చేదే - ఇక నిదరకూడా రాదే
అ: వలపుకే అది ఫలితం కదా...
ఆ: వేడి ఊపిరై తడితే...తుదిలేని ఆశలే పుడితే
ప్రేమలో ఇది సహజం కదా...
ఎ- ధే రసరథం ర-తీ మన్మథం
ప్రతీ మాట సమ్మోహనాస్త్రం
నీ - ఆవేశమే నా - సందేశమై
అ: రచించాలి నవశాస్త్రమే ॥నీ కలలు॥



రచన: రాజశ్రీ **1** గానం : సురేష్ పీటర్

చికు బుకు చికు బుకు రైలే అదిరేనను దీని స్టయిలే
చక్కనైన చిక్కనైన ఫిగరే ఇది ఒకే అంటే గుబులే ॥చికు॥
దీని చూపుకు లేదు ఏ భాషా కళ్లలోనే ఉంది నిషా
దీని హోయలే చూస్తే జనఘోష
చెంగు తగిలితే కలుగును శోష ॥చికు॥
అహ...సైకిలెక్కి మేం వస్తుంటే
మీరు మోటర్ బైకులే చూస్తారు
అహ...మోటర్ బైకుపై మేం వస్తుంటే
మీరు మారుతీలు వెతికేరు
అహ...జీన్స్ పాంటుతో మేం వస్తే
మీరు బ్యాగి ప్యాంట్సుకై చూస్తారు
అహ...బ్యాగి ప్యాంట్సుతో మేం వస్తే
మీరు పంచలొంక చూస్తారు
మీకు ఏమి కావాలో మాకు అర్థం కాలేదే
పూలబాణలేశామే పిచ్చివాళ్లయి పోయామే ॥చికు॥
మాకు ఆటపాటలో అలుపొచ్చే
మీ వెనక తిరిగి ఇక విసుగొచ్చే
మా మతులు చెదిరి తల నెరుపొచ్చే
రాదులే వయసు మళ్లీ
మీ పెళ్లి కొరకు మీ పెద్దోళ్లు రేపిచ్చుకోవాలి కట్నాలు
అవి లేక జరగవు పెళ్లిళ్లు ఎందుకీ గోల మీకు
మీరు ఇపుడే లవ్‌చేస్తే మూడు ముళ్లు పడనిస్తే
కన్నవాళ్లకు అది మేలు చిన్నవాళ్లకు హాపీలు ॥చికు॥

రచన: రాజశ్రీ **2** గానం : మిన్మిని బృందం

ఆ: మావేలే మావేలే పరువాలు మావేలే
మీవేలే మీవేలే పంతాలు మీవేలే
మజాలే మజాలే చెయ్యాలి మజాలే
ఇదిలే ఇదలే టీనేజీ ఇదేలే ప్రాయం మళ్లీరాదు
వారెవ్వా బాబయ్య ॥మావేలే॥
ఆ: పడుచు పిల్లలకి భాగవతం చెప్పొద్దు
అ: చెప్పొద్దూ చెప్పొద్దూ ఆ మాటలు చెప్పొద్దూ
ఆ: చిలకే ఎగిరొస్తే విదిలించుకోవద్దు
అ: రావొద్దూ రావొద్దూ మళ్లీ మళ్లీ రావొద్దు



అ: అందం చందం నీకే సొంతం
ఆ: వెన్నెల్లోనే వేస్తా మంచం
అ: పైరగాలుల పందిరిలోనా కరిగిపోదాం మనం
అ: ముదినే.... ఆ: ముదినే....
కో: తన నాన నాన తననానే పల్లీ పల్లీ
తన నాన నాన తననానే ముదినే పల్లి
పల్లీ పల్లీ మానే పల్లి
పల్లీ పల్లీ అనకాపల్లి
పల్లీ పల్లీ కొండాపల్లి... ॥తాన॥

రచన: రాజశ్రీ **5** గానం : బాలు, జానకి & బృందం

కో: కొంటెగాడ్ని కట్టుకో కొంగుకేసి చుట్టుకో
కోటి వన్నెలున్న దాన
అందమంతా ఇచ్చుకో అందినంత పుచ్చుకో
వాలుకళ్ల పిల్లదాన
ఆ: తీరాలి అచ్చట్లు సాగాలి ముచ్చట్లు
సిగ్గుల్లో జారిపోవాలీ చీకట్లు ॥తీ॥ ॥కొంటె॥
అ: అందర్నీ దోచే దొంగనేనేలే
నా గుండె దోచుకున్న దొరసాని నీవేలే
అందర్నీ దోచే దొంగనేనేలే
నా గుండె దోచుకున్న దొరసాని నీవేలే
చిన్నారి మైనా చిన్నదాన
నేగాలం వేశానంటే పడితీరాలెవరైనా
బంగారమంటి సింగారం నీదే
అందం సొంతమైతే లేనిదేదీ లేదే ॥అ: కొంటె॥
ఆ: కొన చూపుతోనే వేశావు బాణం
రేపావు నాలో నిలువెల్లా దాహం
కొన చూపుతోనే వేశావు బాణం
రేపావు నాలో నిలువెల్లా దాహం
కొరగాని వాడితో మనువు మహాభోగం
ఈ మొనగాడే నావాడైతే బతుకు బంగారం
చిగురాకు పరువం సెగరేగె అందం
నీకు కానుకంట ప్రతి రోజూ పండగంట ॥అ: ఆ: కొంటె॥

ఆ: ఇరుకన్నులొక చూపుగా చెలిసగము లోకమంతా ॥గుడు॥
ఆ: మొగుడి ఊహతో మొగలి పువ్వులా ఉలికి ఉలికి పడతావమ్మా...
మొదలు తప్ప తుదిలేని బంధమే పెళ్లి పైడిబొమ్మా...
ఎదురు వచ్చినా ఎదుట నిలిచినా ఎన్నెలంత శుభమేనయ్యా...
నిదుర మబ్బులో కలల మెరుపు ఈ నిండు చందమామ...
మరి వద్దిక చేరని ఒద్దికలో చెలిపొద్దులు చాలని అల్లికలు
కో:అసలిద్దరు లేని ముద్దే మీరై పొద్దుకు దిద్దే కుంకుమలు... ॥గుడు॥
ఆ: నాటి పరిణయం వింత పరిమళం కొత్త పరిచయం ప్రతి పూటా...
పులకరింతల పువ్వులెన్నో పూచింది మనసుతోట...
ఏడు అడుగులే ఏడు జన్మలై ఎదుగుతున్నదీ ఈ బంధం...
గుండెలయలలో ఏక తాళమై మోగుతున్న సత్యం
కో:మాక్కూడా తెలుసును సీక్రెట్లు రారమ్మని కొట్టే రాకెట్లు
అ: చిరునవ్వుల్లాంటి పాపాయిలు ఈ జంటకి దొరికే కానుకలు... ॥గుడు॥

**రచన: చైతన్య ప్రసాద్ (5) గానం: ఆర్.పి.పట్నాయక్, ఉష**

ఆ: నీకేం తెల్సు నిమ్మకాయ పుల్సూ అమ్మాయి పల్సూ అందని పూల్సూ
చీకట్లోనే చురుకుల చూపుల్సూ మూసిన కన్నుల్లోనే కలలకు షేపుల్సూ
అ: ఇంకేం తెల్సూ వంకాయ పుల్సూ వేలకు వేల్సూ ఎగ్జాంపుల్సూ
లైటుంటేనే కళ్లకు క్లైపుల్సూ అపుడే కనపడతాయి అస్సలు రూపుల్సూ
ఆ: ఆపేయ్ స్టైల్సూ వంకర స్కిల్సూ కావాలంటావ్ కాకెంగిల్సూ
టేస్టులేని నాస్టీ దొంగల్సూ
అ: నడిచే డాల్సూ నవ్వుల డోల్సూ చెవిలో పూల్సూ బతుకే ఫాల్సూ
మేకింగ్‌లోనే షాకింగ్ లోపాల్సూ... సు...సు...సు...సు...
ఆ: నీకేం తెల్సు నిమ్మకాయ పుల్సూ అమ్మాయి పల్సూ అందని పూల్సూ
చీకట్లోనే చురుకుల చూపుల్సూ
అపుడే కనపడతాయి అస్సలు రూపుల్సూ
తరరరరరరర...తతతతరర...తతరర....తతతతరర...త
తత తత రర...తతత రర...తతతత రర త
అ: అమ్మాయి గార్సూ...ఓ ముద్దుల గుమ్మాయి గార్సు
బాగున్నాయ్ మీ అందాల్సూ మాకూ తెల్సూ ఉండాలండి దాపరికాల్సూ
ఆ: అబ్బాయ్ గార్సు ఓ వాగుడు డబ్బాయి గార్సు మీ నోటికి సెన్స్ వేస్టే మీల్స్
ఎందుకు మీకు మా వివరాల్సు
అ: ఉప్పుకారం తింటామండి ఊరికె వుండడం కష్టమ్సూ
ఆ: ఉండకపోతే పస్తుందండీ అది మీ యిష్టమ్సూ
అ: కాదని అంటూ కవ్విస్తారూ చెంతకు వస్తే పంతాల్సు
ఆ: అట్టాగయితే కట్టేసుకోండి కళ్లకు గంతల్సు
అ: నీకేం తెల్సూ...నిమ్మకాయ పుల్సూ
అబ్బాయి పల్సు తెలియని పూల్సు చెప్పేవన్నీ వట్టి గొప్పల్సు...
అయ్యో లోకం చూడని బావిలో కప్పల్సు
ఆ: ఇంకేం తెల్సు వంకాయ పుల్సూ ఎవరికి తెలియవు మీ లీలల్సు
నమ్మిన వాళ్లకు అన్నీ తిప్పల్సు చివరికి చేతికి వస్తాయ్ ఖాళీ చిప్పల్సూ



ఆ: పొడుగోల చెయ్యొద్దంటా
అ: ఈడు ఈల ఆపెదెట్టా...
ఆ: వేళాపాళా లేదా కిట్టయ్యా...గమ్మునుండరాదా కన్నా...
అ: విన్నపాలు వినవే రాధమ్మా...గుమ్మపాల ముద్దు గుమ్మా...
ఆ: తప్పు తప్పంటాను...తలుపేసుకుంటాను...
తగ్గు తగ్గంటూనే ఘడియేసుకుంటానులే... ॥నందలాలో॥
అ: నందలాలలా నందలాలా మురిపాలా గోపాలా
దీని నడెమెంత సన్నది ఓలాలో...
కాని గొడవెంత చేసింది ఓలాలో...
గొప్ప ఇబ్బంది తెచ్చింది...నా కొంప ముంచింది...
గుండెలోన నిప్పు కుంపట్లు పెట్టిందిలే... ॥నందలాలా॥

**రచన: పెద్దాడ మూర్తి (3) గానం: ఆర్.పి.పట్నాయక్, ఉష**

అ: ఇదిగో ఇపుడే ఎదిగిన ప్రేమో
నాలోనీలా పెరిగినదేమో
ప్రాణమా చేరవా...మౌనమే...మానుమా
చెంత ఉన్న వేళలో అంతపంతమా....
దూరమైన దారిలో వింత బంధమా...
ఆ: సొంతమైన వేళలో అంత తేలికా...
దొరకవన్న వేళలో ఇంత కోలికా... ॥ఇదిగో॥
అ: కలలే అలలై అలజడి రేపే
వలపే వగపై ఎదసడి ఆపే
ప్రేమలే నేరమా నేడిలా నేస్తమా...
అ: కలసి ఉన్న కాలమే తెలియలేదిదీ
తెలుసుకున్న సంగతే తెలుపలేనిది
ఆ: రేపులేని చూపులో నీటికన్నిదే...
నాకు నేను లేనుగా నీవు లేనిదే... ॥ఇదిగో॥
ఆ: ఇదిగో ఇపుడే ఎరిగిన ప్రేమో
నాలో నీలా పెరిగిన దేమో
ప్రాణమా చేరవా...మౌనమే...మానుమా...
అ: నేను నేను కానుగా నీవు లేనిదే
ఆ: ఆశరాలు కాలమే వీడుకోలిదే
అ: గురుతులెన్నో చేసెలే గుండె చప్పుడు
ఆ: ఊసుపోని చేతలే అప్పుడప్పుడు ॥ఇదిగో॥

**రచన: పెద్దాడ మూర్తి (4) గానం: ఉష, లెనిన్, గాయత్రి, రవివర్మ**

ఆ: గుడుగుడు గుంచం గుండేరాగం పాముల పట్నం పట్టికాబెల్లం
అత్తారింటికి దారేదీ దారేదీ దారేదీ
అ: అమ్మాయి చక్కగుంది...అబ్బాయి పక్కనుండి
ఆ: అబ్బాయికెంత వున్నా అమ్మాయి సొంతమేగా...
అ: ఒకటైన ఇద్దరుంటే చెలిసగం కౌగిలింత



ఆ: ఎనలేనీ అనురాగం వెయ్యేళ్లు సాగాలి
అ: కలలన్నీ పండించే ముద్దుల్లో తేలాలీ
ఉ ఊ...పరవశమే ॥ఆ: నా॥ ॥అ: నీ॥

**రచన: రాజశ్రీ (4) గానం: సాహుల్ హమీద్, స్వర్ణలత, మాల్గాడి శుభ**

అ: ముదినే పల్లి మడి చేలో ముద్దుగుమ్మ
నీ కొంగు పొంగు నా గుండె కోసెనమ్మా
బుట్ట మీద బుట్ట పెట్టి బుగ్గ మీద చుక్క పెట్టి
వాగల్లే నడిచావే
నీ బుట్టలోన పువ్వులన్నీ గుట్టులన్నీ రట్టు చేసి
నన్నీడ నడిచావే
కో: ముదనే....కోసెనమ్మా
కో: పల్లీ పల్లీ ముదినే పల్లి ॥2॥
అ: కాటుక కళ్ల వాడల్లో కట్టుకుంటా గుడిసంట
ఆ: పసుపుతాడు పడకుండా ఆగడాలే వద్దంట
అ: చింతపల్లి చిన్నోడ్ని చూడునీకు వరసంట
ఆ: వరసకాదు నాకంట మనసు ఉండే చాలంట
అ: పగలు రేయి
కో: నీతో వుంటా
ఆ: వున్నావంటే
కో: అది తప్పదంటా
అ: కలిసి వస్తే వెన్నెల మాసం చేయాలి జాగరం
ఆ: ముదినే పల్లి మడిచేలో ముద్దుగుమ్మ
నువ్వు ఓరాకంట చూసావో నెల తప్పెనమ్మా ॥ము॥
బుట్ట మీద బుట్ట పెట్టి నేను పువ్వులమ్ముతుంటే
కనుసైగ చేస్తావే
ముట్టుకుంటే కందిపోవు ముట్టరాని సోకు సూపి
గాలాలే వేస్తావే
కో: తననాన తననాన... ॥తన॥
అ: తమలపాకు తడిలోనా పండెనే నీ నోరంట
ఆ: నోటి పంట కాదంట పాడిపంట చూడంట
అ: నాకు నువ్వే తోడుంటే సంబరాలే నట్టింట
ఆ: ఆశపడిన మామయ్యది అందమైన మనసంట



ఆ: పూచేపూలన్నీ పూజలకే వాడొద్దు
పడుచుకి పూవందం మరిచిపోవద్దు
లక్షలు అడిగేనా లగ్నం నేనడిగేనా
ముహూర్తం పెట్టించు రేపో మాపో ॥మావేలే॥
ఆ: పానుపు నిద్దరకే పరిమితము కావొద్దు
అ: పెట్టొద్దూ పెట్టొద్దూ కొత్త రూలు పెట్టొద్దూ
ఆ: కాశ్మీర్ లోయల్లో కాశీని తలవొద్దూ
అ: పాడొద్దు పాడొద్దు హద్దుమీరి పాడొద్దు
ఆ: చక్కని వయ్యారి నీవెంట పడుతుంటే
దొరికీ దొరకనట్టు జారుకోవద్దూ
పగ్గం వెయ్యొద్దు పరువాలకిక ముందు
అనుభవించాలి నేడే నేడే ॥మావేలే॥

**రచన: రాజశ్రీ (3) గానం: బాలు, సుజాత**

ఆ: నా ఇంటి ముందున్న పూతోటనడిగేవో
నా ఒంటిపైన జారే నా పైటనడిగేవో
నీ చెవిలో సందేవేళ ఈ మాటే తెలిపేనే
నువ్వే నా ప్రాణమే ॥నా॥
అ: నువ్వు పలికే పలుకుల్లోనా వేడెక్కే వయసంటా
మనసారా చేరేవేళ మౌనాలే తగదంట
ఆ: సుడిగాలీ రేగిందంటే చిగురాకు విచ్చిందంట
వింతైన ఈ కవ్వింత నావల్ల కాదంట
అ: ఆషాడం పోయిందో గోదారే పొంగేను
ఆ: వైశాఖం వచ్చిందో అందాలే పూచేను
అ: ఈడే సద్దు చేసేనూ
అ: నీ ఇంటి ముందున్న పూతోటనడిగేవో
నీ ఒంటిపైన జారే నీ పూటనడిగేవో
నీ చెవిలో సందేవేళ ఈ ఊసే తెలిపేనే
నేనే నీ ప్రాణమే ॥నీ॥
ఆ: గుండెల్లో ఒక ఊహ ఉయ్యాల ఊగింది
మాటల్లో వెలిరాలేక పెదవుల్లో ఆగింది
అ: ఊహలకే మాటొస్తే హృదయాలే కలిసేనూ
చూపులకే నడకొస్తే స్వర్గాలే చేరేనూ

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కెమెరా | : సోమన్ |
| సంగీతం | : ఆర్.పి.పట్నాయక్ |
| ఎడిటింగ్ | : శంకర్ |
| మాటలు | : మధుకర్ |
| పాటలు | : పెద్దాడమూర్తి, చైతన్యప్రసాద్ |
| ఆర్ట్ | : నాగేంద్రప్రసాద్ |
| డాన్స్ | : శంకర్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్ | : జి.నాగేశ్వరరావు, శ్రీను |
| పబ్లిసిటీ | : ఏలె ధని |
| పి.ఆర్.ఓ. | : పులగం చిన్నారాయణ |
| కో-డైరెక్టర్ | : ముద్దినేని రమేష్ |
| అసోసియేట్స్ | : యాదగిరి, ఎస్.ఎం.పాషా |
| నిర్మాతలు | : ఎ.రమేష్‌గౌడ్, పి.టి.గిరిధర్‌రావు (ఆర్.పి.జి.) |
| సమర్పణ | : ఎవిఎస్ రాజు |
| కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : చంద్రసిద్ధార్థ |


ఎ.రమేష్ గౌడ్


పి.టి.గిరిధర్‌రావు


పెద్దాడమూర్తి

## తారాగణం

రాజా, శ్రీయరెడ్డి, భగవాన్, సాయి దియోధర్, జయసుధ, కైకాల సత్యనారాయణ, గిరిబాబు, వెంకట కృష్ణమోహన్, ఆహుతి ప్రసాద్, అన్నపూర్ణ, దేవన్, సుధ, జీవా, జాహ్నవి, చిత్రం శ్రీను, సుమన్‌శెట్టి, అపూర్వ, గిరిధర్, మురళి

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

నిర్మాణం: పెలుగని రమేష్‌గౌడ్ - పి.టి.గిరిధర్‌రావు

ఏవియస్‌రాజు సమర్పించు

ఆర్. పి. పట్నాయక్ సంగీతం

# అప్పుడప్పుడు
IN LOVE

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: చంద్ర సిద్ధార్థ


చంద్ర సిద్ధార్థ, చైతన్య ప్రసాద్, ఆర్.పి.పట్నాయక్



## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| డైలాగ్ రికార్డింగ్ | : పల్లవి ఆర్ట్స్, రమేష్-శంకర్ |
| ఆడియో మిక్సింగ్ | : సుజాత రికార్డింగ్ డివిజన్ |
| ప్లేబ్యాక్ | : ఎస్.పి.బాలు, ఎస్.జానకి, స్వర్ణలత, సుజాత, మిన్మిని, మల్గాడి శుభ, సురేష్ పీటర్స్, సాహుల్ అహ్మద్, మాస్టర్ జి.ఎస్.ప్రకాష్ కుమార్, నాగుర్‌బాబు |
| ప్రెస్ పబ్లిసిటీ ఇన్‌ఛార్జ్ | : జగన్ |
| పబ్లిసిటీ | : లంకా భాస్కర్ |
| ఆఫీస్ | : ఎస్.ఎ.అజీమ్, డి.ఎస్.సత్యనారాయణ |
| స్క్రీన్‌టైటిల్స్ | : రాజీకమల్-శశధరన్ |
| సౌండ్ ఎడిటర్ | : ఎన్.గణేష్ కుమార్ |
| అసిస్టెంట్ | : ఆర్.శ్రీధర్ |
| సహాయ రచయిత | : వి.ఆర్.కుమార్ జీ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : రఘురామ్.ఎ. |
| ఆర్ట్ | : మహి |
| డాన్స్ | : సుందరం, ప్రభుదేవా |
| ఫైట్స్ | : విక్రమ్ ధర్మ |
| ఎడిటింగ్ | : బి.లెనిన్, వి.జె.విజయన్ |
| ఫోటోగ్రఫీ | : జీవా |
| మాటలు-పాటలు | : రాజశ్రీ |
| సంగీతం | : ఎ.ఆర్.రహమాన్ |
| నిర్వహణ | : జె.రామచంద్రరావు, ఎన్.శ్రీనివాసరావు |
| నిర్మాత | : సూర్యా మూవీస్ |
| సమర్పణ | : ఎ.ఎం.రత్నం |
| కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : శంకర్ |

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.



# జెంటిల్‌మేన్

ఎ.ఆర్.రహమాన్ శంకర్ రాజశ్రీ ఎ.ఎం.రత్నం

## తారాగణం

అర్జున్, మధుబాల, చరణ్‌రాజ్, శుభశ్రీ, మనోరమ, నంబియార్, గౌండ్రమణి, సెంథిల్, రాజన్.పి.దేవ్, వినీత్, ప్రముఖ పాత్రలలో ప్రభుదేవా, గౌతమి


ఎ.ఎం.రత్నం


ఎ.ఆర్.రహమాన్


శంకర్


రాజశ్రీ




## 'గెలుపు' పాటల గురించి...

సౌందర్య, సుహాసిని, లయ కాంబినేషన్‌తో త్రిపురనేని మహారధిగారి అబ్బాయి త్రిపురనేని శ్రీప్రసాద్ దర్శకత్వం వహించి నిర్మించిన 'గెలుపు' సినిమా పాటలను పాత్రికేయులకు ప్రదర్శించారు. అనంతరం జరిగిన ప్రెస్ మీట్‌లో త్రిపురనేని శ్రీప్రసాద్ (ఇండస్ట్రీలో 'చిట్టి' అనే పేరుతో పిలుస్తుంటారీయన్ని)తో పాటు పాటల రచయిత శ్రీహర్ష పాల్గొన్నారు. సుహాసిని, లయపై చిత్రీకరించిన 'పొత్తిళ్ళలో ఉన్నప్పుడే నీ గుండె చప్పుడు విన్నానమ్మా'పాటలో త్రిపురనేని మహారధి వెలిబుచ్చిన ఎక్స్‌ప్రెషన్ గురించి ఎంతగానో



స్పందించారాయన. ఈ చిత్రంలోనే భారతీబాబు రాసిన 'నేన్వంటే నాకు జుజుబీ' అనే పాటలో 'ఇష్టం'కి బదులు 'జుజుబీ' అనే కొత్త పదాన్ని ప్రస్తావిస్తూ అలాంటి ప్రయోగం చేసినందుకు పింగళి నాగేంద్రరావు మాయాబజార్‌లో చెప్పినట్టు భారతీబాబుకి వీరతాడు వెయ్యాలన్నారు. త్రిపురనేని శ్రీప్రసాద్ మాట్లాడుతూ శ్రీహర్ష రాసిన ఇంటర్ కాలేజి సాంగ్ గురించి, పరుచూరి గోపాలకృష్ణ రాసిన 'ఇది ధరిత్రి చూడని చరిత్ర' గురించి వివరించారు.

## చిరంజీవి ముఖ్య అతిథిగా గల్ఫ్‌లో 'నిజం' ఆడియో ఆవిష్కరణ





ఇప్పుడు మార్కెట్లో సెలబిలిటీ ఉన్న పేరు-తేజ! అందుక్కారణం ఆయన ఏది చేస్తే అదే సంచలనం... ఎవ్వరూ ఊహించని రూట్లో ప్రయాణించడం, ఏ భేషజం లేకుండా ప్రాక్టికల్‌గా మాట్లాడడం ఆయన ప్రత్యేకత! నిజం ఆడియో ఆవిష్కరణ ప్లస్ 'జయం' సిల్వర్ జూబ్లీ ఫంక్షన్ షార్జా, కువైట్‌లో జరుపుతానని ప్రకటించి తన ప్రత్యేకతను మరోసారి ఋజువుచేసుకున్నాడాయన. 'జయం' లో నటించిన నటీనటులు పాల్గొనే ఈ ఫంక్షన్స్‌కి చిరంజీవి ముఖ్య అతిధిగా రావటానికి ఒప్పుకున్నారని చెబుతూ 'ఇంద్ర' సినిమా రిలీజయినపుడు తనక్కడ వున్నానని చిరంజీవిగారి మీదున్న క్రేజుతో అక్కడ థియేటర్‌లో అద్దాలు పగలుకొట్టి ఆ సినిమా అక్కడ వారు చూశారని తెలిపారాయన.

1998 నుంచి గల్ఫ్‌లో ఇంచుమించు 8 ప్రోగ్రామ్స్ దాకా చేసిన శశిశ్రీధర్‌బాబు ఉరఫ్ రాంబాబు ఈ కార్యక్రమాన్ని '2R ఈవెంట్స్' పేరిట నిర్వహించనున్నారు. "షార్జాలో ప్రోగ్రామ్‌కి ఎంతమంది వస్తారని ఎక్స్‌పెక్ట్ చేస్తున్నారు?" అని అడిగింది హాసం. "సుమారు 10నుంచి 15 వేలమంది" అని అన్నారు తేజ. "నలభై వేలమంది పట్టే స్టేడియంలో 10-15 వేలమంది మాత్రమే వస్తారనుకోవటం తక్కువే కదూ!?" అని తిరిగి అడిగింది హాసం. "అక్కడ గ్రాస్ చాలా వాల్యూబుల్. ఇలాంటి ప్రోగ్రామ్స్ జరిగినప్పుడు ఆ గ్రాస్ పాడైపోకుండా గ్రాస్ ఉన్నభాగాన్ని పూర్తిగా కవర్ చేస్తారు. అలా కవర్ చేసే భాగం 2/3వంతులు ఉంటుంది. మిగిలిన 1/3 భాగంలో మాత్రమే మనం ఫంక్షన్ చేసుకోవాలి. అందుకనే 10-15 వేలమందిని మాత్రమే ఎక్స్‌పెక్ట్ చేస్తున్నాం" అని జవాబిచ్చారు తేజ. దీన్నిబట్టే తెలుస్తుంది కదా తేజ ఎంత లోతుగా ఆలోచించి ప్లాన్‌చేస్తాడో... అందుకే అతని 'జయం' నిజంగా 'నిజం'.

## యస్వీ కృష్ణారెడ్డి సంగీత దర్శకత్వంలో మరో చిత్రం

తన చిత్రాలకు దర్శకత్వంతో పాటు సంగీత దర్శకత్వాన్ని కూడా నిర్వహించే యస్వీ కృష్ణారెడ్డి - నూతనత్వానికి ఆహ్వానం పలకాలన్న సంస్కారంతో- 'పెళ్ళాం ఊరెళితే' చిత్రానికి మణిశర్మ సంగీతాన్ని స్వీకరించాక- భవిష్యత్తులో కృష్ణారెడ్డి సంగీతంతో మళ్ళీ ఓ సినిమా ఎప్పుడొస్తుందో అని ఎదురు చూసే వారికి ఓ శుభవార్త వినిపించారు. కంప్యూటర్ రంగంలో ఎన్నో విజయాలు సాధించిన జగన్నాధరావు గారు జగన్నాద సినీ అండ్ మీడియా పతాకంపై నిర్మించనున్న చిత్రానికి దర్శకత్వాన్ని, సంగీత దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నట్టు తెలిపారు. ఫిబ్రవరి 20 న ఎల్.జె.స్టూడియోలో హిందోళ రాగం ఆధారంగా స్వరపరిచిన ఓ పాట రికార్డింగ్‌తో ఈ చిత్రం ప్రారంభమయింది. సంగీత దర్శకుడిగా తన తొలి చిత్రమైన 'కొబ్బరి బొండాం' కోసం స్వరపరిచిన తొలి పాట కూడా హిందోళ రాగం పై ఆధారపడినదేనని 'హాసం' తో తన జ్ఞాపకాలను పంచుకున్న శ్రీ యస్వీ కృష్ణారెడ్డి ఈ సందర్భంగా చార్లీ చాప్లిన్‌కి సంబంధించిన ఓ కథను చెప్పారు. ఓ ఇద్దరు కుర్రాళ్ళు ఓ మేకను పట్టుకోవడానికి చాలా అవస్థ పడుతున్నారట. ఆ మేక వాళ్ళను




తప్పించుకోవటం అదంతా చాప్లిన్‌కి ఎంతో నవ్వు తెప్పించిందంట. ఆ మేకను పట్టుకున్న కుర్రాళ్ళు దాన్ని వధించి, వండుకుని తిన్నారన్న విషయం తెలిసిన తర్వాత చాప్లిన్ హృదయం ద్రవించిపోయిందట. ఓ సంఘటన వెనుక విపరీతమైన నవ్వు తెప్పించే కామెడీ, దానికొక సెంటిమెంట్ టచ్‌తో చాప్లిన్ చిత్రాలు ఉండడానికి కారణం ఇదేనని చెబుతూ తన సినిమాలలో కూడా ఇదే సంప్రదాయం కొనసాగుతూ వచ్చిందని మాయలోడు, యమలీల, ఆహ్వానం మొదలుకొని పెళ్ళాం ఊరెళితే వరకు గల చిత్రాలను పేర్కొన్నరాయన. జగన్నాథ సినీ అండ్ మీడియా వారి ప్రొడక్షన్ నెం.1 లో కూడా ఈ తరహా సంప్రదాయం కొనసాగుతుందని తెలిపారాయన. వేణు, లయ, కళ్యాణి (ఔను వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు ఫేమ్) ఈ చిత్రంలో ప్రధాన తారాగణం.

(మరికొన్ని న్యూస్‌బిట్స్ 43వ పేజీలో...)

# దిసీజ్ ఖర్మ... దట్సాల్...!

సత్యమూర్తి బి.వి



"నీకు మేనేజరుగా ప్రమోషనూ, నిన్ను చూసుకోడానికి ఓ ప్యూన్‌నీ ఇస్తున్నాను" అంటాడు మీ ఎం.డి.



దాంతో 'ఎందుకొచ్చిన ప్రమోషన్‌రా బాబూ' అనే లెవెల్లో రాత్రింబవళ్ళు వర్కూ, అది పూర్తయ్యే దాకా మీకు నిద్ర రాకుండా చూసుకునే ప్యూనూ...



"బోల్డు డబ్బు పోసి డొనేషన్ కట్టి చేర్పించానూ మా వాడిని" అని మీరు గొప్పలు చెప్పుకుంటూ వుంటారు



అవన్నీ వింటున్న సదరు శ్రోత "భలేవారే ఆ కాలేజీలో ఇప్పుడు పిలిచి సీట్లిస్తున్నారండి" అని అంటాడు పుసుక్కున.



ఎన్నో ఏళ్ళుగా ఎదురుచూస్తున్న మంచి పాత సినిమా టీవీలో వస్తుందని, వి.సి.ఆర్.తో రికార్డ్ చేద్దామని అంతా సిద్ధం చేసుకుంటారు.



తీరా ఆ సినిమా మొదలయ్యే సమయానికి సరిగ్గా మూడు గంటల పాటు మాత్రమే వుండే అప్రకటిత విద్యుత్కోత ప్రారంభమవుతుంది.

# సత్యమే శివం పాటల గురించి...



కమల్‌హాసన్, మాధవన్ కాంబినేషన్‌లో తయారైన 'అన్బేశివమ్' తమిళ చిత్రాన్ని 'సత్యమే శివం' పేరిట తెలుగులోకి అనువదించిన సంగిశెట్టి దశరథ ఆ చిత్రంలో కొన్ని పాటలను పాత్రికేయులకు చూపించారు. 'నీ రూపం చిత్రిస్తుంటే నే మైమరిచా' పాటలో కమల్‌హాసన్ తాళ్ళతో వేలాడుతూ గోడపై పెయింట్ వేసిన సన్నివేశం ప్రేక్షకులను ఆకట్టుకుంటుంది.

భువనేశ్వరం నుంచి హైదరాబాద్ వరకు బస్సు పై కూర్చుని కమల్, మాధవన్ ప్రయాణం చేస్తూ పాడిన 'అరె బుజ్జి బుజ్జి తల తిరిగి తిరగి' పాట క్యాచీగా వుంది. ఇందుకోసం నిజంగా భువనేశ్వరం వెళ్ళి అక్కడ నుంచి చిత్రీకరించుకుంటూ వచ్చారు.

ఈ చిత్రంలో నాజర్ కుతంత్రంవల్ల కమల్‌హాసన్‌కి యాక్సిడెంట్ అవుతుంది. అతని కుడి చెయ్యి చలనం కోల్పోతుంది. చూపు మందగించి సోడాబుడ్డి కళ్ళద్దాలు పెట్టుకో వలసి వస్తుంది. పలువరస అధ్వాన్నంగా తయారవుతుంది. మీసకట్టు గ్రహణం తొర్రిలా తయారయి ముఖమంతా అందవిహీనమయి పోతుంది. అతడు చావుబతుకుల మధ్య కొట్టుమిట్టాడుతున్న సమయంలో నాజర్ అవహేళనగా మాట్లాడతాడు. ఆ తరువాత 'నేనే శివమ్' అనే పాట నేపథ్య గీతంగా వస్తుంది. ఈ పాటకు లీడ్‌గా నాజర్ అవహేళన చేసేసే సన్నివేశంలో కేవలం కుడికంటితో మాత్రమే కమల్ చూపిన నటన ప్రేక్షకులకు హత్తుకుపోతుంది.

పాటల ప్రదర్శన ముగిసిన తర్వాత "కొన్ని పాటలు మాత్రమే చూపించారు. మిగిలిన పాటల సంగతేంటి?'' అని 'హాసం' అడిగింది.



"అవి సినిమాలో బిట్లు బిట్లుగా వస్తాయి. అందుకని...'' అన్నారు నిర్మాత సంగిశెట్టి దశరథ. "

"మౌనమే పాటగా పాడుకుందాం... అనే డ్యూయెట్ ఇంకోటి ఉండాలిగా అది కూడా బిట్‌లుగా వస్తుందా?''

"లేదండి లెంగ్త్ ఎక్కువైన కారణంగా ఆ డ్యూయెట్‌ని సినిమా నుంచి తొలగించటం జరిగింది.''

"అలా అయితే ఆ పాట ఆడియో, వీడియో రైట్స్ మీ దగ్గరే ఉంటాయి కాబట్టి భవిష్యత్తులో ఇంకేదైనా సినిమాకు ఉపయోగించుకోవచ్చుగా....''

"అసలాపాట షూట్ ఒరిజినల్ వెర్షన్‌లో కూడా షూట్ చెయ్యలేదండి. వాళ్ళూ ఆడియో కోసం పాడించారు. మేమూ ఆడియో కోసం పాడించాం. కనుక ఆడియో రైట్స్ మాత్రం మనకుంటాయి. మీరన్నట్టు ఫ్యూచర్‌లో మన సినిమాల్లో ఉపయోగించుకునే ఛాన్స్ కూడా వుంది'' అంటూ జవాబిచ్చారు సంగిశెట్టి దశరథ.







## మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్లు




విడుదల : సురభి
వెల : రూ॥50/-




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ॥55/-

## కొంటెకొశ్చెన్లు-తుంటరి జవాబులు



పులగం చిన్నారాయణ (ఫిలిం జర్నలిస్ట్) హైదారాబాద్.

❖ చాలామంది ఆడవాళ్ళు చీరలకు ఫాల్స్ లేకపోతే కట్టరు... ఎంచేతంటారు?

✦ అదో ఫాల్స్ ప్రిస్టేజి

వి.మంజురాణి, హైదారాబాద్.

❖ అతి తెలివి తేటలతో అల్లాడి పోతున్న చమత్కారి టెలిఫోన్ బూత్‌కి వెళితే ఏం అడుగుతాడు?

✦ ఫెవికాల్ సౌకర్యం వుందా అని అడుగుతాడు

డి.బల్లజార్, రామచంద్రాపురం.

❖ కార్డియాలజిస్ట్ అదిరిపడేదెప్పుడు?

✦ 'కష్టాలను తట్టుకోవాలి కాబట్టి గుండె గట్టిపడడానికి ట్రీట్‌మెంట్ ఇవ్వండి డాక్టర్' అని పేషెంట్ అడిగినప్పుడు

## డబుల్‌రోల్



ఆ శంకరయ్య 'గాడి' జీవితం ఓ 'గాడి'న పడ్డట్టుంది.

- బి.వెంకటేశ్వరరావు, చందానగర్.

'రమా' ! ఇక్కణ్ణించి మీ వూరు 'రమారమి' ఎంత దూరం వుంటుంది!?

- హెప్సి & నిషి, కూకట్‌పల్లి.

ఆ 'తబలా' వాయించి మీ 'బలాబలాలు' తేల్చుకోండి

- బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి.



## చిలిపి లిపి



Enemy The = 8

- దేవరం సతీష్‌కుమార్, జగిత్యాల.

So low = సోలో

- బి. విశ్వజ, చందానగర్

R A E = ఆరేయి

- కె.మనోరమ, బెంగుళూరు.

## ఈ రూటే వేరు



మునివేళ్ళు = మునీశ్వరుని యొక్క వేళ్ళు

- ఎమ్. శ్రేష్ఠ, హైదరాబాద్.

చండా మార్కులవారు = ఛండాలంగా మార్కులు వేసేవారు - బి.వి.రావు, రుద్రారం.

మండోదరి = కడుపులో మండే అల్సర్ కలది

- బి.శ్రీనివాస్‌చారి, హైదరాబాద్.

# పేరడీ పేరేడ్

రావమ్మా! మహాతల్లీ -రావమ్మా!!
ఈ పార్లర్లో నీవు, కొలువైఉందువుగాని
కొలువైవుందువుగానీ -కులుకులా రాణి ॥రావమ్మా॥
జడక్రింద, మెడపైన -మసాజు చేసి
కన్నుల్ల చారికలు -మాయమ్మచేసి
తెల్లంగ మారిన -కురుల సంపదను
నల్లంగ మార్చేము- వేగా రావమ్మా ॥రావమ్మా॥
చిటికెడు బ్లీచు ముఖాన పూసి -బ్లీచింగో -బ్లీచింగు
మూరెడు దారం కనుబొమ్మలకు -త్రెడ్డింగో -త్రెడ్డింగు
బాదాము పాలతో -క్లీన్సింగో -క్లీన్సింగు
సన్‌సిల్కు షాంపుల్తో -వాషింగో -వాషింగు
పాలిచ్చే తల్లులకు -బొమ్మలు ఉచితం
పనిచేసే మహిళలకు - పర్సులు ఉచితం
ఉచితం ఓ అందం -అది ఆరని గంధం
శుష్కించే పడతులకు కలకాలం బంధం ...కలకాలం బంధం...!! ॥రావమ్మా॥
**('ఉండమ్మా బొట్టు పెడతా' చిత్రంలో "రావమ్మా...మహాలక్ష్మీ" పాటకు పేరడీగా...)**

-రాయచోటి కృష్ణమూర్తి, ముంబై




# చిలిపికవిత

చంద్ర గ్రహణం కంటె
సూర్య గ్రహణం కంటె
పవర్ ఫుల్ గ్రహణం
పాణి గ్రహణం

- బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి.



# పేరు -రిపేరు



ఈశ్వర్ - అమృత - మనసుతెలుసుకో

- విశ్వజ, రుద్రారం.

వీడెవడండీ బాబూ - అతడు - యమజాతకుడు

- బి.శ్రీరాం, రుద్రారం.

మన్మధుడు - నాన్నగారు - రాముడు కాదు కృష్ణుడు

- దేవులపల్లి రామమూర్తి, విజయనగరం.

# షార్ట్‌కట్స్



కడియం వెంకటప్ప = కప్ప
బాకూరు హనుమంతు = బాతు
బుడితి రామిరెడ్డి = బుడ్డి
జనపా లక్ష్మీగణపతి = జలగ

-బద్ది నాగేశ్వరరావు

కామెడీ సీరియల్ ప్రారంభం...

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం



ఇలపావులూరి మురళీమోహనరావు

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్ చదవడం నిషేధం. ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.

సాయంత్రం ఆరుగంటలకు ఆఫీసు నుంచి ఇంటికి వచ్చాడు వెంకట్రావు. రోజూ తను అలా రాగానే నవ్వుతూ ఎదురొస్తుంది సుందరి. ఈ రోజు అలా రాలేదు. దాంతో కొంచెం కంగారు పడ్డాడు వెంట్రావు. స్కూటర్ని బయటే నిలిపి హడావిడిగా లోపలికొచ్చాడు.

కాలింగ్ బెల్ స్విచ్ ఆన్ చేశాడు. సుందరి తలుపు తియ్యలేదు. మళ్ళీ మళ్ళీ నొక్కాడు.

"దగ్గరకే వేసుంది నెట్టండి" బలహీన స్వరంతో అన్నది సుందరి.

వెంకట్రావు గబగబ లోపలికొచ్చాడు. మంచం మీద నిస్త్రాణగా పడుకుని మూలుగుతున్నది సుందరి.

"అరె! వాటీజ్ దిస్? ఏమైంది? జ్వరమా?" మీద చెయ్యి వేశాడు వెంకట్రావు.

"కాదు"

"తలనొప్పా?"

"కాదు"

"జలుబా?"

"కాదు"

"మూడూనా?"

"అబ్బ. కాదండీ."

"మీ వాళ్ళెవరైనా పోయారా?"

"ఏం అలా అడుగుతున్నారు?"

"మా వాళ్ళెవరైనా పోతే ఇంత నీరసంగా మూలగవు గదా?"

"అదిగో... అదే.. ఆ పాడు మాటలే వద్దంటాను. మీ వాళ్ళు మా వాళ్ళు అనే వ్యత్యాసాలు మీకున్నాయేమో కానీ నాకు లేవు."

"ఓ.కె. అగ్రీడ్.. మరి ఈ విచారానికి కారణమేంటో?"

"హమ్మా..హబ్బా.. ఆ పాడు ఎలుకతో నా ప్రాణం పోయిందివాళ."

"ఎలుకా? ఏం ఎలుక?"

"ఎలుకంటే ఎలుకే..దున్నపోతులా ఉంది."




"ఎలుక దున్నపోతులా ఉండటం ఏంటి? ఎలుకెక్కడ? దున్నపోతెక్కడ?"

"హబ్బా..అదేలెండి. పోలికలు చెప్పడం చాతై ఛావడం లేదు. ఎలుకే..పెద్దగా పందికొక్కులా ఉంది"

"పిచ్చి సుందూ..చిలుకా గోరువంక వేరు వేరైనట్లు ఎలుక వేరు పందికొక్కు వేరు. ఒక దానికొకదానికి సంబంధం లేదు."

"అబ్బా..మీ హరికథతో నన్ను చంపేస్తున్నారు. ఎక్కడ్నుంచొచ్చిందో...మాయదారి ఎలుకొకటి ఇంట్లోకి దూరింది. దాన్ని కొడదామని దుడ్డు కర్ర తీసుకున్నాను. ఈ గదిలోంచి ఆ గదిలోకి పరిగెత్తి ఆ గదిలోంచి ఈ గదిలోకి పరిగెత్తి కాళ్ళు చచ్చుబడిపోయాయి. టీ పాయ్ మీదికెక్కింది. ఒక్క దెబ్బ వేశాను. అది తప్పించుకుంది. టీ పాయ్ మీది ఫ్లవర్‌వేజ్‌లు బద్దలయ్యాయి."

"మైగాడ్..మొన్ననే మూడొందల రూపాయలు పెట్టికొన్నాం. అదేనా?" కంగారుగా అన్నాడు వెంకట్రావు.

"అవును అవే. అక్కడి నుంచి బెడ్‌రూమ్‌లో దూరింది. అక్కడక్కడా కర్రతో తట్టాను. డ్రెస్సింగ్ టేబుల్ ఎక్కింది. గురి చూసి గట్టి దెబ్బ వేశాను. వెంట్రుక వాసిలో తప్పించుకుంది. అద్దం ముక్కలైంది."

"మైగాడ్..గత నెలలోనే రెండు వేలు పోసి కొన్నాం." తలబాదు కుంటూ అరిచాడు వెంకట్రావు.

"హౌను. ఆ సంగతి దానికేం తెలుసు? అక్కడి నుంచి వంటింట్లోకి దూరింది. అలమరెక్కింది. ధన్‌మని దెబ్బ వేశాను. దాని తోకకు కూడా తగల్లేదు. సీసాలు, జాడీలు అన్నీ పగిలి పోయాయి."

లబలబ మొత్తుకున్నాడు వెంకట్రావు.

"అయ్యయ్యయ్యో.. ఎంత పని జరిగింది? ఒక్క వెధవ ఎలుక వలన మనకింత ఆస్తి నష్టమా! నీకింత కష్టమా! ఉండు స్నానం చేసొచ్చి దాని పని



కలంసన్యాసం చేసి చేతులు ముడుచుకుని కూర్చున్న నాటి ప్రముఖ రచయితల చేత మళ్లీ కలం పట్టింపజేసిన పత్రిక 'హాసం' మాత్రమేనంటే అందరూ నాతో ఏకీభవిస్తారు.

ఇంత స్వల్ప వ్యవధిలో సామాన్య పాఠకులనే కాక మేధావులను సైతం ఇంతగా రంజింప చేసిన పత్రిక మరొకటి లేదంటే అతిశయోక్తి లేదేమో!

రచయితలను ప్రోత్సహించడంలో 'హాసం' తీసుకుంటున్న చొరవ, మంచి రచనలు ఎక్కడున్నా శిరసుపై ధరించాలన్న పట్టుదల 'హాసం' అద్భుత విజయానికి కారణాలని నా అభిప్రాయం.

ఈ నవలను జంధ్యాలగారి కోరిక మేరకు వ్రాశాను. అంతా చదివి టైటిల్‌ను కూడా వారే నిర్ణయించారు. ఇంటికి పిలిపించుకుని ఎంతసేపు మెచ్చుకున్నారో మాటల్లో చెప్పలేను. ప్రచురణ సమయానికి వారు లేకపోవడం నా వరకు పెనువిషాదం. ఈ నవలను వారి దివ్యస్మృతికి అంకితం గావిస్తున్నాను.

సుందరి పాత్రకు అనేక డైలాగుల నందించిన నా ఇంట్లోని 'ఆడ ఆదివిష్ణు' శారదకు శుభాశీస్సులు.

- ఇలపావులూరి మురళీమోహనరావు





'అత్యుత్తమ హాస్య రచనకు నిర్వచనం చెప్పండి' అని హాస్య బ్రహ్మనడిగాడొకాయన.
"పెళ్ళైన మగాళ్ళను కూడా నవ్వించగలిగేదే నా దృష్టిలో ఉత్కృష్ట హాస్యరచన" నవ్వుతూ బదులిచ్చారాయన.
మరంచేత పెళ్ళైన మగాళ్ళు కూడా ఈ సీరియల్ చదివి కాసేపు హాయిగా నవ్వుకుని వంట శ్రమ మర్చిపోండి.

పడతాను." అని బీరువా లోంచి లుంగీ, టవల్ తీసుకొని బాత్‌రూమ్‌లోకి దూరాడు.

స్నానం చేస్తూ కూడా ఎలుకను ఎలా పట్టాలా అని తీవ్రంగా ఆలోచించాడు. అరగంట సేపు ఆలోచించి ఆలోచించి బయటకు వచ్చాడు.

కర్ర తీసుకున్నాడు.

"ఊ..నా వంతయింది. ఆహ మీ ప్రతాపం చూపిస్తారా? జరిగిన నష్టం చాలదూ?" అన్నది సుందరి.

"అదిగో..ఆ వ్యంగ్యమే పనికి రాదు. ప్రతి ఆడదానికీ తన మొగుడు పెద్ద చవటని, పక్కింటాయన మహావీరుడని భావన. నన్ను తక్కువగా అంచనా వెయ్యకు." సీరియస్‌గా బదులిచ్చాడు వెంకట్రావు.

కర్రతో అక్కడక్కడా తట్టుతూ ఇల్లంతా తిరిగాడు. అటకల మీద పాత సామాన్లను అటు ఇటు దొర్లించాడు. మంచాలు తిరగేశాడు. ఫ్రిజ్, టీ.వి, వాషింగ్ మెషీన్‌లను స్థానభ్రంశం చేశాడు. బోర్లించిన బిందెలు, గిన్నెలు ఎత్తి చూశాడు. తూముల్లో కర్రదోపి ఆడించాడు. రాక్స్‌లోని పుస్తకాలన్నింటిని కిందపడేశాడు. ఎక్కడా ఎలుక కనిపించలేదు.

"అబ్బ.. అక్కడెందుకుంటుందండీ ఎలుక?" విసుగ్గా అన్నది సుందరి.

"బాగానే ఉంది. అదేమైనా కాకా? పిచ్చుకా? ఒక చోట గూడుకట్టుకుని స్థిరంగా ఉండటానికి! అది ఎలుక. దానికోసం మనం దాని కోసం వెతకాలి గానీ మన చేతిలో చావడానికి అది రాదు" అన్నాడు వెంకట్రావు.

"బాగానే ఉంది మీ ఎలుక వేట. అసలే నా ప్రాణం వేలికొసల్లో కొచ్చింది. ఇపుడు మీరు




చిందర వందర చేసిన సామాన్లు సర్దాలంటే ప్రాణాల మీద ఆశ వదులుకోవల్సిందే." కోపంగా అన్నది సుందరి.

"నీ కోసమే కదోయ్ నేనింత కష్టపడటం! నిన్నింత బాధపెట్టిన ఆ ముదనష్టపు మూషికాన్ని అంతం చేయందే నాకు నిద్రపడుతుందా? అయినా మనం ఇంతగోల చేస్తుంటే అది ఎక్కడ దాక్కున్నట్లు చెప్మా?"

"చెప్మా లేదు ఉప్మాలేదు. వెళ్ళి సోది అడిగి రండి."

"జోకులొద్దు. నా ఉద్దేశ్యంలో అది పారిపోయుంటుంది."

"ఆహాఁ..ఇంత పెద్ద పహిల్వాన్‌కు భయపడి. ఇక ఆపండి. రేపు చూద్దాంలే." అన్నది సుందరి.

* * *

ఆ రాత్రి పడుకున్నారన్నమాటే కానీ సరిగ్గా నిద్రపట్ట లేదు ఇద్దరికీ. విలువైన వస్తువులు పాడయ్యాయనే చింత వెంటాడుతూనే ఉన్నది.

అర్థరాత్రి దాటింది. అంతా నిశ్శబ్దం. నాలుగు సంవత్సరాల పాప అనూహ్య వళ్ళు మరిచి నిద్రపోతున్నది.

ఎక్కడో టక్ టక్‌మని చప్పుడు!

ఉలిక్కి పడ్డారిద్దరూ. చెవులు రిక్కించి విన్నారు. అదే శబ్దం. రిథమాటిగ్గా!

"ఏమండీ..ఏంటా శబ్దం? దూరాన దొంగలెవరో తలుపులు తెరవడానికి ప్రయత్నిస్తున్నట్లు లేదూ?" లోగొంతుకతో అన్నది సుందరి.

"మెల్లగా అంటావేంటి? అక్షరాలా అదే! మన పక్కింటి సుబ్బారావుగారింట్లో దొంగలు పడుతున్నారు. చచ్చాడుపో ముండాకొడుకు..." నవ్వు బిగబట్టుకుంటూ అన్నాడు వెంకట్రావు.

"అలా నవ్వుతారేంటి? ఇవాళ వాళ్ళింట్లో పడితే రేపు మనింట్లో పడతారు. వెంటనే ఏమైనా చెయ్యండీ." కోపంగా అన్నది సుందరి.

"ఏంటి చేసేది పకోడీలు? ఇదేమైనా సినిమానా తలుపుల పగలగొట్టుకుని నేరుగా దొంగల మీద ఎగిరి పడి విరగదన్నడానికి? నోర్మూసుకుని పడుకో. వాళ్ళను పట్టుకోడానికి పోలీసులున్నారు. గాడిద మొరిగితే నడుము విరుగుతుంది." పెదవుల మీద వేలుంచి అన్నాడు వెంకట్రావు.

"లైటు వెయ్యండి. దొంగలు పారిపోతారు."

"ఏడ్చినట్లుంది. అప్పుడు మనింటికొస్తారు. వెలుతురులో హాయిగా పనిచేసుకోవచ్చని."

"మీరేం మగాళ్ళండీ"

"చాల్లే అరవకు. పాప లేస్తుంది."

శబ్దం అలాగే వినిపిస్తున్నది. ఎవరో పరిగెత్తిన చప్పుడు. గాజులు పగిలిన శబ్దం!

ముచ్చెమటలు పోశాయి దంపతులకు.

"ముందీ గొలుసులు, గాజులు తీసి పాత గుడ్డల మూటలో కట్టి అటక మీద పారెయ్యండి. ఇవి గనుక ఒకసారి దొంగల పాలబడ్డాయంటే జన్మలో మళ్ళీదొరకవు." భయంగా అన్నది సుందరి.

"తొందరపడకు. దొంగలు రానీ. చూద్దాం." వారించాడు వెంకట్రావు.

"ఏంది చూసేది నా పిండాకూడు?



నవ్వితే తన ఎత్తు పళ్ళు బయటపడతాయని మీ పొరుగింటావిడ చచ్చినా నవ్వదు. ఆమె నవ్వితే ఎగతాళి చెయ్యాలని మీ ఆవిడ కోరిక.
ఆమె ఈ సీరియల్ చదువుతున్నపుడు రహస్యంగా తలుపు సందులోంచి చూడండి. మీ ఆవిడ కోరిక తీరుతుంది.



దొంగలొచ్చిన తరువాత వాళ్ళకు చూపిస్తూ తియ్యమంటారా ఏంటి?"

టకటక చప్పుడు ఆగిపోయింది.

"దొంగలు ఇంట్లోకి ప్రవేశించినట్లుంది. సుబ్బారావు భార్య మహాఘటికురాలు. దొంగలతో పెనుగులాడుతున్నట్లుంది. గాజులు పగిలిపోతున్నాయి."

"మరి ఏ విధమైన అరుపులు వినిపించడం లేదే?"

"పిచ్చిదానా వాళ్ళు స్వచ్ఛమైన" ఆరితేరిన దొంగలు. వృత్తిలో నిపుణులు. దొంగలు ఇంట్లోకి రాగానే ముందు ఇంటిల్లిపాది నోళ్ళలో గుడ్డలు కుక్కి అరవకుండా చేస్తారు. ఎదురు తిరిగితే ఇనుప రాడ్లతో తల పగలగొడతారు. అప్పటికీ ప్రతిఘటన ఎదురైతే చంపేస్తారు. ఇంట్లో వాళ్ళు ఎవరైనా పోలీసులకు ఫోన్ చేస్తారేమోనని ముందు గానే టెలిఫోన్ వైర్లు కట్ చేస్తారు.

"ఆపండి సోది. ఫోనంటే గుర్తొచ్చింది. మనింట్లో ఫోనుంది గదా. ముందు పోలీసులకు ఫోన్ చెయ్యండి"

"కరెక్ట్. మంచి అయిడియా ఇచ్చావు. బాధ్యత గల పౌరులుగా అది మన కర్తవ్యం." డయల్ చేస్తూ అన్నాడు వెంకట్రావు.

"హలో...పోలీసుస్టేషనేనాండి?"

"అవునండి"

"నిజంగా పోలీసుస్టేషనేనాండి"

"అవును బే. ఎవర్నువ్వు?"

"ఆ..ఆ..ఇపుడు నమ్మకం కలిగిందిలెండి. సర్కిల్‌గారున్నారా?"

"ఆయన నైట్ క్లబ్బుకెళ్ళారు."

"నైట్ క్లబ్బుకా...దేనికి?"

"రైడింగ్‌కులే....ఇంతకూ ఎవర్నువ్వు?"

"యస్సైగారున్నారా?"

"ఆయన బారుకెళ్ళారు"

"బార్‌కా... దేనికి?"

"రైడింగుకులే...ఇంతకూ ఏంకావాలి?"

"పోనీ...ఏయస్సైగారున్నారా?"

"ఆయన బ్రోతల్ హౌసుకెళ్ళారు."

"హెడ్డుగారున్నారా?"

"ఆయన పేకాట క్లబ్బుకెళ్ళారు. రైడింగ్‌కేలే... ఇన్ని వివరాలు అడుగుతున్నావు. ఇంతకూ నువ్వు.. మీరు...చెకింగ్ చెయ్యడానికి కంట్రోల్‌రూమ్ నుండి..."

"కంట్రోల్‌రూమ్‌లో వాళ్ళు మాత్రం ఏ బార్లకో, క్లబ్బులకో పోకుండా ఉంటారా? అదేంకాదు. నేను సౌభాగ్యపురం రెండో వీధి నుంచి వెం..వెం..




వెంగళ్రావును మాట్లాడుతున్నాను. మా పక్కింట్లో దొంగలు పడ్డారు. తలలు పగిలి పోతున్నాయి. మానభంగాలు జరుగుతున్నాయి. మీరు వెంటనే రావాలి" చెప్పి ఫోన్ పెట్టేశాడు వెంకట్రావు.

"అదేంటండీ..పేరు మార్చి చెప్పారేంటి?" ఆశ్చర్యంగా అడిగింది సుందరి.

"పోలీసులతో అలాగే చెప్పాలి. నిజం చెప్పామంటే రేపట్నుంచి లక్షసార్లు మనలను స్టేషన్ చుట్టూ తిప్పుతారు" నవ్వుతూ చెప్పాడు వెంకట్రావు.

"ఒక్కోసారి మీ బుర్ర భలే పనిచేస్తుందండీ." మెచ్చుకోలుగా అన్నది సుందరి.

మళ్లీ గలగల వస్తువులు కదిలిన చప్పుడు వినిపించింది. దంపతుల గుండెలు ఆగినంత పనైంది.

"అసలీ రాజేశ్వరికి బుద్ధిలేదు. వాళ్ళు అడిగినవి నోరు మూసుకుని ఇవ్వక ఘర్షణ దేనికి? ప్రాణాలకంటే ఎక్కువా?" అన్నది సుందరి.

"సొమ్మంటే ఎవరికైనా ఆపేక్షే కదా. అందులో ఆడవాళ్ళకు ప్రాణాలకంటె నగలమీదే ఆశ ఎక్కువ. ఇంతకూ ఈ పోలీసులేమయ్యారు?" చిరాగ్గా అన్నాడు వెంకట్రావు. కాలుగాలిన పిల్లిలా అటు ఇటు తిరుగుతున్నాడు.

"మరోసారి ఫోన్ చెయ్యండి. ఊరికే తిరుగుతారేం?"

"మళ్ళీనా...ఈసారి మన అడ్రసు అడుగుతాడేమో!"

"అడిగితే చెప్పండి. భయమెందుకు? మనమేమైనా దొంగలమా?"

"పిచ్చిదానా పోలీసుల్ని చూస్తే దొంగలు అసలు భయపడరు. మనకే భయం. సవాలక్ష ప్రశ్నలతో మనలను విసిగిస్తారు."

"అవన్నీ పాతరోజులు. ఇప్పుడు పోలీసులు కూడా బాగా చదువుకున్న వాళ్ళే ఉంటున్నారు. మాట్లాడకుండా చెయ్యండి."

వెంకట్రావు మళ్ళీ రింగ్ చేశాడు.

"నేనండీ వెంగళ్రావును. ఇంతవరకూ ఎవరూ రాలేదు. సర్కిల్‌గారున్నారా?"

"లేరండీ...ఆయనకు ట్రాన్స్‌ఫరైంది. రిలీవై



"ఏంటిరా అంత సీరియస్‌గా చదువుతున్నావు? ఏదైనా డిటెక్టివ్ సస్పెన్స్ నవలా?" అడిగాడు రాజు. "కాదు. ఏదో కామెడీ కథట" ముఖం ముటముట లాడిస్తూ చెప్పాడు సురేష్.
ఇది ఆహ్లాదకరమైన కామెడీ కాకపోతే నూరు సంవత్సరాల క్రితం చనిపోయిన రచయిత ముత్తాత మీదొట్టు!
(తరువాత ఏదొక జన్మ ఎత్తకుండా ఉంటాడా?)

వెళ్ళారు."

"ట్రాన్స్‌ఫరా...ఇందాక రైడింగ్ కెళ్ళారన్నారుగా?"

"అవునండీ. రైడింగ్‌కెళ్ళి ఇద్దరు క్యాబర్ డాన్సర్లను పట్టుకున్నార్ట. వాళ్ళను అరెస్టు చేసి తెస్తుండగా ఎవరో మంత్రిగారి నుండి వదలమని ఫోనొచ్చిందిట, వీల్లేదన్నారట సర్కిల్‌గారు. అందుకని ఆయనను ఫోన్ ఆర్డర్‌వేసి ట్రాన్స్‌ఫర్ చేశారు."

"మైగాడ్...ఇప్పుడెలా? మరి యస్సైగారు?..."

"ఇంకా రాలేదు సార్...బార్ల మీద రైడింగ్ అంత తొందరగా అవుతుందా? రాగానే చెబుతాను."

"అయ్యగారొచ్చేదాకా అమావాస్య ఆగుతుందాండీ. మీరొచ్చేలోపల దొంగలు పారిపోరూ?"

"ఎక్కడికి పోతారండీ... ఈ ప్రపంచంలో దొంగ వెధవలు ఏ మూలదాక్కున్నా పట్టుకోగలం."

"ఓరి నీ అసాధ్యం కూలా..కళ్ళముందున్న దొంగలను పట్టుకోకుండా ఎక్కడో దాక్కున్న తర్వాత పట్టుకుంటామంటారేంటి?"

"అబ్బబ్బ...ఎవరివయా నీవు ఊరికే సతాయిస్తున్నావు? నువ్వు అరిచి గీ పెట్టినా ఉపయోగంలేదు. యస్సైగారు రాగానే పంపిస్తాం. ఇక పెట్టెయ్"

నిట్టూరుస్తూ ఫోన్ పెట్టాడు వెంకట్రావు.

"ఏంటి వాడితో కాలక్షేపపు మాటలు? ఇంతకూ ఏమైంది?" విసుక్కుంది సుందరి.

"స్టేషన్లో ఎవరూ లేరట. రాగానే పంపిస్తామన్నారు" చెప్పాడు వెంకట్రావు.

"ఏ విషయమూ సూటిగా చెప్పడం రాదు కదా."




"నువ్వు మాట్లాడితే తెలిసేది"

"ఐదు నిముషాలు చూస్తా. ఎవరూ రాకపోతే ఛడామడా వాయిస్తా"

దూరాన సైరన్ వినిపించింది.

"హమ్మయ్య...ఇక భయంలేదు. పోలీసులొచ్చారు" అన్నాడు వెంకట్రావు.

వీధిలో సందడి మొదలైంది. అన్ని ఇళ్ళలో లైట్లు వెలిగాయి. కలుగుల్లోంచి ఎలుకలొచ్చినట్లు అందరూ బయటకొచ్చారు.

"ఎక్కడ? ఎక్కడ? దొంగలెక్కడ?" లాఠీ ఊపుతూ అడిగాడు యస్సై.

అందరూ అయోమయంగా చూస్తున్నారు.

"నేను సింహాన్ని. మృగరాజును. శత్రువులకు సింహస్వప్నాన్ని. దొంగలను, హంతకులను వేటాడతాను. పుట్టలో దాక్కున్నా జుట్టుబట్టి బయటకులాగి నల్లిని నలిపినట్లు నలుపుతాను. నా పేరు వింటే రౌడీలు నిద్రపోరు. నా బూటుకాలి శబ్దం వింటే గూండాలు పిక్కబలం చూపిసారు. చెప్పండి. దొంగలెక్కడ? ఎవరింట్లో పడ్డారు. ఎవరి బుర్రలు పగలగొట్టారు? ఎవరిని మానభంగాలు చేశారు? చెప్పండి.." జనాన్ని చూస్తూ గర్జించ సాగాడు.

యస్సై మాటలు వింటుంటే అందరికీ భయమేసింది. ఎవరి గొంతూ పెగల్లేదు.

"ఎవరూ మాట్లాడరేం? దొంగలకు సహకరించడం నేరం. తెలిసీ ఆచూకీ చెప్పక పోవడం సెక్షన్..సెక్షన్.."

"టు నాట్ ఫోర్ సార్.." అందించాడో పోలీసు. అతని వైపు గుర్రుగా చూశాడు యస్సై.

"ఐనో..సెక్షన్ టూనాట్ ఫోర్ కింద అఫెన్స్. మీరు భయపడవద్దు. నేను ఇంట్లో నిద్రపోను. నేరస్తుల గుండెల్లో నిద్రపోతాను. భయపడకండి. ఎక్కడ దొంగలు...ప్లీజ్...చెప్పండి."ప్రాధేయ పూర్వకంగా అన్నాడు సింహం.

కొంతమందికి ధైర్యం వచ్చింది.

"అయ్యా..యస్సైగారూ..మీరనేదేంటో మాకు అర్థం కావడంలేదు. దొంగలేంటి? వాళ్ళ ఆచూకీలు ఏంటి? మీరనేది మాకేమీ తెలియడం లేదు." అన్నాడు ఒక పెద్దాయన.

"వాట్! దొంగలు..ఏంటా?...వాళ్ళ ఆచూకీలు ఏంటా?...భలే..వేరీస్ట్రేంజ్...హ..హ..హ.. ఏవయ్యో పెద్దాయనా! ఎలా కనిపిస్తున్నాను? నీలాగా రిటైరై గోళ్ళు గిల్లుకుంటూ కూర్చునే యదవనా కొడుకులా ఉన్నానా? నేను సింహాన్ని...జాగ్రత్త! ఎక్కడ దొంగలు?..." కోపంగా అన్నాడు యస్సై.

యస్సై కోపం చూసి అందరూ అదిరిపోయారు. వెంకట్రావు ముందుకు రాబోయాడు. భర్త నడుము మీద గిల్లింది సుందరి.

"నోరుమూసుకోండి. మీరే ఫోన్ చేశారని దొంగలకు తెలిస్తే రేపు వాళ్ళు మనలను చంపేస్తారు" మెల్లగా అన్నది.

వెంకట్రావు ఆగిపోయాడు.

యస్సై గుడ్లురుముతూ అందరినీ పరీక్షగా చూడసాగాడు.

(ఇంకా వుంది)



| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 86. | శ్రీమతి ఏమన్న శ్రీవారు తందాన | అక్కాచెల్లెలు | 1970 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల, సుశీల |
| 87. | చకచకలాడే | అక్కాచెల్లెలు | 1970 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | సుశీల |
| 88. | పాండవులు పాండవులు | అక్కాచెల్లెలు | 1970 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | సుశీల |
| 89. | ఇది మతికి మనసుకి పోరాటం | అక్కాచెల్లెలు | 1970 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల |
| 90. | సంతోషం చేసుకుందాం నాతో | అక్కాచెల్లెలు | 1970 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | సుశీల |
| 91. | చిటపట చినుకులతో కురిసింది | అక్కాచెల్లెలు | 1970 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల, సుశీల |
| 92. | ఓ పిల్లా ఘట ఘట లాడిస్తా | అక్కాచెల్లెలు | 1970 | కె.వి.మహదేవన్ | కొసరాజు | ఘంటసాల, సుశీల |
| 93. | లేత కొబ్బరి నీళ్లల్లో | అల్లుడొచ్చాడు | 1976 | టి. చలపతిరావు | ఆత్రేయ | ఎస్.పి.బాలు, సుశీల |
| 94. | మా తెలుగు తల్లికి మల్లెపూదండ | అల్లుడొచ్చాడు | 1976 | టి. చలపతిరావు | శంకరంబాడి సుందరాచార్యులు | సుశీల |
| 95. | కొడితే పులినే కొట్టాలి | అల్లుడొచ్చాడు | 1976 | టి. చలపతిరావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 96. | వేళాపాలా ఉండాలమ్మ దేనికైనా | అల్లుడొచ్చాడు | 1976 | టి. చలపతిరావు | ఆత్రేయ | ఎస్.పి.బాలు |
| 97. | ఉరుకుల పరుగుల ప్రాయం | అల్లుడొచ్చాడు | 1976 | టి. చలపతిరావు | ఆత్రేయ | ఎస్.పి.బాలు, సుశీల |
| 98. | ఎలా చెప్పేదెలా చెప్పేది | అల్లుడొచ్చాడు | 1976 | టి. చలపతిరావు | కొసరాజు | సుశీల |
| 99. | అంతే నీకు చాలు | అల్లుడొచ్చాడు | 1976 | టి. చలపతిరావు | దాశరథి | సుశీల |
| 100. | నీవే రథసారథివై | అమర దీపం | 1977 | సత్యం | ఆత్రేయ | సుశీల |
| 101 | నీవే తల్లియు తండ్రియు | అమర దీపం | 1977 | సత్యం | ఆత్రేయ | సుశీల |
| 102 | అంతలేసి అందాలు దాచుకున్న | అమర దీపం | 1977 | సత్యం | ఆరుద్ర | రామకృష్ణ, రమోలా |
| 103 | నా జీవన సంధ్యా సమయంలో | అమర దీపం | 1977 | సత్యం | వేటూరి | రామకృష్ణ, సుశీల |
| 104 | కొత్తగా వుందా బాధగా వుందా | అమర దీపం | 1977 | సత్యం | ఆత్రేయ | సుశీల |
| 105 | ఇంతే ఈ జీవితం | అమర దీపం | 1977 | సత్యం | ఆత్రేయ | రామకృష్ణ |
| 106 | ఎవడి దీపమటుల | అమర దీపం | 1977 | సత్యం | ఆత్రేయ | సుశీల |
| 107 | ఆమెతోటి మాటుంది | అమెరికా అమ్మాయి | 1976 | జి.కె.వెంకటేష్ | గోపి | ఎస్.పి.బాలు |
| 108 | జిలిబిలి పిలిచెను గోరింక | అమెరికా అమ్మాయి | 1976 | జి.కె.వెంకటేష్ | ఆరుద్ర | ఎస్.పి.బాలు, వాణి జయరాం |
| 109 | టెల్‌మి టెల్‌మి | అమెరికా అమ్మాయి | 1976 | జి.కె.వెంకటేష్ | ఆరుద్ర | ఎస్.పి.బాలు |
| 110 | ఒక వేణువు వినిపించెను | అమెరికా అమ్మాయి | 1976 | జి.కె.వెంకటేష్ | గోపి | జి. ఆనంద్ |
| 111 | డార్లింగ్ అంటే ప్రియుడు | అమెరికా అమ్మాయి | 1976 | జి.కె.వెంకటేష్ | - | రమేష్, వసంత |
| 112 | ఆనంద తాండవమాడే | అమెరికా అమ్మాయి | 1976 | జి.కె.వెంకటేష్ | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 113 | పాడనా తెలుగు పాట | అమెరికా అమ్మాయి | 1976 | జి.కె.వెంకటేష్ | దేవులపల్లి కృష్ణశాస్త్రి | సుశీల |
| 114 | రేపు వత్తువుగాని | అమ్మకోసం | 1970 | ఆదినారాయణరావు | ఆరుద్ర | సుశీల |
| 115 | గువ్వలా ఎగిరిపోవాలి | అమ్మకోసం | 1970 | ఆదినారాయణరావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు |
| 116 | పొంచిన వంచన కాటువేసెనా | అమ్మకోసం | 1970 | ఆదినారాయణరావు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల |
| 117 | ఈ లోయలోన | అమ్మకోసం | 1970 | ఆదినారాయణరావు | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 118 | అదే అదే పదే పదే | అమ్మకోసం | 1970 | ఆదినారాయణరావు | సి.నారాయణరెడ్డి | పి.బి.శ్రీనివాస్, ఎస్.జానకి |
| 119 | పాపి కొండల కాడ | అమ్మకోసం | 1970 | ఆదినారాయణరావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 120 | అందాల వలపు జంట | అమ్మకోసం | 1970 | ఆదినారాయణరావు | ఆరుద్ర | ఎస్.పి.బాలు, సుశీల |
| 121 | ఎదురుచూచె నయనాలు | ఆనంద నిలయం | 1971 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 122 | గూటిలోని పిల్లకి | ఆనంద నిలయం | 1971 | పెండ్యాల | కె.జి.ఆర్.శర్మ | సుశీల |
| 123 | ఈ కన్నె గులాబి | ఆనంద నిలయం | 1971 | పెండ్యాల | దాశరథి | ఎస్.జానకి, పి.బి.శ్రీనివాస్ |

( P.T.O. )

# తెలుగు సినీ గీత కోశం

| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 124 | రానీ రానీ మైకం రానీ | ఆనంద నిలయం | 1971 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | ఎల్.ఆర్.ఈశ్వరి, మాధవపెద్ది, పిఠాపురం |
| 125 | పదిమందిలో పాట పాడినా | ఆనంద నిలయం | 1971 | పెండ్యాల | ఆరుద్ర | ఘంటసాల |
| 126 | పలుకే బంగారమాయెరా | అందాల రాముడు | 1973 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | బాలమురళీకృష్ణ |
| 127 | ఎదగడానికెందుకురా | అందాల రాముడు | 1973 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | రామకృష్ణ |
| 128 | అబ్బోసి చిన్నమ్మ | అందాల రాముడు | 1973 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | సుశీల, రామకృష్ణ |
| 129 | మా తల్లి గోదారి చూపంగా దారి | అందాల రాముడు | 1973 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | రామకృష్ణ, రాఘవులు |
| 130 | చాకిరేవు బాన ఏమంది | అందాల రాముడు | 1973 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | రామకృష్ణ, రాఘవులు, విజయలక్ష్మి, కన్నారావు |
| 131 | రాముడేమన్నాడోయ్ | అందాల రాముడు | 1973 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | రామకృష్ణ |
| 132 | భజన చేసే విధం తెలియండీ | అందాల రాముడు | 1973 | కె.వి.మహదేవన్ | కొసరాజు | రామకృష్ణ, విజయలక్ష్మి, కన్నారావు |
| 133 | కురిసే వెన్నెల్లో మెరిసే గోదారిలా | అందాల రాముడు | 1973 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | రామకృష్ణ, సుశీల |
| 134 | మము బ్రోవమని చెప్పవే | అందాల రాముడు | 1973 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | రామకృష్ణ |
| 135 | సమూహ భోజనమ్ము | అందాల రాముడు | 1973 | కె.వి.మహదేవన్ | కొసరాజు | రామకృష్ణ, బృందం |
| 136 | అదిగో భద్రాద్రి | అందాల రాముడు | 1973 | కె.వి.మహదేవన్ | రామదాసు, | రామకృష్ణ, బృందం |
| 137 | వామాంక స్థిత జానకి | అందాల రాముడు | 1973 | కె.వి.మహదేవన్ | శ్లోకం | బాలమురళీకృష్ణ |
| 138 | ఇదే ఇదే నేను కోరుకుంది | అందమే ఆనందం | 1977 | సత్యం | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 139 | ఈ అందం ఈ బంధం ఉంటేనే | అందమే ఆనందం | 1977 | సత్యం | దాశరథి | ఎస్.జానకి |
| 140 | మధుమాస వేళలో | అందమే ఆనందం | 1977 | సత్యం | దాశరథి | ఎస్.పి.బాలు |
| 141 | ప్రమదల కూడి (పద్యం) | అందమే ఆనందం | 1977 | సత్యం | ముత్తరాజు సుబ్బారావు | ఎస్.పి.బాలు |
| 142 | మన్నించండి దొరగారు | అందరూ బాగుండాలి | 1976 | మాస్టర్ వేణు | ఆత్రేయ | ఎస్.పి.బాలు, సుశీల |
| 143 | తుళ్లి తుళ్లి పడుతోంది హృదయం | అందరూ బాగుండాలి | 1976 | మాస్టర్ వేణు | | ఎస్.పి.బాలు, సుశీల, ఎల్.ఆర్.ఈశ్వరి, రామకృష్ణ, వసంతమూర్తి |
| 144 | దైవం ఉన్నా లేకున్నా | అందరూ బాగుండాలి | 1976 | మాస్టర్ వేణు | ఆత్రేయ | ఎస్.పి.బాలు, రామకృష్ణ, వసంత |
| 145 | వింత వసంతం వచ్చింది | అందరూ బాగుండాలి | 1976 | మాస్టర్ వేణు | దాశరథి | సుశీల |
| 146 | జగమేమాయ బ్రతుకే మాయ | అందరూ బాగుండాలి | 1976 | మాస్టర్ వేణు | ఆత్రేయ | ఎస్.పి.బాలు, రామకృష్ణ |
| 147 | ఓ రత్తమ్మో రత్తమ్మో | అన్నపూర్ణ | 1960 | ఎస్.దక్షిణామూర్తి | ఆరుద్ర | పిఠాపురం, స్వర్ణలత |
| 148 | ఒకరు చేసిన నేరానికి | అన్నపూర్ణ | 1960 | ఎస్.దక్షిణామూర్తి | ఆరుద్ర | ఘంటసాల |
| 149 | కులాసా రాదోయ్ రమ్మంటే | అన్నపూర్ణ | 1960 | ఎస్.దక్షిణామూర్తి | ఆరుద్ర | జిక్కి |
| 150 | వగలాడి వయ్యారం భలే జోరు | అన్నపూర్ణ | 1960 | ఎస్.దక్షిణామూర్తి | ఆరుద్ర | ఘంటసాల, జిక్కి |
| 151 | గాలివాన కురిపించే వానదేవుడా | అన్నపూర్ణ | 1960 | ఎస్.దక్షిణామూర్తి | ఆరుద్ర | సుశీల & కోరస్ |
| 152 | తళ తళా మిలా మిలా | అన్నపూర్ణ | 1960 | ఎస్.దక్షిణామూర్తి | ఆరుద్ర | సుశీల |
| 154 | మనసేమిటో తెలిసిందిలే | అన్నపూర్ణ | 1960 | ఎస్.దక్షిణామూర్తి | ఆరుద్ర | పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 155 | ఎంతో చక్కని చల్లని సీమ | అన్నపూర్ణ | 1960 | ఎస్.దక్షిణామూర్తి | ఆరుద్ర | పిఠాపురం, జమునారాణి |
| 156 | నీ పూజ చేసేము తల్లీ | అన్నపూర్ణ | 1960 | ఎస్.దక్షిణామూర్తి | ఆరుద్ర | సుశీల |
| 157 | నిను వీడని నీడను నేనే | అంతస్తులు | 1965 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | సుశీల |
| 158 | నువ్వంటే నాకెందుకో యింత యిది | అంతస్తులు | 1965 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల, సుశీల |
| 159 | తెల్ల చీరకట్టుకున్నదెవరి కోసం | అంతస్తులు | 1965 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల, సుశీల |
| 160 | వినరా విస్సన్న | అంతస్తులు | 1965 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | పి.భానుమతి |
| 161 | దులపర బుల్లోడా | అంతస్తులు | 1965 | కె.వి.మహదేవన్ | కొసరాజు | పి.భానుమతి, బృందం |
| 162 | ఆ దేముడు మనిషిగ పుట్టాలిరా | అంతస్తులు | 1965 | కె.వి.మహదేవన్ | కొసరాజు | పిఠాపురం, మాధవపెద్ది |
| 163 | పైకంతో కొనలేనిది | అంతస్తులు | 1965 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |

సేకరణ:
పున్నమరాజు శేషగిరిరావు, విశాఖపట్నం

వచ్చే సంచికలో మరికొన్ని

అలనాటి ఆణిముత్యాల గురించి
నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే




# నవ్వుటద్దాలు

## అక్షరాలతో అద్భుతాలు

- ఆచార్య తిరుమల

సంస్కృతాంధ్ర కవులు మాటలతోనే కాదు అక్షరాలతో కూడా ఆటలాడుకున్నారు. పద్యాలతో పరమాద్భుతమైన విన్యాసాలు చేశారు. ఒక పద్యంలో మరో పద్యం, ఆ పద్యంలో మరో పద్యం ఇమిడ్చి రాసే 'గర్భ' కవిత్వాలూ, ఎటు చదివినా ఒకేలా వుండే అనులోమ విలోమ పద్యాలు, నాగబంధం, ఖడ్గబంధం లాంటి 'బంధ' కవిత్వాలు, సర్వ లఘు పద్యాలూ- ఒకటేమిటి? ఎన్నెన్నో వింతలూ, విడ్డూరాలూ చేశారు.

బమ్మెర పోతన- భాగవతం గజేంద్ర మోక్షం కథలో

**అడిగెద నని కడువడి జను**
**నడిగిన దను మగడ నుడుగుడని నెడ నుడుగున్**
**వెడవెడ చిడిముడి తడబడ**
**నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్!!**

అని వృత్త్యను ప్రాసాలంకారంతో సర్వ లఘు కందం రాసి, లక్ష్మీదేవి యొక్క గుం'డె' ద'డ'కి అక్షర రూప కల్పన చేశాడు. ఒకే హల్లు పలుమారులు ఆవృత్తి అవ్వటం వృత్త్యనుప్రాసాలంకారం. అసలు, ఒక హల్లుతోనే వాక్యాలూ, పద్యాలు వుండటం చూస్తే- ఆశ్చర్యం వేస్తుంది. చూడండి: "కా కీ కే కా కి కి కో క కా క కే కి కా?" - కాకి ఈక - కాకికి - కోక కాక- కేకికా (నెమలికా)? అని దీని అర్థం. అలాగే 'న' గుణితంతో చూడండి:

**నానా నన నా నున్న న**
**నూనను నిన్ననెను నేను నున్ను ని నిననై**
**నానీ నను నానా నను**
**నానూన యనంగ నొంటి యక్షరమయ్యెన్!!**




అని లక్షణకారుడు చెబితే- మరో మాటకారి- నూనె(ఆయిల్) అనే మాటతో- నా నూనె నీ నూనా? నీ నూనె నా నూనా? నా నూనె నీ నూనని నే నన్నానా? అని గిలిగింతలు పెట్టాడు. నేనోసారి నా మిత్రునితో మహా గాయకుడు మన్నాడే ని గూర్చి ముచ్చటిద్దామని "మన్నాడే"అనేసరికి ఆయనగారు వెంటనే- "ఏ మన్నాడే? ఆ మన్నాడే రమ్మన్నాడే-" అని అడ్డుపడి నవ్వేశాడు.

శ్రీ శ్రీ - 'న'అనే అక్షరాన్ని 'ఞ' అనీ, 'గ' అనే అక్షరాన్ని 'ఙ' అనీ యెందుకు రాయకూడదని అడుగుతూ- మ. న. స- అనే మూడక్షరాలతో త్ర్యక్షర కందం అందించాడు చూడండి:

**మనసాని నిసిని సేమా**
**మనసా మసి మనిసి మనసు మాసిన సీనా**
**సినిమా నస మాసనమా**
**సినిమా నిసి సీమ సాని సిరిసిరి మువ్వా!!**

ఈ పద్యంలో శ్రీ శ్రీ మహాకవిగా కంటే 'సినిమా' కవిగానే బాగా కనిపిస్తాడు.

ఒక అజ్ఞాత కవి ఎవరో-

**మా పని నీ పని గాదా**
**పాపమ మా పాపగారి పని నీ పనిగా**
**నీ పని దాపని పని గద**
**పాపని పని మాని-దాని పనిగానిమ్మా!!**

అంటూ సప్త స్వరాలతో కంద పద్యాన్ని పని గట్టుకుని చెప్పి రసజ్ఞుల మెప్పులందుకున్నాడు.

ఎటునుండి చదివినా ఒకేలా వుండడమే కాకుండా అర్థభేదంతో వుండే

అనులోమ, విలోమ పద్యాలు మరీ అద్భుతంగా వుంటాయి. ఈ క్రింది అనులోమ పద్యాన్ని చివరి నుండి మొదటి వరకు చదివితే వేరే అర్థం వస్తుంది. చూడండి:

**దామోదర సామ తనధ**
**రామా సరసాకర దశరథ హరి రాధా**
**కామా సదయాతి పరమ**
**ధామా వర యాదవకుల దారక రాసా!!**

ఈ పద్యాన్ని చివరి నుండి

**సారాకర దాల కువద**
**యారవ మాధామ రపతి యాదస మాకా**
**ధారా రిహా ధర శదరక**
**సారస మారా ధన తమసారద మోదా!!**

అని చదివితే వేరే అర్థం వస్తుంది.

పాదభ్రమకం పద్యంలో ప్రతి పాదాన్ని ముందు నుండి వెనక్కి, వెనక నుండి ముందుకి చదువవచ్చును చూడండి:

**ధీర శయనీయ శరధీ**
**మార విభాను మత మమత మను భావి రమా**
**సారస వన నవ సరసా**
**దారద సమతార తార తామస దరదా!!**

ఇంక పద్య భ్రమకంలో ఏ పాదాని కా పాదం కాకుండా మొత్తం పద్యాన్నే చివరి నుండి మొదటికి చదవచ్చు. ఎటునుండి యెటు చదివినా ఒకేలా వుంటుంది. చూడండి :

**రాధా నాధా తరళిత**
**సాధక రధ తా వరసుత సరస నిధానా**
**నాధాని సరసత సురవ**
**తాధర కధ సా తళిరత ధానా ధారా!!**

ఇటువంటివి కవులు చేసే గారడీలని, కసరత్తులని, సర్కసులని, కవిత్వముండదని కొందరంటారు గానీ వీటిలో అర్థం ఉంటుందని, కవి యొక్క అపార శబ్ద బ్రహ్మోపాసన ఉంటుందని గ్రహించడం మంచిది. అసమర్థులకి అల్లరి, విమర్శలు చేయటం ఎక్కువే కదా! కాబట్టి వారిని పట్టించుకోపోవటం బుద్ధిమంతుల లక్షణం.

చిత్ర కవిత్వాల్లో ఆరితేరిన గణపవరపు వేంకట కవి ప్రతి పద్యంలోనూ ఏదో ఒక చిత్రం ఉండేలా 883 పద్యాలతో "వెంకటేశ్వర విజయ విలాసం" అనే ప్రబంధం రాశాడు. ఆ కావ్యంలోని 808 పద్యంలో 64 రకాల విచిత్రాలున్నాయని పరిశోధకులు తేల్చి చెప్పారు. ఆ పద్యం చూడండి:-

**సారాగ్ర్య సారస సమనేత్ర యుగళ నా**
**రద రుచి కాంతి నరఘున వనిత**
**సారాగధీర విశదవీన తురగ భై**
**రవ భవ జైత్ర భర శుభ కరణ**
**సారతిహార విసర చారణ హరి సా**
**రసహిత చంద్ర శరజ జయనుత**
**వారాశి నారద వర పూజిత పద గౌ**
**రవ కటి ఖడ్గ గరళగళ సఖ**
**హరి నగ నిలయ గిరిధర యసుర దళన**
**మణిమయ మకుట సురమణి మధుర విశరణ**
**కరి వరద కువర రుచిరత రవ సవన**
**రహరి లసిత దర నిగమ విహరణ హరి!!**

ఈ పద్యాన్ని గూర్చి ఈ పద్యంలో 41 గర్భ కవిత్వాలు, 20 దాకా బంధ కవిత్వాలు అనులోమ, విలోమ పద్యాలు మూడు ఉన్నాయని మా మిత్రులు డా. ద్వా.నా.శాస్త్రి గారు తమ 'సాహిత్య కబుర్లు' గ్రంథంలో తెలియజేశారు. వాటి వివరాలు తెలుసుకోవటం వేరే పరిశోధనతో కూడిన విషయం.

పింగళి వెంకట కృష్ణారావు కవి గారు ఒక సభలో తెనాలి రామకృష్ణునికి వికట కవిత్వమెలా వచ్చిందో చమత్కారంగా 'క' భాషలో చెప్పారు. చూడండి:

**తే॥గీ॥ కవి కక కట కక కవి కగ కన కను క**
**దీ కన కలి కడి కకా కళి కక**
**కజ కన కని కవో కలె కక కని కక**
**కర కము కన కజూ కచి కన కపు కడె!!**

ఈ పద్యంలో 'క'లు తీసివేస్తే-"వికట కవిగ నను దీవన లిడి కాళిక జనని వోలె కనికరమున జూచి నపుడె" అనే వాక్యం వస్తుంది.

అల్లంరాజు రంగశాయి అనే కవి 'మ' గుణింతం తో ఓ అందమైన కంద పద్యం చెప్పాడు.

**మామా మిమో మామా**
**మామా! మి మ్మొమ్ము మామ మామా మేమా**
**మే మొమ్మము మీ మై మే**
**మేమే మమ్మోము మోము మిమ్మా మామా!!**

ఈ పద్యానికి ప్రతి పదార్థమిలా చూడాలి:- మా=చంద్రుని, మా=శోభ, మోమౌ=ముఖముగాగల, మామా= మా మాయొక్క,

మా=మేధ, మిమ్ము, ఒమ్ము=అనుకూలించును, మామ మామా= మామకు మామా, ఆము=గర్వమును, ఏమి+ఒమ్మము=ఏమీ ఒప్పుకోము, మీమై= మీ శరీరము, మేము ఏమే= మేము మేమే, మమ్ము, ఓముము+ఓముము=కాపాడుము, కాపాడుము, ఇమ్ము+ఔము= అనుకూలమగుమా.

చంద్రుని వంటి ముఖముగల దేవా! మా బుద్ధి మీకు అనుకూలించును. గర్వపడక నిన్ను మేము అంగీకరింతుము. సశరీరివై మాకు అనుకూలముగా నుండి మమ్ము కాపాడుమని అర్థం. ఏకాక్షర నిఘంటువులు చూసిస్తే గానీ యిటువంటి పద్యాలు అర్థం కావు. గానీ చదువుతుంటే సరదాగా వుంటాయి.

ఇలాగే సంస్కృతంలో ఉన్న ఏకాక్షర శ్లోకాన్ని పరిచయం చేస్తాను. చూడండి:

**రరో రరే రర రురో రురూ రూరు రురో రరే**
**రేరే రీరా రార రరే రారే రారి రిరా రిరా!!**

ఈ శ్లోకానికి అర్థం చూడండి: ర=రామ శబ్దంలో 'ర' రేఫవలన, రోః =భయం కల, అర=వేగంగా పరుగెత్తే, రురోః= జింకయైన మారీచునికి, అరేః=శత్రువైన శ్రీరాముని, రేరే=(ర+ఈరే)=కౌస్తుభమణికిని పొందివున్న, ఉరో రరే=వక్షము నందు, రీరారా=లీల నాపాదించునట్టి, ఊరూరుః =ఊరువులచే గొప్పనైన, ఉః= లక్ష్మి=సీత, అర రర=తన నివాసానికి



తీసుకువెళ్ళిన, ఇరార= లంకను పొందిన, ఇరారి=భూ శత్రువైన రావణునికి, రిః=నాశం కల్గించినదై, ఆరిరా=చెలికత్తెలను, రా=పొందిన దాయెను, శ్రీరామ పత్ని సీత లంకలో రావణ నాశనం సూచించే త్రిజట వంటి చెలికత్తెల్ని పొందిందని అర్థం.

శ్రీ కృష్ణదేవరాయల భువన విజయ సాహిత్య సభకు ఒకనాడొక కవి వస్తే - ఆయన్ని తెనాలి రామ కృష్ణుడు

**"మేక తోకకు మేక తోక మేకకు మేక**

**మేక తోకకు తోక తోక మేక"** అంటూ ఓ పెద్ద సీస పద్యం లో మేకల మందని సమస్యగా చెప్పి నిరుత్తరుణ్ని చేసి ఓడించాడు. అయితే కృష్ణరాయల కీర్తిని వర్ణిస్తూ తెనాలి కవి చెప్పిన యీ పద్యమెంత అక్షర సౌందర్యంతో గంభీరంగా వుందో చూడండి:

**నరసింహ కృష్ణరాయని**

**కరమరుదగు కీర్తి యొప్పె కరిభిద్గిరిభి**

**త్కరి కరిభిద్గిరి గిరిభి**

**త్కరిభిద్గిరి భిత్తు రంగ కమనీయంబై!!**

నరసింహరాయల కుమారుడైన శ్రీ కృష్ణదేవరాయల కీర్తి-కరిభిత్=గజాసుర సంహారియైన శివునిలా, గిరిభిత్కరి=ఇంద్రుని ఏనుగైన ఐరావతంలా, కరిభిద్గిరి= కైలాసంలా, గిరిభిత్=వజ్రాయుధంలా, కరిభిద్గిరిభిత్తురంగ= శివేంద్రుల వాహనాలలైన నంది, ఉచ్చైశ్శ్రవం (తెల్లగుర్రం)లా అందంగా, తెల్లగా ఉందని భావం.

చివరగా, కాళిదాసు పేరు మీద చలామణీలో వున్న చదవటానికి నోరు తిరగని, ఓ శ్లోకాన్ని మీకు పరిచయం చేస్తాను. శ్లోకాన్ని చూసి ఖంగారు పడకండి. జాగ్రత్తగా చదవటానికి ప్రయత్నం చేయండి.

**షడ్జ మడ్జ ఖరాడ్జ వీడ్జ వసుధాడ్జా లాంఛ్ఛ మధ్ధాఖరే**

**జడ్జ ట్కి ట్కి ధరాడ్జ రేడ్వన ఘనః ఖడ్జోత వీడ్య భ్రమా**

**వీడ్యాలుడ్ భ్రమ లుట్ప్ర యట్టి యపదా డడ్డడ్డ డడ్డడ్డహో**

**పాదొటే ట్రుట టట్రుట ట్రుట రసత్ప్రఖ్యాత సఖ్యోదయః!!**

ఈ శ్లోకానికి అర్థమేమిటో నేనైతే యిప్పటికీ తెలుసుకోలేకపోయాను. మీకు తెలిస్తే 'హాసం' ద్వారా తెలిపి పుణ్యం కట్టుకోండి. సరేనా!

# వేషధారణ వలన తప్పిన తాళం

సకల కళానిలయంగా ప్రశస్తి గాంచిన ఒకనాటి మైసూరు రాజాస్థానం ఎందరో సంగీత, శిల్ప, చిత్రకళా విద్వాంసులను ఆదరించి ప్రోత్సహించి, సత్కరించి విఖ్యాతిగాంచింది. మైసూరు సంస్థానం అంటేనే వీణా సంప్రదాయ సార్వభౌములైన వీణ శేషణ్ణగారు స్ఫురణకు వస్తారు. వారి వీణ మ్రోగిందంటే గంధర్వలోకం అవతరించేదంటారు ఆచార్య వి. సీతారామయ్యగారు.

మహారాజు ముమ్మడి కృష్ణరాజు ఒడయార్ రాజభవనంలో శివరాత్రి జాగరణోత్సవం సందర్భంగా సంగీత శ్రవణం చేస్తున్నారు. సంస్థానానికి విచ్చేసిన విద్వాంసులొకరు "పల్లవి" విన్యాసం కావిస్తూ అవస్థ పడుతూవుండటం ఆస్థాన విద్వాంసులు గమనించారు. ఐదేళ్ళ శేషణ్ణ, తండ్రి అనుమతితో పల్లవిని అద్భుతంగా వినిపించి మహారాజు నుండి ముత్యాలహారాన్ని, దుశ్శాలువలను పారితోషికంగా పొందిన బాల మేధావి వీణ శేషణ్ణ.

ఒకమారు మదరాసు నుండి వచ్చిన ఆహ్వానాన్ని మన్నించి వెళ్ళారు. కచేరి అద్భుతంగా జరిగిన తరువాత సత్కారం జరిగింది. 'కళ్యాణ సింహ' అని విర్రవీగుతున్న విద్వాంసులొకరు విజృంభించారు. శేషణ్ణ వారి మిత్రులు సుబ్బణ్ణ, ఆ కల్యాణ సింహంగారి సత్తా చూడాలనుకున్నారు. వారం రోజుల పాటు వారిద్దరూ రేయింబవళ్లు కల్యాణి రాగాన్నే సాధన చేస్తున్నారని విన్న ఆ కల్యాణ సింహం మద్రాసు నుండి చెప్పకుండానే ఉడాయించారు.

మహావైద్యనాథయ్యర్ ఒకమారు మైసూర్ వచ్చి శేషణ్ణగారి ఇంట విడిది చేశారు. రెండురోజుల తరువాత మహారాజు బామరాజేంద్ర ఒడియాంగారి దర్శనానికి, అయ్యర్‌గారిని తీసుకొని వెళ్ళడానికి అన్ని ఏర్పాట్లు జరిగాయి. సనాతనచారపరులైన వైద్యనాథ్ అయ్యర్ ఆస్థాన ప్రవేశ నియమాలనను సరించి పైజామా పొడుగాటి నల్లకోటు,మైసూర్ తలపాగా నడుమపట్టు ధరించక తప్పిందికాదు. అయ్యర్‌కు ఈ వేషధారణ అంటేనే భయం. అయినా విధిలేదు. రాజదర్శనం తరువాత కచేరి ప్రారంభమైంది. మహ విద్వాంసులైన అయ్యర్ స్థిమితం కోల్పోయారు. శ్రుతి, తాళం తప్పాయి. శేషణ్ణ, సుబ్బణ్ణ ఇద్దరూ ఒకరిముఖం మరొకరు చూచుకున్నారు. అయిదు నిమిషాలు కూడా కాలేదు. మహారాజు సభనుంచి లేచిపోయారు.

వైద్యనాథయ్యర్‌తో పాటు శేషణ్ణ ఇంటికి తిరిగి వచ్చారు. రెండురోజులు మౌనంగా గడిచాయి. మూడవరోజున వేకువజామునే భాగవతార్ స్వయంగా తంబూర శ్రుతి చేసుకొన్నారు. శ్రుతి విన్నంతనే శేషణ్ణగారు మేల్కొన్నారు. శుద్ధమైన శ్రుతివిన్నంతనే ఆయన ముగ్ధులయ్యారు. భాగవతార్ భైరవి రాగాలాపన ప్రారంభించారు. అద్భుతంగా గానం చేస్తున్నారు. శేషణ్ణగారు సభలో జరిగిన సంఘటనకెంతో నొచ్చుకుంటూ "ఏమి గంధర్వగానం!" అంటూ ఆనంద పరవశుల య్యారు. ఆయన వెంటనే సుబ్బన్నగారిని పిలిపించి తమలో తాము మాట్లాడుకున్నారు.

వైణిక శిఖామణి వీణ శేషణ్ణ

శేషణ్ణగారు రాజభవనానికి వెళ్ళారు. మూడు రోజులుగా రాజదర్శనానికి వెళ్ళని తమపై రాజుగారికి ఆగ్రహం కలిగిందని గ్రహించలేక శేషణ్ణ ఒక ప్రక్కగా నిల్చున్నారు. మహారాజు శేషణ్ణగారిని చూచి చూడనట్లు ముఖం మళ్ళించారు.

శేషణ్ణ తమలో తాము 'ఏదో రాజాగారూ దివ్యమైన సంగీతం వినే అవకాశాన్ని కోల్పోయి. ఈ గోడలమధ్య తలకొట్టుకొనేందుకు వచ్చాను ఇక్కడ వినేవారెవరు. ఆ అదృష్టం వీరికెలా కలుగుతుంది! అనుకున్నారు. మహారాజు వెంటనే 'ఏమండి ఆ గార్ధభ సంగీతాన్ని వినమని చెప్పడాని కొచ్చారా? అన్నారు.

శేషణ్ణగారు 'అవేవో విషఘడియలు దయచేసి వెంటనే విచ్చేయండి' అన్నారు. 'ఎక్కడికి?' రాజుగారి ప్రశ్నకు 'మా యింటికే వెంటనే రండి' అని తొందరచేశారు. మహారాజు మారువేషంలో శేషణ్ణగారి ఇంటికి విచ్చేసి వారి కోసం కేటాయించిన గదిలో కూర్చున్నారు. భాగవతార్ భావసమాధికే మాత్రం భంగం కలగకుండా శిలాప్రతిమల్లా దివ్య సంగీతాన్ని వింటున్నారు. మధ్యాహ్నం వరకూ అలాగే గడిచింది. నిర్మల గంగా స్రవంతిలాగ భాగవతార్ గానం సాగుతూవుంది. భైరవీ సాక్షాత్కారం జరిగింది కాబోలు అమృతపానమత్తులవలె అందరూ పరవశులయ్యారు.

మహారాజు ఆనందబాష్పాలు రాలుస్తూ 'జన్మ తరించింది' అన్నారు. మహారాజుగారితో పాటు అందరూ శేషణ్ణగారి ఆతిథ్యం స్వీకరించారు.

మరుసటిరోజు ఆస్థానంలో భాగవతార్‌గారి కచేరి జరిగింది. 'ఇది దేవ గానం' అంటూ అందరూ కీర్తించారు. మహారాజు వెండి పళ్ళెంలో మూడువేల సవరలతో సత్కారం జరిపారు.

- డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

సీరియల్ 11

# హాస్యవల్లరి సంగీతలహరి

# కిశోర్ జీవనఝరి



**- ఎమ్మెస్ స్వాతి**

హిందీ చిత్రసీమ తొలినాళ్ళ నుండీ హాస్యనటులకు కొదవలేదు. స్థూలకాయం, జడ్డి మొహం ఉంటే ఆటోమేటిగ్గా నవ్వువస్తుంది కాబట్టి ఆ బాపతు మనుషులకు కమెడియన్లుగా మంచి డిమాండు ఉండేది. ఏదో ఒక శారీరక అవకరం చూపి నవ్వించడం మంచి హాస్యం కాకపోయిన ఛట్టున నవ్వు తెప్పించగలడం సుకరమవుతుందని అటువంటివాళ్ళను ఎంచుకునేవారు. బుధూ అడ్వానీ అనే హాస్య నటుడికి బోసినోరు ప్రత్యేకాకర్షణ అంటే ఆశ్చర్యంగా ఉంటుంది కదూ. దీక్షిత్, గోప్ వాళ్లు ఇటువంటి అవకరాల మీద మొదట్లో ఆధారపడినా క్రమంగా మంచి హాస్యం చేశారు. గోప్ అమెరికన్ హాస్యనటుడు కాస్టెల్లోని కొంతవరకు అనుకరించి హాస్యం పుట్టించగా నూర్ మొహమూద్ చార్లీ అనే పేరు పెట్టుకుని చార్లీ చాప్లిన్‌ను శుభ్భరంగా పేరుతో సహా దించేశాడు.

ఎటువంటి వికారాలకు పోకుండా హాయి గొలిపే హాస్యాన్ని సృష్టించినవాడు వి.ఎచ్.దేశాయి. ఆగా సీరియస్ నటుడిగా ప్రారంభమై హాస్యం చేశాడు. ఓం ప్రకాష్ కూడా అంతే. భగవాన్ స్టంటు సినిమాల్లో మొదలుపెట్టి హాస్యనటుడయ్యాడు. వీళ్లంతా మాటను నాన్చి, నాన్చి పలికి 'హాస్యం చేస్తున్నాం కాసుకో' అన్న స్టయిల్లో నటించేవారే. జానీవాకర్ హాస్యనటుల్లో స్టార్. రుసుములో, బాక్సాఫీసు పలుకుబడిలో ఒకపాటి విప్లవం తెచ్చాడు. అతని కాల్షీట్ల కోసం హీరోలు ఎదురు చూసే పరిస్థితి కూడా ఉండింది కొంతకాలం. అతనిపేర సినిమా కూడా వచ్చింది. హీరోగా వేసినా జానీవాకర్ కావాలని మాట నొక్కి, నొక్కి పలకడం, మొహం కాస్త వికారంగా పెట్టడం చేసేవాడు.

శారీరకంగా ఎటువంటి లోపమూ లేకపోయినా, మొహం చూడముచ్చటగా ఉన్నా హాస్య నటనవైపు మొగ్గు చూపినది కిశోర్‌కుమారే!

హాస్యం గురించి ఇక్కడ కొన్ని విషయాలు ముచ్చటించడం అప్రస్తుతం కాదు. ప్రతి మనిషికీ హాస్యం చాలా యిష్టం. మనసును ఉల్లాసపరచుకోవడానికి హాస్యం కోసం వెతుకుతాడు. కానీ దానికి తగినంత గౌరవం ఇవ్వడు. రాజాస్థానంలో నవ్వించే విదూషకుడికి చాలా తెలివితేటలు, యుక్తి కావాలి. అయినా అతని స్థాయి తక్కువే. కవికున్న గౌరవం వికటకవికి ఇవ్వరు. అందువల్ల మేధావి అయినవాడు రచయిత కాదలచినంతగా హాస్యరచయిత కావడానికి ఇష్టపడడు. నటుడు కూడా శృంగారం, విషాదం, వీరం పోషించినంత ఉత్సాహంగా హాస్యరస పోషణకు ముందుకు రాడు.

రాజ్‌కపూర్ విధివిలాసాలను వర్ణిస్తూ ఒక సినిమాలో 'హీరోసే జోకర్ బన్‌జానా పడ్‌తా హై' అని వాపోతాడు. ఎందుకంటే కమెడియన్‌ది ఎప్పుడూ హీరో తర్వాతి స్థానమే. కమెడియన్ ఎంత వికారపు చేష్టలు చేస్తే హీరో హీరోయిజమ్‌కు అంత గుర్తింపు వస్తుంది. రూపురేఖల్లో నాసిరకంగా ఉండేవాణ్ణి కమేడియన్‌గా పెట్టుకుంటే హీరో ప్రభ మరింత వెలుగుతుంది.

**ఇలాంటి పరిస్థితుల్లో కిశోర్ వంటి చక్కటి నటుడు, గాయకుడు అవుదామనుకుని తాపత్రయపడినవాడు, అశోక్ కుమార్ వంటి రొమాంటిక్ హీరోకి తమ్ముడు హాస్యం వైపుకి ఎందుకు మొగ్గు చూపాడు?**

కిశోర్‌కుమార్ 'జిద్దీ' (1948) సినిమాలో వేసిన తోటమాలి వేషం ఎవరికీ గుర్తులేదు. 'ఆందోళన్' అనే దేశభక్తి పూరిత సినిమా 1951లో వెలువడింది. అశోక్‌కుమార్ తమ్ముడు కదాని కిశోర్‌కు హీరో వేషం యిచ్చారు. ఫణి మజుందార్ దర్శకత్వం వహించిన ఈ సినిమాలో కిశోర్, మంజూ, సుష్మ, కృష్ణకాంత్ తదితరులు నటించారు. దానికీ పెద్దగా పేరు రాలేదు.

ఈలోపున అశోక్‌కుమార్ బాంబే టాకీస్ తరపున 'తమాషా' (1954) అనే సినిమా తీస్తూ కిశోర్‌కు ఓ పాత్ర యిచ్చాడు. దేవ్‌ఆనంద్, మీనాకుమారి, బిపిన్‌గుప్తా ముఖ్యపాత్రలు ధరించారు. సంగీతం ఖేమ్‌చంద్ ప్రకాష్, మన్నాదేలు. కిశోర్ వేసిన పాత్ర ఎవరికీ గుర్తుండేది కాదు.

వీటిలో నటించేటప్పుడు కిశోర్ పీలగా, నల్లగా కనిపించేవాడు. వాయిస్ కూడా రఫ్‌గా, తర్ఫీదు ఎరగనట్లు ఉండేది. ఏదో లైట్‌గా, కాజువల్‌గా

**కొంతమంది తొలితరం హాస్యనటులు**



'ధూమ్‌ధామ్' (1949) చిత్రంలో ఆగా



గోప్



'జాగిర్దార్' (1937) లో యాకుబ్, బుధూ అడవానీ, మోతీలాల్

నటించానని అనుకునేవాడు కానీ చూసిన వాళ్లకి అనుభవశూన్యుడిలా అనిపించేది.

1952లో వచ్చిన 'చమ్ చమా చమ్'' (దర్శకత్వం సంతోషి, సంగీతం ఓ.పి.నయ్యర్)లో కిశోర్ నటన మెరుగుపడింది. ఆ తర్వాత వచ్చిన సినిమాలు-1953 నాటి 'లడ్కీ' లెహరేఁ', 1954లో వచ్చిన 'ధోబీ డాక్టర్', 'ఇల్‌జామ్', మిస్ మాలా', 'అధికార్', 'నౌకరీ', 'పెహ్‌లీ ఝలక్'. వీటన్నిటి ద్వారా కిశోర్ నటనా ప్రతిభ బయటపడసాగింది. వీటిలో విభిన్నమైన పాత్రలు దొరకడం కూడా కిశోర్ అదృష్టం.

'లడ్కీ' ఎ.వి.యమ్.వారి చిత్రం, దర్శకత్వం ఎం.వి.రామన్. కిశోర్ సరసన హీరోయిన్‌గా వైజయంతీ మాల నటించగా ఇతర పాత్రలను భరత్‌భూషణ్, అంజలీదేవి, ఓమ్‌ప్రకాష్, ధరించారు. సంగీతం సుదర్శనం, ధనీరామ్. ఒక దక్షిణాది అమ్మాయితో ప్రేమలో పడిన పంజాబీ అబ్బాయిగా నటించాడు కిశోర్.

'లెహరేఁ' హెచ్.ఎస్. రవైల్ దర్శకత్వంలో (సంగీతం సి.రామచంద్ర) తయారయిన సినిమా. కిశోర్‌కి జోడీగా శ్యామా నటించింది. కిశోర్ నటనకు కాస్త గుర్తింపు వచ్చిందనవచ్చు.

"పెహ్‌లీ ఝలక్' కు దర్శకత్వం ఎం.వి.రామన్, హీరోయిన్ వైజయంతీ మాల. ప్రాణ్, ఓంప్రకాష్ కూడా నటించారు. సంగీతం అందించినది సి.రామచంద్ర.

'అధికార్' (మోహన్ సెహ్‌గల్ డైరెక్షన్, అవినాశ్ వ్యాస్ మ్యూజిక్) కిశోర్ భార్యను పోగొట్టుకున్నవాడి పాత్ర. అద్దె ఇల్లు నిలబెట్టుకోవడానికి అర్జంటుగా పెళ్లాడవలసి వస్తుంది. దీనిలో హీరోయిన్ పాత్రలో ఉషాకిరణ్, కమెడియన్ పాత్రలో రాధాకిషన్ రాణించారు కానీ కిశోర్ మాత్రం ఓవర్ యాక్షన్ కనబరచాడు.

ఇప్పటివరకూ కిశోర్‌ను డైరెక్ట్ చేసిన వారందరూ పేరున్న దర్శకులే అయినా అతని నుండి మంచి నటనను రాబట్టలేక పోయారు. కానీ కిశోర్ అదృష్టంకొద్దీ 'నౌకరీ' సినిమాకు బిమల్‌రాయ్ అతన్ని సెలక్ట్ చేసుకున్నాడు. అది ఆయన స్వంత సినిమా. సంగీతం సలిల్‌చౌధురీ. షీలారమణి హీరోయిన్. మొదట పల్లెటూరివాడిగా, తర్వాత పట్నవాసం మనిషిగా, ప్రేమించే అమ్మాయికి తనకు ముందే పెళ్లయిందని చెప్పలేని ప్రేమికుడిగా- ఇలా వివిధ సన్నివేశాలలో చక్కటి నటనను ప్రదర్శించే అవకాశం లభించింది కిశోర్‌కు. సమర్థవంతుడైన దర్శకుడి చేతిలో కిశోర్ నటన చక్కగా రూపుదిద్దుకుంది.


'మన్‌మౌజీ' చిత్రంలో కిశోర్‌కుమార్, నాజ్

ఈ సినిమాలో హీరోగానే గాక గాయకుడిగా కూడా రాణించాడు కిశోర్- 'ఏక్ ఛోటీ సే నౌకరీ కా తలబ్‌దార్ హూ మైఁ' (సోలో) 'కమాతా హూఁ బహుత్ కుఛ్, కమాఈ డూబ్ జాతీ హై' (లతాతో డ్యూయెట్) 'షాదీ షాదీ' (దీనినే తెలుగులో 'పెళ్ళి పెళ్ళి ఈడైన దానితో జోడీగా హాయి' అని పిఠాపురం పాడారు) అనే యోడిలింగ్ పాట పాడాడు.

ఈ సినిమాలన్నిటి వల్లా కిశోర్ సాధించుకున్న ఇమేజ్ ఏదీ లేదనే చెప్పాలి. అతను వేసిన పాత్రలు వేరే ఎవరైనా వేయగలిగినవే! తనకంటూ ఒక ప్రత్యేకత ఉండాలని కిశోర్ ప్రాకులాడినట్టు, దానికి తగ్గ పాత్రలకై అన్వేషించినట్టు కనబడదు. పైగా ఆ టైములో అతను పెళ్లి చేసుకుని స్థిరపడడానికి ప్రయత్నిస్తున్నాడు. వచ్చిన వేషమల్లా వేశాడు.

నిజానికి కిశోర్‌లో ఒక 'రస్టిక్ హ్యూమర్' స్వతహాగా ఉంది. చిన్నప్పటి నుండీ రామ్‌లీలా, నౌటంకీ, తమాషా ప్రదర్శనలు చూసిన అనుభవం ఉంది. ఇవన్నీ 'రిఫైన్‌డ్' హ్యూమర్ అనడానికి వీలులేదు. కొంత అమాయకత్వం, చిన్నపిల్లాడితనం కలగలిపితే ఇలాటి హ్యూమర్ పుడుతుంది. ఉదాహరణకి 'నౌకరీ' సినిమాలో ఒకడు సలహా చెప్తాడు 'ఫలానా వాడికి వెన్నపూస్తే (మస్కామార్‌నా) ఉద్యోగం ఖాయం' అని. వెంటనే కిశోర్ ఓ వెన్న డబ్బాతో ఆ ఫలానా ఇంట ప్రత్యక్షం. వాడు వద్దంటున్నా ఒళ్ళంతా వెన్న పూస్తాడు. ఈ తరహా హాస్యంలో ద్వందార్థం ఉండదు. వెటకారం ఉండదు. 'వెర్రి బాగులాడురా' అని పగలబడి నవ్వుకునేట్టు ఉంటుంది.

దీనికి తోడు కిశోర్‌లో స్వతహాగా ఆడిపాడే గుణం ఉంది. హాలీవుడ్‌లో డేనీకేయే, జీన్‌కెల్లీ, డోనాల్డ్ ఓ కనార్ అప్పటికే తమ అభిమానులను అలరిస్తున్నారు. వాళ్ళందరూ ప్రాజెక్ట్ చేసినది నగటు మనిషి కలలనే! అన్యాయాన్ని ఎదిరించడం వంటి పెద్ద విషయాల జోలికి పోకుండా, విషాదంలో మునిగిపోయి దేవదాసులయి పోకుండా హాయిగా దులిపేసుకుని పాటలు పాడుకుంటూ తిరిగే పాత్రలే వేశారు. ఆ పాత్రలు కూడా క్లిష్టమైనవి కావు. అమాయకుడైన, మంచివాడైన హీరో పాత్రలే.

డేనీకేయే 'నాక్ ఆన్ ది వుడ్' చూడగానే కిశోర్‌కు తన బలమేమిటో తెలిసివచ్చింది. 'బాప్ రే బాప్' పూర్తి హాస్యభరిత చిత్రం హీరోగా కిశోర్ అదరగొట్టేశాడు. హాస్యం ద్వారానే తారాపథాన్ని అందుకున్నాడు.

ఆ తర్వాత హాస్య చిత్రాలతో బాటు సీరియస్ చిత్రాలు కూడా వేశాడు. "షరారత్" (1959) వంటి సినిమాలలో ఒక పాత్ర హాస్యంగా, రెండో పాత్ర సీరియస్‌గా వేశాడు. కొన్ని జనరల్ సినిమాలలో హాస్యంగా నటించాడు. కిశోర్ నటించిన పూర్తి హాస్య చిత్రాలలో చెప్పుకో దగినవి - 'మిస్‌మేరీ' (1957), ('మిస్సమ్మ'లో నాగేశ్వరరావు వేసిన పాత్ర), 'చల్తీకా నామ్ గాడీ' (1958), 'చాచా జిందాబాద్', 'బేవకూఫ్' (1960), 'కరోడ్‌పతి' (1961), ఝుమ్రూ' (1961), 'హాఫ్ టికెట్' (1962), 'శ్రీమాన్ ఫంటూష్', (1965), 'అకల్‌మంద్' (1966), 'దో దూనీ చార్' (1968), (దీన్ని 'అంగూర్'గా గుల్జార్ 1982లో తీశాడు)

## కొంతమంది తొలితరం హాస్యనటులు


'కువాఁరా పతి' (1950)లో నూర్ మహమ్మద్(చార్లీ)


'చార్ చక్రమ్' (1932)లో ఘోరి, దీక్షిత్, కె.కె.అదాజానియా, బిల్లిమోరియా


'భాభీ' (1938)లో వి.ఎచ్.దేశాయ్

చాలా సినిమాలు రొమాంటిక్, క్రైమ్ థీమ్ కలిగినా కిశోర్ ఉండడం వల్లన వాటికి హాస్య చిత్రాల ఇమేజ్ వచ్చింది.

కొన్ని సినిమాలలో సాటి హాస్య నటులతో కలిసి జంట హీరోగా నటించాడు కిశోర్. వాటిలో చెప్పుకో దగ్గది 'భాగంభాగ్'.

హాస్యనటులు జంటగా ముఖ్యపాత్రల్లో నటించడం విదేశాలలోనే ప్రారంభమయింది. లారెల్-హార్డీ, బడ్ ఏ బట్- లో కాస్టెలో, డీన్ మార్టిన్ - జెర్రీలూయీస్ ఇలా ఎంతోమంది ఉన్నారు.

హిందీ సీమలో ఆగా - యాకూబ్, జోహార్-మజ్నూ (ఏక్ థీ లడ్‌కీ, హమ్ సబ్ చోర్ హై) టీములుగా ఏర్పడి తమ అదృష్టాలను ప్రరీక్షించుకున్నారు.

భగవాన్-బాబూరావ్, జంట బడ్-ఏ బట్ లో కాస్టెలో జంటను అనుకరించి కొంత విజయాన్ని సాధించారు. భగవాన్ నటుడుగానే కాక డైరక్టర్‌గా కూడా రాణించాడు. ఫైట్స్ బాగా చేసేవాడు. ఫైట్స్‌లోనూ హాస్యం చొప్పించాడు. శరీరం ఫైట్స్‌కి సహకరించడం మానేశాక పూర్తి హాస్యం వైపు మొగ్గాడు. హాస్యాన్ని, సంగీతాన్ని రంగరించి అల్‌బేలా (1951) సూపర్-డూపర్ హిట్ అయింది. దానివల్ల ఫుల్‌లెంగ్త్ కామెడీలు తీయవచ్చన్న ధైర్యం కలిగించింది. కిశోర్ కుమార్‌ను, ఆ తర్వాత మెహమూద్‌ను పెట్టి అటువంటి సినిమాలు తీసే ధైర్యం నిర్మాతలకు కలిగింది.

"అల్‌బేలా'' సక్సెస్ ఊపులో 'ఝుమేలా' (1953) తీసి భగవాన్ చేతులు కాల్చుకున్నాడు. అప్పుడు తన ఒక్కడి గ్లామరు సరిపోదను కున్నాడేమో కిశోర్‌ను కలుపుకుని "భాగంభాగ్'' తీశాడు. దీని నిర్మాత, దర్శకుడు భగవానే. తెరపై వాళ్లపేర్లు 'కిష్టూ, భాగూ!' ఇద్దరు మిత్రులు కలిసి ఒక నిధి గురించి వెతకడం అనేది థీమ్. ఆ నిధి మ్యాప్ కోటు జేబులో ఉంటుంది. ఆ కోటు ఒకరి నుండి మరొకరికి చేతులు మారడంతో బోల్డంత హాస్యం పుడుతుంది. కానీ జాతీయ సమగ్రత కోసం సినిమా మధ్యలో అనేక పాత్రలు ప్రవేశ పెట్టడంతో గందరగోళం అయిపోయింది.



బాగీ షెహ్‌జాదా, గంగా కీ లహరే, మిస్టర్ ఎక్స్ ఇన్ బాంబే, శ్రీమాన్ ఫంటూష్, దునియా నాచేగీ, హాయ్ మేరా దిల్, షరారత్ సినిమాలలో కిశోర్ హీరోయిన్ కుమ్ కుమ్

సీనియర్ అయిన భగవాన్ పక్కన కిశోర్ రెండో స్థాయికి దిగజారిపోయాడు. భగవాన్‌కి సినిమా కలిసి రాలేదు. మొత్తానికి సినిమా ఫెయిల యింది. కానీ రఫీతో కలిసి కిశోర్ పాడిన పాటలు హిట్ అయ్యాయి.

ఐయస్ జోహర్ విద్యాధికుడు, మేధావి, కథారచయిత కూడా. ఇంగ్లీషు కథలను హిందీ రంగానికి 'ఎడాప్ట్' చేస్తూ చక్కటి స్క్రిప్టులు రాసేవాడు. సినిమా డైరెక్టర్‌గా కూడా వన్నెకెక్కాడు. తదుపరి కాలంలో మెహమూద్‌తో కలిసి జోహర్-మెహమూద్ (ఇన్ గోవా, ఇన్ హాంగ్‌కాంగ్...వంటి అనేక సినిమాలు) సీరీస్ తీశాడు.

కిశోర్, ఐ.యస్.జోహర్ కలిసి నటించిన సినిమా 'బేవకూఫ్' (1960) దర్శకత్వం జోహర్‌దే. మాలాసిన్హా హీరోయిన్. మొదట్లో అంతా సరదాగా సాగి చివర్లో 'విట్నెస్ ఫర్ ప్రాసిక్యూషన్" (అగాథా క్రిష్టి కథ) ఫక్కీలో కోర్టు డ్రామాతో ముగుస్తుంది. సినిమా బాగా ఆడింది. 'అకల్‌మంద్' (1966) సినిమాలో రూప్ కె శోరీ దర్శకత్వంలో మళ్లీ ఇద్దరూ కలిసి నటించారు. సంగీతం ఓ.పి.నయ్యర్. సోనియా సహానీ హీరోయిన్. సినిమా ఓ మాదిరిగా ఆడింది. తర్వాత 1974లో కిశోర్ తన స్వంత డైరెక్షన్‌లో 'బఢ్ తీ కానామ్ దాడీ'లో సినిమా తీస్తూ జోహర్‌కి ముఖ్యపాత్ర ఇచ్చాడు. ఆ సినిమా ఫ్లాప్ అయింది.

వీరందరితోనూ కడదాకా ఒకే రకమైన ఈక్వేషన్ ఉన్నా మెహమూద్ వద్దకు వచ్చేసరికి ఈక్వేషన్ మారింది. మెహమూద్‌ది పూర్తిగా 'గ్యాలరీ హ్యూమర్' సామాన్య ప్రేక్షకుడిని కితకితలు పెట్టించగలదు. 1960లలో, 1970లలో మెహమూద్ స్థాయి అంచెలంచెలుగా పెరిగిపోయింది. కిశోర్- మెహమూద్‌ల మధ్య జరిగిన ఓ సంఘటన చెప్పుకు తీరాలిక్కడ

దర్శక, నిర్మాత 'చిత్రాలయా' శ్రీధర్ 'ప్రేమించిచూడు'ను హిందీలో 'ప్యార్ కియే జా'

'హంగామా' (1971) సినిమాలో కిశోర్, మెహమూద్ కలిసి నటించారు. ఓసారి సెట్లో కిశోర్ దిగాలుగా ఉండడం చూసి మెహమూద్ ఏమయిందని అడిగాడు "వందరూపాయలు పోయాయి. నువ్వేమైనా చూశావా?" అన్నాడు కిశోర్.

"వందరూపాయల కోసం ఇంత హడావుడా?" అన్నాడు మెహమూద్ తెల్లబోతూ. "అంత తేలిగ్గా కొట్టిపారేయకు. రోజుకో రూపాయి బజ్జీల చొప్పున కొనుక్కున్నాననుకో ఈ డబ్బుతో హాయిగా వంద రోజుల పాటు బజ్జీలు తినేవాణ్ని" అన్నాడు కిశోర్.

"బోల్డు సినిమాలు తీసినష్టపోయావుగా. ఈ వంద కూడా దాంతో బాటు పోయిందనుకో" అన్నాడు మెహమూద్.

కానీ కిశోర్ శాంతించలేదు. డైలాగులు చెప్పేటప్పుడు అటుది ఇటూ, ఇటుది అటూ చెప్పసాగేడు. మధ్య మధ్యలో 'వందరూపాయలు పోయాయి' అని అనడం సాగించాడు. ఇలా అయితే షూటింగు సాగదని చెప్పి మెహమూద్ ప్రొడ్యూసర్‌కి నచ్చజెప్పి ఓ వందరూపాయిలు ఇప్పించాడు.

అలా ఒప్పించినా కిశోర్ డైలాగులు సరిగ్గా చెప్పలేకపోయాడు. డైలాగుల మధ్యలో 'ఆ వందా పోకుండా ఉంటే ఈ పాటికి నా జేబులో రెండు వందలుండేవి' అని అనడం మొదలెట్టాడు!

**కిశోర్ సరసన నటించిన కొందరు కథానాయికలు**



ఉషాకిరణ్ (అధికార్, ధోబీ డాక్టర్, ముసాఫిర్)



షకీలా (పైసా హై పైసా, బేగునాహ్)



మంజూ (ఆందోళన్)



చాంద్ ఉస్మానీ (బాప్ రే బాప్)

(1966)గా తీశాడు. నాగేశ్వరరావు పాత్రను శశికపూర్‌కు, జగ్గయ్య పాత్రకు కిశోర్‌కుమార్‌ను మాట్లాడుకున్నాక చలం పాత్ర వేయమని మెహమూద్‌ని అడిగాడు. ఎందుకో గానీ మెహమూద్‌కి ఆ పాత్ర వేయడం ఇష్టంలేదు. డైరెక్టుగా అలా చెప్పడం ఎందుకని తన పారితోషికం రెట్టింపు చేసి చెప్పాడు. ఆశ్చర్యకరంగా శ్రీధర్ సరేననేశాడు. తీరా చూడబోతే అది కిశోర్‌కంటె మెహమూద్‌కి ఎక్కువ ముట్టినట్టు తేలింది.

కిశోర్‌కి ఒళ్లుమండింది. హీరోగా తన రోజులు ముగిసి పోతున్నాయని గ్రహించుకున్నాడు. మెహమూద్‌తో "ఎప్పుడో ఒకప్పుడు దీనికి ప్రతీకారం తీర్చుకుంటానులే' అన్నాడు నవ్వుతూనే. "పడోసన్" (1968) సినిమా తీస్తూ మెహమూద్ కిశోర్ వద్దకు వెళ్లి ఓ ముఖ్యపాత్ర వేయమన్నాడు. 'వేస్తాను కానీ పారితోషికం ఎంతో తెలుసా? నువ్వు ప్యార్ కియే జాకు తీసుకున్న దానికి రెట్టింపు' అన్నాడు కిశోర్.

నిర్మాత హోదాలో ఉన్న మెహమూద్ జంకలేదు. 'కిశోర్ దా నువ్వు తప్ప మరొకరు ఆ పాత్ర వేయలేరు. నువ్వడిగినంతా ఇస్తా' అన్నాడు వెంటనే. ఆ నిజాయితీకి కిశోర్ చలించిపోయాడు. అందుకే మెహమూద్ తర్వాతి చిత్రం 'బాంబే టు గోవా'లో అతిథి పాత్రలో ఉచితంగా నటించాడు. అదీ సాటి నటులపై కిశోర్ గౌరవం!


'పడోసన్'లో కిశోర్‌కుమార్, కేష్టో ముఖర్జీ, సునీల్‌దత్, ముక్రీ, దిలీప్‌రాజ్

(ఇంకావుంది)

**కిశోర్ సరసన నటించిన కొందరు కథానాయికలు**


రెహానా(చమ్‌చమాచమ్)


నిమ్మీ (చార్ పైసే, భాయ్ భాయ్ దాల్ మే కాలా)


షీలారమణి(నౌకరీ)

## కిశోర్ గీతావళి

కిశోర్ నటించిన హాస్య చిత్రాలలో 'మిస్టర్ ఎక్స్ ఇన్ బాంబే'(1964) ఒకటి. వాల్ట్‌డిస్నీ తీసిన 'ఆబ్‌సెంట్‌మైండెడ్ ప్రొఫెసర్' (1961) సినిమా అప్పట్లో వచ్చి ఇండియాలో కూడా బాగా సక్సెస్ అయింది. దాంట్లో ఒక సైంటిస్టు ఎగిరే పదార్థాన్ని కనుగొంటాడు. దాని సహాయంతో ఆకాశంలో కారు ఎగరడంలాంటి దృశ్యాలు చూసి మన ప్రేక్షకులు ముగ్ధులయ్యారు. తెలుగులో 'దొరికితే దొంగలు'లో అటువంటి దృశ్యంతో పాట పెట్టారు. అంతకు చాలాకాలం క్రితం 1933లో "ది ఇన్‌విజిబుల్‌మాన్" అనే సినిమా వచ్చింది. అందులో హీరో అదృశ్య రూపంలో తిరుగుతాడు. ఈ రెండింటినీ కలిపి తయారు చేసిన కథ 'మిస్టర్ ఎక్స్ ఇన్ బాంబే'.



లక్ష్మీకాంత్ ప్యారేలాల్ "పారస్‌మణి" (1963)తోనే గుర్తింపు తెచ్చుకున్నారు. తర్వాతి ఏడాదే ఈ సినిమా వచ్చింది. 'మేరే మెహబూబ్' పాట చాలా హిట్టయ్యింది. ఈ యుగళగీతం కూడా చాలా హుషారుగా ఉంటుంది. కిశోర్‌కుమార్‌కి జోడీగా కుమ్‌కుమ్ నటించారు.





అ: ఖూబ్ సూరత్ హసీనా జానెజా జానెమన్
రంగ్ జిస్‌కే లబోఁకా ఢూండ్‌తా హై చమన్
తూనహీ తూనహీ వో హసీతో సనమ్
కొయి ఔర్ హీ హై
ఆ: ఖూబ్ సూరత్ దివానా జానెజా జానెమన్
సున్ కె జిస్‌కా ఫసానా ఝూమ్ ఉఠా మేరా మన్
తూనహీ తూనహీ వో హసీతో సనమ్
కొయి ఔర్ హీ హై
అ: కల్ వో మిలీ థీ తొషబ్ బాతోఁ మే ఢలీ థీ
ఆ: ముఝె ఛేడోనా ఐసి బతా దో కౌన్ థీ వొ
అ: హ హ...హ హ...నా జో పలీ థీ వొ షబ్‌నమ్ థీ యా కలీ థీ
ఓ హో హో...జైసీ వో థీ వైసీ తూనహీ తునహీ
వో హసీతో సనమ్ కొయి ఔర్ హీ హై    ఆ: ॥ఖూబ్ సూరత్॥
ఆ: ఖ్వాబోఁ మె అక్‌సర్ వో ఆనే జానే లగా హై
అ: ఓ చలో ఛోడో రెహనే దో నహీ యే దిల్లగీ అచ్ఛీ
ఆ: ఓ హో...ఉస్ దిల్లగీ మే యే దిల్ జల్ జానే లగా హై
ఒహో...కైసే కెహదూఁ తూహై తూనహీ తూనహీ
వొ హసీ తో సనమ్ కొయి ఔర్ హీ హై    అ: ॥ఖూబ్ సూరత్॥
అ: ఝూమే నజారే అగర్ వో జుల్ఫే సవారే
ఆ: ఓ మెర దిల్ నజలా సున్‌లే మెరే బద్‌లే ఉసే చున్ లే
అ: హ హ...హహ...సమ్ ఝీ నహీ తూ తెరీ
జానిబ్ హై ఇషారే ఒహోహో...హహ తూహీ హైవో
ఇ: తూనహీ తూనహీ వొ హసీ తొ సనమ్ తెరా ప్యార్ హై    ॥ఖూబ్॥

మార్చి 1 మహాశివరాత్రి సందర్భంగా...

# శివ శివా...!



**-కండ్లకుంట శరత్‌చంద్ర**

'ఓం నమః పార్వతీపతయే...హరహరమహా దేవ శంభో శంకరా!'

"ఓ...మ్!" "ఓ...మ్!" "ఓ...మ్!"

ఓంకారనాదంతో...కైలాసం...ప్రతిధ్వనిస్తోంది. పరమశివుడు, ధ్యానంలో మునిగివున్నాడు.

పార్వతీదేవి గబగబా వచ్చింది.

"స్వామీ..."

శివుడు పలకలేదు.

"స్వామీ...!" ఈసారి బిగ్గరగా పిలిచింది. శివుడు, చప్పున మేలుకొన్నాడు.

"ఏమైంది...దేవీ!"

"ఈరోజు, శివరాత్రి పర్వదినం. ఆ సంగతి మరచిపోయారా?"

"నా పండుగను నేనెలా మర్చిపోతాను దేవీ!" అన్నాడు శివుడు. ఈసారి పార్వతి, శివుడికి మరింత దగ్గరగా వచ్చి, "స్వామీ!" అంది.

"ఏమిటి?" అన్నాడు శివుడు.

"స్వామీ...! మరేమో...అదీ..." అని గోముగా అడిగి, అర్థోక్తిలో ఆపేసింది.

"ఏంకావాలో అడుగు దేవీ, సందేహ మెందుకు? నువ్వు ఎక్కడికో వెళ్ళాలను కుంటున్నావ్. అవునా!" అన్నాడు శివుడు.

"భలే కనిపెట్టేరే" అంది పార్వతి.

"ఇంతకీ...ఎక్కడికెళ్ళాలనుంది?"

"ఇంకెక్కడికి స్వామీ...! మిమ్మల్ని భక్తి శ్రద్ధలతో కొలిచే భూలోకవాసుల చెంతకు. నేటి మహాశివ రాత్రిని, వారెలా గడుపుతున్నారో... చూసి ఆనందిద్దాం సరేనా!" అంది.

శివుడు చిద్విలాసంగా నవ్వి, "దేవీ! భూలోకంలో ఇప్పుడు నిజమైన భక్తుల్ని వెతకటం కష్టసాధ్యమైన పని. ఎందుకంటే... భూలోకంలో...

నిజమైన 'భక్తి' అంతరించి పోతోంది'' అన్నాడు. పార్వతి, ఆశ్చర్యంగాచూసి, "ఏమిటి నాథా... మీరంటున్నది!! భూలోకంలో...భక్తి తగ్గి పోతోందా! మరి...నారదుడు , ఈ మధ్య భూలోకంలో...భక్తులెక్కువవుతున్నారని చెప్పాడే!" అంది.

"ఓహో...ఇది నారదుడి పనా! నువ్వు భూలోకానికి వెళదామన్నప్పుడే... అనుకున్నాను, ఇది అతగాడి పనే అయ్యుంటుందని. దేవీ! ఒక్క మాట చెప్పనా! భూలోకంలో 'భక్తులు' పెరిగారు. కానీ..."భక్తి" పెరగలేదు." అన్నాడు శివుడు.

పార్వతి అర్థం కానట్లు చూసింది.

శివుడు, చిరునవ్వు చిందించి, "దేవీ! భక్తులు పెరిగారు...అన్నాను కదా! వాళ్ళందరూ...నిజమైన 'భక్తులు'కారు. స్వార్థంతో, కోరికలతో...భక్తిని కలుషితం చేస్తున్న భజనపరులు...ఆ జనాలు భక్తులెలా అవుతారు. కొందరు, 'భక్తి'ని 'భుక్తి' కోసం వాడుకుంటున్నారు. మరికొందరు...'భక్తి'ని 'యుక్తి'గా వాడుకుంటూ... 'రక్తి' కట్టిస్తున్నారు. మరికొందరు...'భక్తి'ని...'శక్తి'గా మార్చుకొని...తమ తమ స్వార్థాల కోసం వాడుకుంటున్నారు. ప్చ్! 'భక్తి'ని...'ముక్తి' కోసం వాడే ప్రజలే కరువయ్యారు అన్నాడు.

"ఏది ఏమైనా...మనం ఈ రోజు 'భూలోకానికి' వెళ్ళాల్సిందే!" అంది పార్వతి. ఇక తప్పేటట్లు లేదనుకుని, శివుడు, "సరే...వెళ్దాం. పద."

* * *

శివుడు, పార్వతి నందిని అధిరోహించారు.

"స్వామీ! ఆ నక్షత్రం వైపు చూడండి" అంది పార్వతి మార్గమధ్యమంలో.

ఆ నక్షత్రాన్ని, ఓ పసిడివర్ణపు పొర ఆవహించుకుని ఉంది.

"స్వామీ! ఏమిటా...పసిడివర్ణపు పొర?"అంది.

"దేవీ! అమెరికా, ఇరాక్ అనే రెండు దేశాల మధ్య 'యుద్ధం' జరగబోతోందని తెలియగానే...బంగారం ధర, అనూహ్యంగా పెరిగింది. "ఈ నక్షత్రాన్ని తాకుతోంది ఆ బంగారం ధరే..." చెప్పాడు శివుడు.

"స్వామీ! అటువైపు చూడండి. నక్షత్రం చుట్టూ...ఆకుపచ్చ రంగు పొరలున్నాయి. ఏమిటవి?" అంది

"అవి, భూలోకంలో కూరగాయల ధరలు దేవీ" చెప్పాడు శివుడు.

"దేవా! భూలోకవాసులు...నన్ను చూడగానే... చంపేందుకు ప్రయత్నిస్తారు కదా...!




మనం...అదృశ్యరూపంలో వెళితే... బావుంటుందేమో!"అన్నాడు, శివుని మెడలోని నాగరాజు.

"అటులనే నాగరాజా! తప్పకుండా అదృశ్యరూపంలోనే వెళదాం. అయినా...నీకు ఎందుకంత భయం. భూలోకంలో నీకున్నంత మంది భక్తులు ఇంకెవరికీ లేరు తెలుసా!" అన్నాడు శివుడు.

"ఏమిటీ...నాకు భక్తులా!?"

"అవును నాగరాజా...!నిన్ను, మాకంటే ఎక్కువగానే పూజిస్తారు. అదీగాక, నీపేరుమీద తీసిన... దేవి, సర్పయాగం, నాగమ్మ, నాగపంచమి, నాగదేవత, నాగిని, అమ్మా నాగమ్మ, నాగాస్త్రం...చిత్రాలన్నీ ఎంతగానో సొమ్ముచేసు కున్నాయి" చెప్పాడు శంకరుడు.

"అలాగా!" ఆశ్చర్యపోయాడు నాగేంద్రుడు.

శివపార్వతులు, హైదరాబాద్‌లో దిగారు.

"స్వామీ! ఆ విగ్రహం..."

"అది...ఆంధ్రుల అభిమాన నటుడు, దివంగత మాజీ ముఖ్యమంత్రి...నందమూరి తారక రామారావు విగ్రహం."

"అంటే...మొన్నామధ్య... 'ఇంద్రుడు' మనల్ని పిలిస్తే... అమరావతి వెళ్ళామే...! ఆరోజు అనర్గళంగా... ఉపన్య సించిన...ఆ నందమూరి తారక రామారావేనా!"

"ఆ అవును దేవీ! ఆయనే"

"ఏమాటకామాటే చెప్పుకోవాలి స్వామీ! పెద్ద పెద్ద సంస్కృత వాక్యాల్ని, తెలుగు వాక్యాల్ని... మంచి నీళ్ళు తాగినట్లు చెప్పాడాయన. నిజంగా మహానుభావుడు."

"అది...నువ్విప్పుడు ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు దేవీ! ఆ విషయం...ఏడున్నర కోట్ల ఆంధ్రులందరికీ తెలుసు"

"దేవా! మనం, ఒక్కొక్క ఇంటికీ వెళ్ళి... వారు శివరాత్రిని ఎలా జరుపుకుంటున్నారో చూద్దాం." అంది పార్వతి.

"అలాగే !" అన్నాడు శివుడు.

* * *



శివపార్వతులు, ఓ ఇంట్లోనికి ప్రవేశించారు.

సమయం...సరిగ్గా పదయ్యింది.

ఆ ఇంట్లోని జీవులన్నీ టీ.వీ. ముందు కూర్చుని వున్నాయి.

"శివరాత్రి స్పెషల్‌గా... ఫలానా... "రసికుడు" సినిమా హీరోయిన్ "అజీర్తి"తో ప్రత్యేక ఇంటర్‌వ్యూ" చెప్పింది ఏంకరమ్మ.

"అజీర్తి" స్క్రీన్ మీదికొచ్చి...ప్రేక్షకులకు విరక్తి కలిగేలా నవ్వింది.

''అజీర్తిగారూ...మీరు నటించిన 'రసికుడు' చిత్రం గురించి నాలుగు మాటలు మాట్లాడండి" అడిగింది ఏంకరమ్మ.

అజీర్తి...ఇంగ్లీష్‌లో సమాధానం చెప్తోంది. ఇంట్లోని ప్రేక్షకులందరూ...నోళ్ళు తెరుచుకుని టీ.వీ. వైపు చూస్తున్నారు.

''దేవా! ఈమె తెలుగులో అడుగుతుంటే ఆమె వేరే భాషలో సమాధానం ఇస్తోందేమిటి?" అంది పార్వతి, సందేహంగా.

"ఆంధ్రదేశంలో ఇప్పుడది ఒక అలవాటై పోయింది దేవీ!" అన్నాడు శివుడు.

"పదండి ప్రభూ! మరో ఇంటికి వెళదాం."

* * *

గృహిణి, వేరుసెనక్కాయలు నములుతూ... టీ.వీ. ముందు ఆసీనురాలై..."గతికితే అతుకుతుంది!" అనే ఓ ''చూయింగ్‌గమ్''ను ఆస్వాదిస్తోంది.

ఆమె భర్త...ఇంకా నిద్రలేవలేదు.

బావురు పిల్లులు కాట్లాడుతున్నట్లుగా... గురకపెడుతున్నాడు.




వారి పిల్లలిద్దరూ...ఫైటింగ్ చేస్తున్నారు.

"పదండి పరమేశా పక్కింటికి!" అంది పార్వతి.

* * *

నలుగురు గృహిణులు హాల్లోకూర్చుని మాట్లాడుకుంటున్నారు.

"వదినా...! ఫాలానా "రత్తమ్మ మొగుడు" సీరియల్‌లో...రత్తమ్మ తన మొగుడ్ని తన్నే ఎపిసోడ్‌లో...ఆమె, చారల జాకెట్ వేసుకుంది చూసావా! దాని మీదికి వంగపండు రంగు చీరైతే భలేగా వుంటుంది."

"అవునొదినా! 'జీడిపాకాయనమః' సీరియల్ 99999 X 1036వ భాగంలో...బెండేశ్వర్రావును బీరమ్మ చెప్పుతోకొట్టే సీన్‌లో...బెండేశ్వర్రావ్ జేబులో...వున్న పెన్ను ఏ కంపెనీదొదినా!"

"ఎందుకు? ఏదైనా పోటీ పెట్టారా?"

"అవునొదినా. సమాధానం చెప్పిన వారికి, ఆ పెన్ను ఉచితంగా ఇస్తారట."

"అది...మునక్కాయల్స్ కంపెనీది" చెప్పింది మరో గృహిణి.

"ఈ రోజు, ఏం కూర వండావు వదినా?"

"రోజా టీవీలో వచ్చే 'ఖానాఖజానా' కార్యక్రమంలో ఏది ఎలా వండాలో చూపిస్తారు చూడు. ఆ ప్రకారం తమలపాకుల చట్నీ చేసాను"

"పార్వతీ... పద...!" అన్నాడు శివుడు.

* * *

సమయం రెండయ్యింది.

"కొట్టరా...భయ్యా...కొట్టు! ఇరగ్గొట్టు" ఎవరో అరుస్తున్నారు.

"స్వామీ..! ఈ ఇంట్లో... ఎవరో...ఎవరినో... కొడుతున్నారు. పదండి చూద్దాం" అంది పార్వతి.

ఇద్దరూ ఆ ఇంట్లోకి నడిచారు. లోపల... ముసలీ ముతకా, పిల్లా జెల్లా, పడుచు, గిడుచూ అంతా కలిపి ఇరవైమంది దాకా వున్నారు. వాళ్ళందరూ టి.వి.లో, ఇండియా-పాకిస్తాన్ మ్యాచ్ చూస్తున్నారు.

"ఓహ్...! ఈరోజు మార్చిఫస్ట్ కదూ! ఈరోజు... వరల్డ్‌కప్‌లో, ఇండియా, పాక్‌ల మధ్య లీగ్ మ్యాచ్ వుంది." అన్నాడు శివుడు.

"పోయి పోయి ఆ ఆటేదో ఈ రోజే వుండి చావాలా! ఇక జనాలు...శివరాత్రి గురించి ఏమాలోచిస్తారు!!!" అన్నాడు మెడలోని నాగరాజు.

"కొట్టురా...సచిన్...కొట్టురా...భయ్యా!!! అక్రమ్ బౌలింగ్‌ను తుక్కు తుక్కుగా కొట్టు."

సచిన్ టెండూల్కర్ సిక్సర్ కొట్టాడు.

"హే...!" అందరూ అరుస్తూ, ఒకరికొకరు షేక్ హేండ్‌లిస్తున్నారు. "పార్వతీ...! వెళ్దామా" అడిగాడు శివుడు.

* * *

సమయం రాత్రి పన్నెండయ్యింది.

"చూస్తున్నావుగా దేవీ! ఏ ఒక్కరూ...ఉపవాసం ఉన్నట్టులేరు." అన్నాడు శివుడు.

"దేవా! కనీసం జాగరణలైనా చేస్తారేమో చూద్దాం.అప్పుడయినా...శివభజన విని ఆనందించవచ్చు." అంది పార్వతి.



"పార్వతి! నీకింకా భూలోకవాసుల స్థితి అర్థం కాలేదు. పద... చూద్దువుగానీ!" అన్నాడు.

సినిమా థియేటర్లన్నీ రద్దీగా వున్నాయి. కొన్ని దేవాలయాలలో, ప్రొజెక్టర్ పెట్టి...గోడమీద సినిమాలువేసి చూపిస్తున్నారు.

ప్రేక్షకులు...కూల్‌డ్రింకులు, 'హాట్' డ్రింకులూ...సేవిస్తూ...బర్గర్‌లు తింటూ... ఈలలేస్తున్నారు.

"ఇంక భరించలేను స్వామి! పదండి కైలాసానికి!" అంది పార్వతి.

ఇద్దరూ కైలాసం చేరుకున్నారు.

''దేవా...! ఈరోజు...ఒక్కరి నోటివెంటైనా... శివస్తుతిని వినలేకపోయినందుకు బాధగా వుంది." అంది పార్వతి బాధగా.

"పారూ...! నువ్వు బాధపడితే....నేను చూడలేను. నీ కోరిక ఇప్పుడే తీరుస్తాను" అని, భృంగి వైపు మళ్ళి "భృంగీ... నువ్వు అమరావతికి వెళ్ళి, అక్కడ వున్న ఓ గంధర్వ గాయకుణ్ణి ఇక్కడికి పంపమన్నానని ఇంద్రునకు చెప్పి, స్వయంగా నువ్వే ఆయనను వెంటబెట్టుకునిరా!" అన్నాడు శివుడు.

"చిత్తం...స్వామీ!"

భృంగి వెళ్ళిపోయాడు.

"స్వామీ...! ఆయనెవరు?" అంది పార్వతి.

కమాల్ ప్రశ్న - ఢమాల్ కార్టూన్



సన్యాసి అనగా...?

బాధలేని జీవితాన్ని గడపడానికి జీవితాంతం బాధపడేవాడు.

"దేవీ...! సంగీతంతో...రాళ్ళు సైతం కరిగి పోతాయని ఎప్పుడైనా విన్నావా!"

"విన్నాను"

"అది...ఇప్పుడు ప్రత్యక్షంగా చూద్దువుగాని!" అన్నాడు శివుడు.

"పరమేశ్వరా...నమోనమః!" తియ్యటి కంఠం వినిపించింది.

"పార్వతి...! ఈయనే...ఘంటసాల!" అని పరిచయం చేసి

"నాయనా...! ఈరోజు శివరాత్రి. నీపాట వినాలని కోరిక కలిగింది. మా కోరికను తీర్చెదవా!" అన్నాడు శంకరుడు.

"ఎంతమాట...ఎంతమాట! శుభం కరోతి ఇతి శంకరః అన్నారు పెద్దలు.

సర్వులకూ శుభం చేకూర్చే... దేవదేవుడవైన నీవు కోరడమూ, నేను...కాదనడమూనా!'' అని ఘంటసాలవారు...గాత్రం సవరించుకుని...గళం విప్పారు.

**"శివశంకరీ...శివానందలహరీ...శివశంకరీ..."**

శివపార్వతులు...ఆ గానానికి మైమరచి పోయారు. శివగణాలు...ఆనంద పారవశ్యంలో నృత్యం చేయసాగారు. కైలాసపర్వతంపై మంచు, ఆ ఆదిదంపతుల మనసులలో పేరుకుపోయిన బాధతో సహా నెమ్మదిగా...కరిగిపోసాగింది.

ఓం...నమఃశివాయ!

---




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. ఎలకోరిక (ప్రేమలేఖలు... నీవెవ్వరివో...)
   ఎ) గాఢమైన కోరిక బి) వయసుకోరిక
   సి) మనసులోనికోరిక డి) కొత్తకోరిక
2. మిసిమించు(ప్రేమలేఖలు...ఘల్లుఘల్లు)
   ఎ)చిరునవ్వుచిందించు బి) పిలుచు
   సి) ప్రకాశించు డి) నాట్యమాడు
3. అవధి (ప్రేమలేఖలు...విధిరాకాసి)
   ఎ) భూమి బి) హద్దు
   సి) ఆకాశము డి) గడువు
4. ఎడబాటు (ప్రేమలేఖలు...విధిరాకాసి)
   ఎ) వేరుబాట బి) మరణము
   సి) ప్రేమ డి) వియోగము
5. పన్నగము (దేవాంతకుడు...శ్రితజనపాల)
   ఎ) పాలసముద్రంబి) పాము
   సి)ఆలోచన డి) మర్రిఆకు
6. క్లేశము (శ్రీ రామంజనేయయుద్ధం... జయతు జయతు)
   ఎ) రోమము బి) చక్రము
   సి) ఆక్రోశము డి) దుఃఖము
7. నిగమము (శ్రీ రామంజనేయ యుద్ధం... జయతు జయతు)
   ఎ) వేదము బి) శక్తిముతము
   సి) లోకము డి) దారి
8. దార (ఉమాసుందరి...మాయాసంసారం)
   ఎ) భార్య బి) తల్లి
   సి)నక్షత్రము డి) పుత్రిక
9. శకుంతము (సరిగమలు...ప్రవాహము)
   ఎ) ముంగురులు బి) పాలపిట్ట
   సి) ఈటె డి) వసంతము
10. నరసీరుహాము (సరిగమలు.. ప్రవాహము)
   ఎ) అందమైనది బి) కొలను
   సి) తామర డి) మొలక

### జవాబులు

1) d 2) c 3) b
4) d 5) b 6) d
7) a 8) a 9) b
10) C

బాలు

మార్చి 3 న హిందీ సినీ సంగీత దర్శకుడు రవి జయంతి సందర్భంగా...

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | |
|---|---|
| చిత్రం | : చౌదవీఁ కా చాంద్ |
| రచన | : షకీల్ బదాయూనీ |
| సంగీతం | : రవి |
| గానం | : మహమ్మద్ రఫీ |
| అభినయం | : గురుదత్, వహీదా రెహమాన్ |

## చౌదవీఁ కా చాంద్ హో...

చౌదవీఁ కా చాంద్ హో
యా ఆఫ్‌తాబ్ హో
జో భీ హో తుమ్ ఖుదా కీ కసమ్, లాజవాబ్ హో ॥చౌదవీఁ॥
జుల్ఫేఁ హైఁ జైసే కాంధోఁ పే బాదల్ ఝుకే హువే
ఆంఖేఁ హై జైసే మయ్ కే ప్యాలే భరే హువే
మస్తీ హై జిస్ మేఁ ప్యార్‌కీ తుమ్ వో షరాబ్ హో ॥చౌదవీఁ॥
చెహరా హై జైసే ఝీల్ మేఁ హఁస్‌తా హువా కవఁల్
యా జిందగీ కే సాజ్ పే ఛేడీ హుయీ గజల్
జాన్ - ఎ - బహార్ తుమ్ కిసీ షాయర్ కా ఖ్వాబ్ హో ॥చౌదవీఁ॥
హోంఠోఁ పే ఖేల్‌తీ హై తబస్సుమ్ కీ బిజ్‌లియాఁ
సజ్‌దే తుమ్హారీ రాహ్ మేఁ కర్‌తీ హై కహ్‌కషాఁ
దునియా - ఎ - హుస్న్ - ఒ - ఇష్క్ కా తుమ్ హీ షబాబ్ హో ॥చౌదవీఁ॥










హిందీలో ప్రేయసిని వర్ణించే రొమాంటిక్ గీతాల ప్రస్తావన రాగానే గుర్తువచ్చే మొదటి పాట 'చౌదవీఁ కా చాంద్'. తెలుగువారికి కూడా సుపరిచితమైన పాట ఇది. ఆ కథ పరిచయం ఎంతటిదంటే ఈ పాట ప్రేరణతో తెలుగులో 'మదనకామరాజు కథ' చిత్రంలో రూపొందించిన పాటకు రెండు వెర్షన్లు పెట్టారు. క్లాసిక్ పాటగా చిరకాల ఖ్యాతిని సంపాదించిన ఈ పాటతో గాయకుడు రఫీ, రచయిత షకీల్ బదాయూనీ, సంగీతకర్త రవి అమరత్వాన్ని పొందారు.

రవి పూర్తి పేరు రవిశంకర్ శర్మ. ఆయన సంగీతంలో ఎటువంటి శిక్షణ పొందలేదు. గాయకుడు కావాలని బొంబాయి వెళ్ళి హేమంత్ కుమార్ వద్ద అసిస్టెంట్‌గా పనిచేశారు. హేమంత్ కుమార్ సాంగత్యంతో ఆయనకు సంగీత దర్శకుడు కావాలనే ప్రేరణ కలిగింది. హేమంత్ అందించిన 'నాగిన్' చిత్రంలోని నాగిని ట్యూన్‌ని రూపొందించినది రవి, కళ్యాణ్‌జీలు. హార్మోనియం, క్లే వయోలిన్ మీద రూపొందించిన ఆ ట్యూన్ ఎంత పాపులర్ అయిందో అందరికీ తెలిసినదే. 1955లో దేవేంద్ర గోయల్ తీసిన 'వచన్' చిత్రం రవికి సంగీత దర్శకునిగా మొదటి చిత్రం. ఆయన సంగీతంలో ఆర్కెస్ట్రా కంటే మెలోడికే ప్రాధాన్యత కనిపిస్తుంది. 'హమ్‌రాజ్', 'గుమ్‌రాహ్', 'పుకార్', 'వక్త్', చిత్రాలలో ఆయన మలిచిన పాటలు ఎంతో ప్రజాదరణ పొందాయి. శాస్త్రీయ సంగీతం నేర్చుకోని ఆయన 'గృహస్థి' చిత్రానికి ఆశాభోంస్లే చేత పాడించిన 'జీవన్ జ్యోత్ జలే' పాటకు సుర్ సింగార్ సన్సద్ వారు ఆ సంవత్సరపు ఉత్తమ శాస్త్రీయ గీతం అవార్డు ఇచ్చారు. తెలుగులో రవి సంగీతం అందించిన 'సరిగమలు' చిత్రంలో కూడా చక్కని శాస్త్రీయ సంగీతం అందించారు. రవికి 1971లో పద్మశ్రీ అవార్డు వచ్చింది. విచిత్రమేమిటంటే హేమంత్‌కు ఈ అవార్డు 16 ఏళ్ల తర్వాత...అంటే...1987లో వచ్చింది!

'చౌదవీఁ కా చాంద్' చిత్రం ఎమ్.సాదిక్ దర్శకత్వంలో గురుదత్ నిర్మించిన ముస్లిమ్ సోషల్ చిత్రం. ఓ కుర్ర జమీందారు నాయికను చూసి గొప్పింటి అమ్మాయిగా భావించి మనసు పారేసుకుంటాడు. నిజానికి ఆ



అమ్మాయి ఓ గొప్పింటి యువతికి సహచరి మాత్రమే. ముస్లిములలో పరాయి పురుషులు స్త్రీలను చూడరు కాబట్టి జమీందారు తెలియక తన సహచరుడైన నాయకుడికి నాయికతో పెళ్లి జరిపిస్తాడు. ఒకరోజు అనుకోకుండా నాయికను నాయకుడి ఇంట్లో చూసి జమీందారు తాను ప్రేమించినది ఆమెనే అని నాయకుడికి చెప్తాడు. విషయం అర్థమయిన నాయకుడు తన స్నేహితునికి దక్కవలసిన అమ్మాయిని అతనికి దూరం చేశాననే భావంతో మనోవేదన అనుభవిస్తాడు. చివరకు జమీందారు తాను వివాహితను కోరుకుంటున్నానని తెలిసి ఆత్మహత్య చేసుకోవటంతో కథ ముగుస్తుంది. నాయికా నాయకులుగా వహీదా రెహమాన్, గురుదత్ నటించారు. జమీందారుగా రెహమాన్ నటించారు.

ఒక చూపు చూడగానే మనసు దోచే సౌందర్యం నాయికది. అంతటి సౌందర్యరాశి అయాచితంగా తనకు దక్కటంతో నాయకుడు తన అదృష్టాన్ని తానే నమ్మలేక ఆమె అందాన్ని పొగుడుతూ పాడే పాట'చౌదవీఁ కా చాంద్'. ఉర్దూ పదాలతో, అందమైన భావాలతో, హాయిగా సాగిపోయే సంగీతంతో, రఫీ మధురగానంతో రూపొందింది ఈ పాట. ఈ పాటకు షకీల్ బదాయూనికి ఉత్తమ గీత రచయితగా, రఫీకి ఉత్తమ గాయకుడిగా ఫిలింఫేర్ అవార్డులు వచ్చాయి. మన తెలుగమ్మాయి అని గర్వంగా చెప్పుకునే వహీదా అందం ఈ పాటకి 'వన్నె' తెచ్చింది.

'చౌదవీఁ కా చాంద్' అంటే 'చతుర్దశి చందమామ' (చౌదహ్ అంటే పధ్నాలుగు) పున్నమి ముందరి చతుర్దశి నాటి చందమామ నిండుగా మిసమిసలాడుతూ ఉంటుంది. ఆఫ్తాబ్ అంటే సూర్యుడు. ఖుదా అంటే దైవం. కసమ్ అంటే ఒట్టు. లాజవాబ్ అంటే సాటిలేనిది.

**'నిండు చందమామవో**
**మరి సూరీడువో**
**ఏమయిన గాని నిక్కముగా నీ సాటి నీవెలే'**

నిండు చందమామ లాంటి రూపం ఆమెది. సూర్యుడంతటి కాంతి ఆమె అందానిది. చందమామ అనాలో, సూరీడు అనాలో తేల్చుకోలేక చివరికి నీ సాటి నీవే అంటున్నాడు.



జుల్ఫేఁ అంటే కురులు. కాంధే అంటే భుజాలు. బాదల్ అంటే మేఘాలు, మొయిలు. ఝుక్‌నా అంటే వాలటం. ఆంఖేఁ అంటే కనులు. కనుగవ అని కూడా అనవచ్చు. మయ్ అంటే మధువు, సుధ. ప్యాలే అంటే పాత్రలు. మస్తీ అంటే మత్తు. షరాబ్ అంటే మధువు.

**'కురులే తోచె భుజాలపై వాలే మొయిలుగా**
**సుధలే నిండిన పాత్రలె కాదా కనుగవ**
**మత్తెక్కించే ప్రేమ మధువు నీవెలే'**

ఆమె కురులు నల్లటి మేఘాలను తలపిస్తూ, ఆ మేఘాలే ఆమె భుజాలపై వాలినట్టు భ్రమ కలిగిస్తున్నాయతనకి. ఆమె కనులు మధువు నిండిన పాత్రల్లా కైపు కలిగిస్తున్నాయి. మొత్తానికి ఆమె ప్రేమ అనే మత్తు కలిగించే మధువులా ఉందట.

చెహరా అంటే ముఖం. ఝీల్ అంటే సరస్సు. కవఁల్ అంటే కమలం. సాజ్ అంటే వాయిద్యం. ఛేడ్‌నా అంటే పలికించటం, గజల్ అనేది సంగీతంలో ఒక ప్రక్రియ. జాన్-ఎ-బహార్ అంటే వసంతానికే ప్రాణం వంటిదని. షాయర్ అంటే కవి. ఖ్వాబ్ అంటే కల.

**'ముఖమే తోచే సరస్సున నవ్వే కమలమై**
**జీవనతంత్రులపై పలికించిన గేయమై**
**వసంతరాణి, కవుల కనే కల నీవెలే'**

ఆమె ముఖం సరసున విరిసే కమలంలా సుందరంగా ఉందట. జీవితంలోని ఆహ్లాదమంతా ఆమె ముఖంలో మూర్తీభవించింది. ఇక్కడ ఆహ్లాదానికి సంగీతాన్ని ఎంచుకున్నారు. ఆమె వసంతానికే రాణి, కవుల స్వప్నసుందరి.

హోంఠ్ అంటే పెదవులు. తబస్సుమ్ అంటే చిరునవ్వు. బిజ్‌లియాఁ అంటే మెరుపులు. సజ్‌దే అంటే మోకరిల్లటం. రాహ్ అంటే దారి. కహ్‌కషాఁ అంటే పాలపుంత. దునియా-ఎ-హుస్న్-ఒ-ఇష్క్ అంటే సౌందర్యం, ప్రేమ నిండిన లోకమని. షబాబ్ అంటే ఆయువుపట్టు అనవచ్చు.

**'పెదవులపై ఆడేను నవ్వుల మెరుపులే**
**నీ దారులలో మోకరిల్లె పాలపుంతలే**
**సౌందర్యానికి ప్రేమకి రాణి నీవెలే'**

ఆమె పెదవులపై మెరిసే నవ్వు, మెరుపులను తలపిస్తుందట. పాలపుంతలు ఆమె దారులలో పరచుకుంటాయట. సౌందర్య జగత్తుకి ఆమె ఆయువుపట్టు లాంటిదట.

ప్రకృతిలోను, విశ్వం లోను ఉన్న విశేషాలన్నిటితో ఆమెను పోలుస్తూ ఆమె సౌందర్యాన్ని వర్ణించారీ పాటలో. ఆమె కురులు మేఘాలు, కళ్ళలో అమృతం-అంటే స్వర్గం, ముఖం పద్మమంత అందమైనది, సంగీతమంత కమ్మనిది, పెదవులపై మెరుపులు, పాదాల వద్ద ఏకంగా పాలపుంతలే.

'మదనకామరాజు కథ' లో ఈ గీతం ఆధారంగా ఓ పాటను జి.కృష్ణమూర్తి రచించగా రాజన్-నాగేంద్ర స్వరపరిచారు. పి.బి.శ్రీనివాస్ పాడిన ఆ పాట:

**నీలి మేఘమాలవో**
**నీలాల తారవో**
**నీ సోయగాలతో మదినీ దోచిపోదువో** ॥నీలి మేఘ॥
**నీ మోములోన జాబిలీ దోబూచు లాడెనే**

నీ కురులు తేలి గాలిలో ఉయ్యాలలూగెనే
నిదురించు వలపు మేల్కొలిపీ దాగిపోదువో ॥నీలి మేఘ॥
నీ కెంపు పెదవి తీయనీ కమనీయ కావ్యమే
నీ వలపు తనివి తీరని మధురాల రావమే
నిలచేవదేల నా పిలుపు ఆలకించవో ॥నీలి మేఘ॥
రాదేల జాలి ఓ చెలీ యీ మౌనమేల నే
రాగాల తెలిపోదమే జాగేల చాలునే
రావే యుగాల ప్రేయసీ నన్నాదరించవో ॥నీలి మేఘ॥

హిందీ పాటలో సూర్యుడితో పోలిస్తే ఇక్కడ నీలాల తారతో పోల్చారు. నీలి మేఘమాలతో పోల్చారు కాబట్టి జాబిల్లి ఆమె మోములో దోబూచులాడుతుందని వర్ణించారు. హిందీ పాటలో మేఘాల వంటి కేశాల మధ్య ఉన్న నిండు చందమామ అన్నారు. కురులు, పెదవి, రాగం(సంగీతం) ప్రస్తావన తెలుగులో కూడా ఉంది. తెలుగు పాటలో కురవని మేఘంలా తనపై ఇంకా దయ చూపని ప్రేయసికి చేసే వేడుకోలు కూడా ఉంది. హిందీలో నాయకుడు పొగిడేది తన భార్య అందాలనే.



హిందీలో ముఖ్యంగా ఆమె సౌందర్యాన్నే పొగిడారు. తెలుగులో 'యుగాల ప్రేయసి' అని వారి బంధాన్ని కూడా వర్ణించారు.

తెలుగులో సోలో పాటే కాక యుగళగీతం కూడా ఉంది. హిందీపాట ఎంతగా నచ్చి, నమ్మకం కుదరకపోతే అదే ట్యూన్‌కి ఒకే చిత్రంలో రెండు పాటలు పెడతారు! ఆ రెండో పాట ఇదీ:

గానం : పి.సుశీల, పి.బి.శ్రీనివాస్ రచన : జి. కృష్ణమూర్తి

అ: నీలి మేఘమాలవో నీలాల తారవో
నీ సోయగాలతో మదినీ దోచి పోదువో
ఆ: నీలి మేఘమాలనో నీలాల తారనో
నా సోయగాలతో - మదినీ దోచి పోదునో
అ: నీరాక కోసమే చెలి నే వేచియుంటినే
ఆ: ఆరాటమేలనో ప్రియా నేచెంత నుంటినే
ఇ: ఆనంద మధుర గీతములా ఆలపింతమా ॥నీలిమేఘ॥
ఆ: చివురించు వలపు తీవెల - విరిపూలు పూయగా
అ: చిరునవ్వు విరుపులోపల - హరివిల్లు విరియగా
అ:ఆ: నెలవంక నావలోన మనమూ కలసి పోదమా ॥నీలి మేఘ॥
ఆ: మనలోన కలత మాయమై మన ఆశ తీరెగా
అ: అనురాగ రాగమే యిక మనరాగమాయెగా
అ:ఆ: మనసార ప్రేమ మాధురులా సాగిపోదమా ॥నీలి మేఘ॥

- పి.వి.సత్యనారాయణ రాజు

## 'హాసం' ఆడియో క్లబ్ డేటా బేస్

సంస్థ పేరు : L.I.C. ఎంప్లాయిస్ ఫైన్ ఆర్ట్స్ అసోసియేషన్, సైఫాబాద్, హైదరాబాద్. స్థాపించినసంవత్సరం: 1974

ఉద్దేశ్యము : కల్చరల్ ప్రోగ్రామ్స్, మిమిక్రీ, సిని సంగీత పాటలు నిర్వహించటం సభ్యుల సంఖ్య : 400

అడ్రసు : వి. సుబ్రహ్మణ్యం, ఇ.నెం.10-73/2, గోఖలే నగర్, రామంతపూర్ కాలనీ,
హైదరాబాద్ .పిన్ కోడ్ నెం : 500 013.

కార్యాలయం ఫోన్ నెంబర్, ఈ మెయిల్ : 040 27032816

కార్యనిర్వాహక సభ్యులు
1. వి. సుబ్రహ్మణ్యం ☎ 040 27032816
2. సి.హెచ్. అనంత్ పి. రావు ☎
3. ఆర్. శ్రీధర్ ☎

సంప్రదించవలసిన వ్యక్తి, (ఫోన్ నెంబరుతో సహా) : వి.సుబ్రహ్మణ్యం, ☎ 040 27032816 తేదీ: 27-01-2003

# ఉత్తరాది సంగీత దర్శకుడు రవి హిట్స్

**చిత్రం: వచన్** గానం: ఆశాభోంస్లే

చందమామా దూర్ కే కుయె పకాయే బూర్ కే
ప్యాలీ గయిా టూట్ మున్నా గయా రూర్ ॥2॥
లాయేంగే నయే ప్యాలియా బజా బజా కే తాలియా ॥2॥
మున్నే కో మనాయేంగే హమ్ దూధ్ మలాయీ ఖాయేంగే
చందమామా దూర్ కే కుయె పకాయే బూర్ కే
అప్ ఖాయే థాలీ మే మున్నేకోదే ప్యాలీమే ॥చంద॥
ఉడన్ కటోలే బేటకే మున్నా చందాకే ఘర్ జాయేగా ॥2॥
తారోంకే సంగ్ అంఖ్‌మిచోలీ ఖేల్ కే దిల్ బెహలాయేగా
ఖేల్ ఖూద్ సే జబ్ మేరే మున్నేకా దిల్ భర్‌జాయేగా
ఠుమ్మక్ ఠుమ్మక్ మేరా మున్నా వాపిస్ ఘర్ కో ఆయేగా
చందమామా దూర్ కే కుయె పకాయే బూర్ కే

అతి ప్రజాదరణ పొందిన బాలగీతం ఇది. తెలుగులో ఈ ట్యూన్‌తో వచ్చిన 'అన్నా అన్నా విన్నావా, చిన్ని కృష్ణుడు వచ్చాడు' (ఇలవేలుపు) పాట కూడా బాగా హిట్ అయింది.

**చిత్రం: హమ్ రాజ్**

రచన: సాహిర్ లూధియాన్వి గానం: మహేంద్ర కపూర్

నీలే గగన్ కే తలే, ధర్తీ కా ప్యార్ పలే
ఐసే హీ జగ్ మేఁ ఆతీ హైఁ సుబహేఁ,
ఐసే హీ శామ్ ఢలే ॥నీలే॥
శబ్‌నమ్ కే మోతీ ఫూలోఁ పే బిఖరే,
దోనోఁ కీ ఆస్ ఫలే ॥నీలే॥
బల్‌ఖాతీ బేలేఁ మస్తీ మేఁ ఖేలేఁ
పేడోఁ సే మిల్ కే గలే ॥నీలే॥
నదియా కా పానీ దరియా సే మిల్ కే,
సాగర్ కీ ఓర్ చలే ॥నీలే॥

బి.ఆర్.చోప్డా తన సినిమాలకు రవినే సంగీతదర్శకుడిగా పెట్టుకునేవాడు. సాహిర్ వంటి ప్రతిభావంతుడైన కవి రాసే గేయానికి తులతూగేలా బాణీలు కూర్చి 'భేష్' అనిపించుకోవడం రవి ప్రత్యేకత. ఈ పాటకు అతి సులభమయిన ట్యూన్ ఇచ్చి అందరూ పాడుకునేలే చేయగలిగాడు.

**చిత్రం: గుమ్‌రాహ్**

రచన: సాహిర్ లూధియాన్వి గానం: మహేంద్రకపూర్

చలో ఇక్ బార్ ఫిర్ సే అజ్‌నబీ బన్ జాయేఁ హమ్ దోనోఁ
న మైఁ తుమ్‌సే కోయీ ఉమ్మీద్ రఖూఁ దిల్ నవాజీ కీ
న తుమ్ మేరీ తరఫ్ దేఖో గలత్ అందాజ్ నజరోఁ సే
న మేరే దిల్ కీ ధడ్‌కన్ లడఖడాయే మేరీ బాతోఁ సే
నా జాహిర్ హో తుమ్హారీ కశ్‌మకశ్ కా రాజ్ నజరోఁ సే ॥చలో॥
తుమ్హే భీ కోయీ ఉల్‌ఝన్ రోక్‌తీ హై పేష్‌కదమీఁ సే
ముఝే భీ లోగ్ కహతే హై కి యే జల్‌వే పరాయే హైఁ
మేరే హమ్‌రాహ్ భీ రుస్‌వాయియాఁ హైఁ మేరే మర్‌జీకీ
తుమ్‌హారే సాథ్ భీ గుజ్‌రీ హుయీ రాతోఁ కే సాయే హైఁ
తఆరుఫ్ రోగ్ హో జాయే తో ఉస్‌కో భూల్‌నా బెహ్‌తార్ ॥చలో॥
తఅల్లుక్ బోఝ్ బన్ జాయె తో ఉస్‌కో తోడ్‌నా అచ్ఛా
వో అఫ్‌సానా జిసే అన్‌జామ్ తక్ లానా న హో ముమ్‌కిన్
ఉసే ఇక్ ఖూబ్‌సూరత్ మోడ్ దేకర్ తోడ్‌నా అచ్ఛా ॥చలో॥

సాహిర్ ప్రైవేటుగా రాసుకున్న 'ఖూబ్‌సూరత్ మోడ్' అనే గేయాన్ని సినిమాకై వాడుకున్నారు. సాహిత్యపరంగా చాలా గొప్పదైన ఈ పాట రవి అభిమాన గాయకుడు మహేంద్రకపూర్ కెరియర్‌లోనే ఓ ఆణిముత్యం.

**చిత్రం: సరిగమలు**

రచన: వేటూరి గానం: కె.జె. ఏసుదాసు

ప్రవాహమే గంగా ప్రవాహమే
స్వరరాగ గంగా ప్రవాహమే అంగాత్మ సంధాన యోగమే
ప్రొష్టే ఘనంతేతికాలికే పలికే కుహు గీతికా
గాన సరసీరుహ మాలికా ॥స్వరరాగ॥
గమపని ॥4॥ మపనిస ॥4॥
పనిసగ గససని సనిపమ పమగమపా
కుండలలోపల నిండిన నింగిలో ఉరిమెను మేఘం ఇన్నాళ్లకి
పిల్లన గ్రోవిలో పిలవని మోవిలో కురిసెను రాగం ఈనాటికి
మట్టింటి రాయే మాణిక్యమైపోయే సంగీత రత్నాకరా
స్వర సప్తకాలే కెరటాలు కాగా ఆ గంగ పొంగింది లోనా ॥స్వర రాగ॥
పని పని గస గస గస గస మగ మగ మగ మగ పమ పమ
నిస నిప సని సని గా.....అ.....
చైతన్య వర్ణాల ఈ చక్ర సుమ వీథి
వినిపించు రాగాలనంతాలులే
ఈ చక్రవాకాలు ఎగిరే చకోరాలు
జగమంతా విహరించు రాగాలులే
పిలిచే శకుంతాలు పలికే దిగంతాలు
పులకింతలా పుష్యరాగాలులే
మలి సంధ్య దీపాలు గుడి గంట నాదాలు
మౌనాక్షరీ గాన వేదాలులే ॥స్వర॥

రవి సంగీతం సమకూర్చిన ఏకైక తెలుగు సినిమా 'సరిగమలు'. జన్మతః పంజాబీవాడైన రవి తెలుగుసంగీతం ఇంత నేటివ్ టచ్‌తో ఇవ్వడం తెలుగువారినే ఆశ్చర్యపరిచింది.

**చిత్రం: వక్త్**

రచన: సాహిర్ లూధియాన్వి గానం: ఆశా భోంస్లే

ఆగే భీ జానే న తూ
పీఛే భీ జానే న తూ
జో భీ హై బస్ యహీ ఇక్ పల్ హై
అన్‌జానే సాయోఁ కా రాహోఁ మేఁ డేరాహై
అన్‌దేఖీ బాహోఁ నే హమ్ సబ్‌కో ఘేరా హై
యహ్ పల్ ఉజాలా హై బాకీ అంధేరా హై
యహ్ పల్ గఁవానా న యహ్ పల్ హీ తేరా హై
జీనే వాలే సోచ్ లే యహీ వక్త్ హై, కర్ లే పూరీ ఆర్జూ ॥ఆగే॥
ఇస్ పల్ కే జల్‌వోఁ పే మెహ్‌ఫిల్ సఁవారీ హై
ఇస్ పల్ కీ గర్‌మీ నే ధడ్‌కన్ ఉభారీ హై
ఇస్‌పల్ కే హోనే సే దునియా హమారీ హై
యహ్ పల్ జో దేఖో తో సదియోఁ పే భారీ హై
జీనే వాలే సోచ్ లే యహీ వక్త్ హై, కర్ లే పూరీ ఆర్జూ ॥ఆగే॥
ఇస్ పల్ కే సాయే మేఁ అప్‌నా ఠికానా హై
ఇస్ పల్ కే ఆగే కీ హర్ శయ్ ఫసానా హై
కల్ కిస్ నే దేఖా హై, కల్ కిస్‌నే జానా హై
ఇస్ పల్ సే పాయేగా జో తుఝ్‌కో పానా హై
జీనే వాలే సోచ్ లే యహీ వక్త్ హై, కర్ లే పూరీ ఆర్జూ ॥ఆగే॥

రవి అభిమాన గాయకురాలు ఆశా పాడిన ఈ పాట తెలుగులో 'కలలే కన్నానురా' (అసాధ్యుడు) కు వాడుకున్నారు. తర్వాత 'వక్త్'ని భలే అబ్బాయిలు గా రీమేక్‌చేసినప్పుడు 'ఏమౌనో ఈ వేళలో' గా మళ్లీ దర్శనమిచ్చింది పాట.



# స్వర్గంలో కుదిరే పెళ్లి

- ఎమ్బీయస్ ప్రసాద్

శుక్రవారం ఉదయం నుండి రాజా ఖంగారుగా ఉన్నాడు. అవాళ సావిత్రిని కలవమని వాళ్ల మావయ్య ద్వారా కబురుపెట్టడమంటే కబురుపెట్టాడు కానీ ఆమెన ఎక్కడకి రమ్మన్నాడో మర్చిపోయాడు. పబ్లిక్‌గార్డెన్సా? ఇందిరా పార్కా? సంజీవయ్య పార్కా? 'పాడు మతిమరుపు' తిట్టుకున్నాడు రాజా. ఈ మతిమరుపు గురించి మాట్లాడాలనే కదా సావిత్రిని రమ్మన్నది. తీరా చేసి ఆమెను కలవకపోతే ఎలా?

సావిత్రి అతనికి కాబోయే భార్య. పెళ్లిచూపుల్లో చూడగానే నచ్చింది. రూపురేఖల్లోనే కాదు. సమర్థవంతురాల్లా అనిపించింది. అందుకే అన్న పెళ్లికి ముందే మంచీ చెడ్డా మాట్లాడాలని అవసరం అనిపించింది. కానీ మాట్లాడడం ఎలా? ఎక్కడ కలవాలో మర్చిపోయాడే!

సాధారణంగా ఇలా మర్చిపోతాననుకున్నవన్నీ ఒక కాగితం మీద రాసి పెట్టుకుంటాడు. అది ఎక్కడ పెట్టాడు చెప్మా? చొక్కా జేబులో వెతికాడు. లేదు. అది రాసిపెట్టుకున్ననాడు వేసుకున్న చొక్కా ఏదా అని ఆలోచించాడు. గుర్తురాలేదు. పోనీ ప్యాంటు? తలవిదిలించుకున్నా అదీ గుర్తుకు రాలేదు.

తనకు మతిమరుపు ఎక్కువన్న మాట రాజా ఒప్పుకుంటాడు. 'నేను ముందు పుట్టానో, మతి మరుపు ముందు పుట్టిందో అని ఓసారి పందెం వేసుకున్నాం కూడా. కానీ రిజల్టు సంగతి అడక్కండి - మర్చిపోయేను. అసలు నేను పుట్టినప్పుడు మంత్రసాని గురించి మా అన్నయ్యను పంపిస్తే వాడు ఆ విషయం మరచిపోయి మేట్నీ సినిమాకు వెళ్లిపోయేట్ట. తరువాత మరొకరెవరో వెళ్తే, మా ఇంటి అడ్రసు మరిచిపోయి మంత్రసాని మరోళ్ళింటికి వెళ్లిందట' అంటూంటాడు.

ఇటువంటి మతిమరుపు ఉగ్గుపాలతో పెరిగిన అతనికి 'ఆబ్సెంట్ మైండెడ్‌నెస్' సహజంగా వచ్చేసింది. ఎలిమెంటరీ స్కూలు దగ్గర్నుంచీ అటెండెన్స్ వేసేటప్పుడు పక్కవాడు గుర్తు చేస్తే తప్ప 'ప్రెజెంట్ సార్' అనేవాడు కాదు. హోమ్ వర్క్ చేయడం మరిచిపోవడం వల్లా, ఓ రోజు టైమ్ టేబుల్ పుస్తకాలు మరో రోజు తీసి కెళ్లడం వల్లా, ఎన్నిసార్లు దెబ్బలు తిన్నాడో లెక్కలేదు. పైగా మేష్టారు బయట కనబడితే గుర్తు పట్టలేక 'విష్' చేయకపోవడమూ, వాళ్ళ ఆగ్రహానికి గురికావడమూ జరిగేది.

కొన్ని సందర్భాల్లో ఈ మతిమరుపు మరీ ఏడిపించేది. ముఖ్యంగా సైకిల్ బయటపెట్టి హోటల్‌కైనా, సినిమాకైనా, ఎవరింటికైనా వెళ్ళినప్పుడు తాళం చెవి చేతిలో పట్టుకున్నట్టు ముందు గుర్తుండేది కానీ, తరువాత అది అస్సలు కనబడేది కాదు. సీటు కిందా, పక్క - కుర్చీ మీదా, డబ్బులు తీయవలసిన

అవసరం పడిన ప్రతీ చోటా వెతికితే ఓ పావు గంటకు దొరికేది. బయట కెళ్లేసరికి రెండో పరీక్ష కాచుకొని ఉండేది. సైకిలు గుర్తుపట్టడం ఎలా? అన్నీ ఒకలాగే కనబడేవి. ఎక్కడ పెట్టాడో గుర్తుండేది కాదు. కాస్సేపు అటూ ఇటూ తచ్చాడి, ఓ సైకిలు ఎంచుకొని, తాళం చెవి తిరగేసి పెట్టి కుస్తీ పడుతూంటే స్టాండ్‌వాడు అనుమానంగా చూస్తూ ఉంటే...వివరాలు ఎందుకు? ఇలాటివి ఎన్నో.

'అబ్సెంట్ మైండెడ్ ప్రొఫెసర్' అని చిన్నప్పట్నుంచి అందరూ అనడంతో అటువంటి వాళ్లందరికీ టీచరుద్యోగమే బెస్టు అన్న అభిప్రాయానికి వచ్చాడు రాజా. ఏ బ్యాంక్‌లోనో అయితే మూడో రోజుకి ఇంటికెళ్లిపోవాలి. అయినా ఇంటి కెళ్ళనిస్తారో, లేదా తక్కువైన డబ్బు కట్టేదాకా జైలుకెళ్ళమంటారో!.

టీచరు ఉద్యోగంలో కూడా తిప్పలు లేకపోలేదు. ఓ క్లాసుకి బదులు మరొక క్లాసుకి వెళ్ళకుండా చూసుకోవడం, ఓ పాఠానికి బదులు మరొకటి చెప్పకుండా ఉండడం, ఓ సబ్జక్టులో పరీక్ష పెడతానని చెప్పి మరొక దాంట్లో పెట్టకుండా జాగ్రత్త పడడం - ఎంత కష్టపడినా, కాగితం మీద రాసి పెట్టుకొని గుర్తు పెట్టుకోజూసినా స్కూల్లో చేరిన ఆర్నెల్లలోనే రాజాకు 'మతి మరుపు మాధవయ్య మేస్టారు' నిక్‌నేమ్ వచ్చేసింది.

ఇంట్లో వాళ్లంతా ఇలాటివాడు ఎలా బతుక్కొస్తాడో అని అతని ముందే బెంగపడుతూండడంతో అతనికి దిగులు పట్టుకొంది. రేపు సంసారం ఏర్పడ్డాక ఎలాగాని. కూరలు, సరుకులూ తెచ్చేటప్పుడు కొట్టువాడికి ఎక్కువ డబ్బులిచ్చేయడమూ, బస్ కండక్టరు నుండి, ఆటోవాడి నుండి చిల్లర పుచ్చుకోవడం మర్చిపోవడమూ లాంటివి చేసి కొంప గుండం చేస్తానని భయం వేస్తూండేది.

కానీ అతనికొక ధైర్యం - స్వర్గంలో పెళ్ళిళ్ల చేసేటప్పుడు దేవుడు సరైన జోడీలు కుదురుస్తాడంటారు. జంటలను బాలెన్స్ చేయడం అక్కడే జరుతుందట. అందుకే లోకం సజావుగా సాగుతోందట. అతివృష్టి, అనావృష్టి లేకుండా, పిసినారి వాడికి ఖర్చుదారి పెళ్లాన్నీ, తెలివి తక్కువ అమ్మాయికి తెలివైన మొగుడినీ కుదిర్చి ఇంచు మించు అందరూ సమానంగా ఉండేటట్లు చూస్తాడట. తనలో ఉన్న మతిమరుపు లోటు భర్తీ చేయడం దేవుడి బాధ్యతే కాబట్టి దానిని కాంపెన్సేట్ చేసే తగిన భార్యని ఆయనే కుదురుస్తాడని అతనికి గట్టి నమ్మకం ఉండేది.

సావిత్రిని చూడగానే అతనికా నమ్మకం బలపడింది పెళ్లి చూపుల్లోనే! తక్కిన విషయాలు ఇంట్లోవాళ్లకి నచ్చేయి కాబట్టి సంబంధం త్వరగా కుదిరిపోయింది. పెళ్లి నెల రోజులుందనగా అతన్నొక ఆలోచన తొలిచి వేయసాగింది- 'భార్య భర్తల మధ్య మంచి అవగాహన ఉండాలంటే అర మరికలు లేకుండా ఒకరి లోపాలు ఒకరికి చెప్పుకోవాలి కదా! మరి నా ఈ మతిమరుపు లక్షణం ముందుగానే చెప్పడం భావ్యం, అవసరం కూడా. రేపు పెళ్ళయ్యేక ఆమె పుట్టినరోజు మర్చిపోవచ్చు. సినిమాకు తీసుకెళతానని చెప్పి మరిచిపోయి ఇంటికి ఆలస్యంగా రావొచ్చు. పుట్టింటి నుండి తిరిగి వచ్చినప్పుడు రిసీవ్ చేసుకోవడం గుర్తురాకపోవచ్చు. తననుకొని ఇంటిపక్కావిడతో సరసమాడబోవచ్చు- ఇవన్నీ మనస్పర్థలకు దారి తీస్తే? తీస్తాయి. అందుకని మన అవలక్షణం ముందుగానే చెప్పుకుంటే మంచిది' అని ఆలోచించి సావిత్రి మావయ్య ద్వారా ఆమెకు కబురు పెట్టాడు - శుక్రవారం ఉదయం తొమ్మిది గంటలకు పబ్లిక్ గార్డెన్స్‌లో కలవమని. ఆ విషయమే మరిచాడు.

* * *

తనను తాను తిట్టుకుని ఇందిరాపార్కు, సంజీవయ్యపార్కు, బ్రహ్మానందరెడ్డి పార్కు తిరిగి రాజా పబ్లిక్ గార్డెన్స్‌కి వచ్చేసరికి పది దాటింది. కనుచూపు మేరలో సావిత్రి కానరాలేదు. వేచి చూసి విసిగి వెళ్ళిపోయుంటుందేమో ననుకున్నాడు. ఓ అరగంట అక్కడే తచ్చాడి, దగ్గర్లో ఉన్న ఆమె ఆఫీసుకి వెళ్లాడు.

సీటు దగ్గరకెళ్ళి పలకరింపుగా నవ్వినా ఆమె తిరిగి నవ్వలేదు. 'హలో' అన్నా కళ్ళెగరేసింది. కానీ పలకరించలేదు. 'యస్' అంది సీరియస్‌గా, తప్పు తనది కాబట్టి, 'అయాంసారీ, లేటయింది' కారణాలు క్రమేణా నీకు అర్థమవుతాయి..." అని మొదలుపెట్టాడు.

'మీరెవరు? ఏం మాట్లాడు తున్నారో నాకేం తెలియటం లేదు' అంది.

ఎంత అలక మీద ఉన్నా మరీ ఇంత ఇదిగా మాట్లాడుతుందేమాని, అభిమానం పొడుచుకొచ్చి, పళ్ళు గిట్టకరిచి, "నేను మీకు గుర్తులేనేమో, నాపేరు ఫలానా' అని పూర్తిపేరు, ఇంటిపేరుతో సహా వల్లించి మొహంలోకి తీక్షణంగా చూసాడు.

ఆశ్చర్యం! ఆమెలో ఏ రియాక్షనూ లేదు- కనుబొమలు ముడివేసి 'సోవాట్?' అన్నట్టు చూస్తోంది.

అతనికి ఏం చెయ్యాలో పాలుపోలేదు. పక్క సీటు వాళ్ళు అప్పటికే వింతగా చూస్తున్నారు. రాజా చటుక్కున తలవంచి దగ్గరగా చేరి "సావిత్రి గారూ, మనం వచ్చే నెల పెళ్లి చేసుకోబోతున్నాం" అన్నాడు.

అప్పుడు చూసాడు - ఆమె ముఖంలో వెలుగు, సంతోషం, సిగ్గూ - అన్నీ కలగలిపి గత్తర బిత్తర అయిపోయింది. మాటలు కలగాపులగం అయిపోయాయి.

"అయాం సారీ, కూర్చోండి... పెళ్లి చూపుల్లో చూసేనే కానీ మీ ముఖం గుర్తు పట్టలేకపోయాను. మీ వాళ్లు నా ఫోటో తీసుకున్నారు కానీ, మీది ఇచ్చారు కారు. అదేమిటో పేరు చెప్పినా తట్టలేదు, మట్టి బుర్రని. ఎంతసేపూ చిక్కడపల్లి పెళ్లికొడుకు అని అనడమే కానీ పేరూ, అదీ...ఛ ఛ... అయాం సారీ అండి. కూర్చోండి. ఏం తీసుకుంటారు?"

"అది సరే, మీ మామయ్యగారు ఏమీ చెప్పలేదా?...నేను మీతో ప్రైవేటుగా మాట్లాడాలని..." అన్నాడు రాజా కుర్చీలో కూర్చుంటూ.

"చెప్పాడండీ...కానీ మర్చిపోయేను. ఇప్పుడు మిమ్మల్ని చూస్తే గుర్తుకొచ్చింది. అయినా అది ఫ్రైడే నాడు కదా, ఇవాళ ఇంకా శుక్రవారమేను. కలుద్దామండి, తప్పకుండా కలుద్దాం. నేనూ మీతో చాలా విషయాలు దాపరికం లేకుండా మాట్లాడాలి. ముఖ్యంగా నాకున్న ఈ మతిమరుపు రోగం గురించి..."

* * *

'భగవంతుడా! ఇది స్వర్గంలో కుదిరిన పెళ్లేనా!" అని వాపోయాడు రాజా. ■






తెలుగు సినీ పరిశ్రమకి అనువాద చిత్రాలు రావటమనే ప్రక్రియ ఎప్పటి నుంచో వుంది. తమిళ, కన్నడ, హిందీ, మలయాళ, ఆంగ్ల చిత్రాలెన్నో తెలుగులో డబ్ చేయబడ్డాయి. వాటిలో చాలా వరకు ఘనవిజయం సాధించినవీ వున్నాయి. ఘోరపరాజయం పొందినవీ వున్నాయి. ఒరిజినల్‌లో ఫెయిల్ అయినా - డబ్ చేసిన తెలుగు వెర్షన్‌లు ఆంధ్రరాష్ట్రంలో హిట్ అయిన సంఘటనలు కూడా వున్నాయి. ఇవాళ్టికీ శ్రోతల హృదయాలలో నిలిచిపోయిన డబ్బింగ్ పాటలెన్నో వున్నాయి. తెలుగు భాషకు అనుగుణంగా లిప్ మూమెంట్‌నిస్తూ కేవలం పాటల పోర్షన్ వరకు ప్రత్యేకంగా షూట్‌చేసిన సందర్భాలు లేకపోలేదు. వాటిని 'సెమీ డబ్బింగ్'గా అనుకోవచ్చు. ఈ నేపథ్యంలో చిత్రంలో ఉన్న 9 పాటలూ హిట్ అయి నేటికీ ప్రేక్షకుల హృదయాలలో సజీవంగా వున్న ఒక చిత్రం గురించి ప్రస్థావించక తప్పదు. అదే రాజ్ కపూర్ నిర్మించిన

# ప్రేమలేఖలు

ఈ చిత్రం 1953లో విడుదలయింది. రాజ్‌కపూర్, నర్గీస్, ప్రాణ్, విజయలక్ష్మి ముఖ్యతారాగణం. హిందీలో 'ఆహ్'గా, తెలుగులో 'ప్రేమలేఖలు'గా, తమిళంలో 'అవన్'గా మూడు భాషలలో ఏకకాలంలో నిర్మించారు. లిప్‌మూమెంట్స్ అవసరంలేని షాట్‌లను మూడు భాషలకూ కామన్‌గా వుంచుకుని మిగిలిన చిత్రంలో ఏ భాషకు కావలసిన భాగాన్ని ఆ భాషలో పాటలతో సహా చిత్రీకరించారు. తెలుగు వెర్షన్‌కి మాటలూ-పాటలూ ఆరుద్ర రాశారు. శంకర్-జైకిషన్ స్వరపరచగా తెలుగునాట ఆ చిత్రానికి అఖండవిజయాన్ని చేకూర్చిపెట్టిన ఆ తొమ్మిది పాటలూ ఇవి.

నీవెవ్వరవో చిరునవ్వులతో
నీ రూపు నను మంత్రించే
మది పొంగి పొంగి పులకించె
మది పొంగి పొంగి పులకించె ॥నీవెవ్వరవో॥
కనుమూసిన తెరచిన నీ రూపే ॥2॥
నా కన్నుల ముందర కనిపించె ॥2॥
ఎల కోరికలేవో కుసుమించి
నా దేహమే వికసించే
మది పొంగి పొంగి పులకించే ॥2॥ ॥నీవెవ్వరవో॥
ప్రియురాలిని మొదటే తెలుసుకొని ॥2॥
నేనామె రహస్యం కనుగొంటే ॥2॥ - నే
నెందుకు బయటకు చెప్పాలి? -
తను దూరమై మురిపించే - ప్రతిరోజు రోజు వేధించె
ప్రతిరోజు రోజు వేధించె
నిను చూడకనే ప్రేమించితినే ॥2॥
మరి కనుగొనినా నే లోబడనా ॥2॥
నా మానస చోరా - నీ తలపే
ఈ లోకమే మరిపించె
మది పొంగి పొంగి పులకించె ॥2॥ ॥నీవెవ్వరవో॥







ఈ పాటను జిక్కి, ఏయమ్.రాజా పాడగా నర్గీస్, రాజ్‌కపూర్‌పై చిత్రీకరించారు. శబ్దం ఆయువుపట్లు ఆరుద్రకు బాగా తెలుసు. అందుకే (అర్థంతో సంబంధం లేకపోయినా) 'మేరా అంగ్ అంగ్ ముస్ కాయా' అనే హిందీలైన్‌కి పేర్లల్‌గా 'మది పొంగి పొంగి పులకించె' వంటి వాక్యాలను రాయటం జరిగింది. డ్రమ్ములో కూర్చున్న రాజ్‌కపూర్, పక్కనే దుప్పటికప్పుకున్న నర్గీస్ పాడుకునే ఈ పాట ట్యూన్‌పరంగా ఎంత హిట్ అయిందో చిత్రీకరణపరంగా కూడా అంతే హిట్ అయింది. 'సప్నోం కా సౌదాగర్' సినిమాలో హేమామాలిని, రాజ్‌కపూర్‌తో ఇటువంటి సన్నివేశమే చిత్రీకరించటం, మన తెలుగు సినిమా 'పిల్లా-పిడుగా'లో కూడా రామకృష్ణ, జ్యోతిలక్ష్మితో ఇలాటి సీనే ప్లాన్ చెయ్యటం ఇవన్నీ అందుకు ఉదాహరణలు.

ఘల్లు ఘల్లు ఘల్లు ఘల్లు గజ్జెల సంగీతం
మువ్వల చిందు హుషారు పసందు - వినే చెవి విందు ॥ఘల్లు॥
ఓ...చందురుని మోమందు
బంధించి వేస్తే...బంధించి వేస్తే...
ఓ...తారకల కోరికల
తలంబ్రాలు పోసే...తలంబ్రాలు పోసే
తరుణి మిసిమించెను - వరుడు హసియించెను
వంపుల లేవి, కెంపుల మోవి ఇంపగు జోడీ ॥ఘల్లు॥
ఓ...మనసు మనసు కలియంగ
మనువు నిజమాయె...మనువు నిజమాయె...
ఓ...వడిదుడుకులు నిలబడితే
వలపు ఋజువాయె...వలపు ఋజువాయె...
మింటి గిలిగింతకె - భూమి పులకింతలే
తెరలు తొలంగి మరులు చెలంగి కులుకులు పొంగి ॥ఘల్లు॥
ఓ...వగలే సిరి నగలైతే
వలపంతా పండె...వలపంతా పండె
ఓ...హోయి హోయి సన్నాయి
రేయంత నిండె...రేయంత నిండె
సాగెనూరేగింపు చేయి చేయీ కలుపు
మసక చీకటిలో మల్లెపందిటిలో



















జిక్కి, బృందం పాడిన ఈ పాటను రాజ్‌కపూర్, నర్గీస్ ముఖ్యపాత్రధారులై ఓ నృత్యం చూస్తుంటే ఆ నట్టువరాళ్ళు అభినయించిన నృత్యగీతంగా చిత్రీకరించారు. ఈ పాట ఆ రోజుల్లో ఎంతగా హిట్ అయిందో చెప్పటానికి ఈ రోజుల్లో లాగ ప్లాటినమ్ డిస్క్‌లు, గోల్డెన్ డిస్క్‌లు లేవు. ఇది శంకర్-జైకిషన్‌ల బ్రాండ్ సాంగ్. ఇలాంటి పాటలు వారి సంగీత దర్శకత్వంలో... ముఖ్యంగా రాజ్‌కపూర్ సినిమాలలో ఎక్కువగా వినిపిస్తాయి. కావాలంటే 'రామయా వస్తావయా' (శ్రీ 420) అనే పాటను, ఈ 'ఘల్లు ఘల్లు' పాటను ఒకదాని వెంబడి మరొకటి సమాంతరంగా పాడుకొని చూడండి. ఒకే పేగు తెంచుకుని పుట్టిన పిల్లల్లాగ అనిపిస్తాయి. మువ్వల చిందు-హుషారు పసందు-వినే చెవి విందు/మిసిమించెను-హసియించెను వంటి ప్రయోగాలు శబ్దంపై పట్టుతో పాటు, ఆరుద్రకు గల అంత్యప్రాసలు అలవోకగా వేసే తత్వాన్ని; మింటి గిలిగింతకె భూమి పులకింతలె వంటి వాక్యాలు ఆ తత్వంతో పాటు వున్న భావుకత్వానికి అద్దం పడతాయి.

నీకు పూర్తిగా తెలుసునుగా ॥2॥
నీ మదిలో ఎంత ప్రేముందో
ఇపుడె యింతగా ప్రేమేలా - నీ
కిపుడే యింతగ ప్రేమేలా? ॥నీకు॥
ముందే ఆలోచించి పలికినా
మాటలు తడబడతాయేలా ॥ముందే॥
అతనికి లోబడి ఆశలలో బడి
జీవిస్తూనే చావేలా
అతనికి లోబడి ఆశలలో బడి
జీవిస్తూనే చావేలా...జీవిస్తూనే చావేలా ॥నీ కిపుడె॥
అంతూ పొంతూ అంటూ లేదా ॥2॥
ఏమిటి నీకీ సింగారం ॥2॥
ఆతని రాకకు ఆత్రుతలేలా (ఆత్రుతలేకా)
ఓ బేలా ముస్తాబేలా
ఆతని రాకకు ఆత్రుతలేలా
ఓ బేలా ముస్తాబేలా...
ఓ బేలా ముస్తాబేలా ॥నీ కిపుడె॥
ఏమిటి మదిలో తీయని బాధ
తీయని బాధా తొలిప్రేమ ॥ఏమిటి॥
బాధ తప్పదని తెలిసినదేగా
వలపుల వలలో పడనేలా
బాధ తప్పదని తెలిసినదేగా
వలపుల వలలో పడనేలా...
వలపుల వలలో పడనేలా ॥నీకు॥










ఈ పాటను జిక్కి పాడగా నర్గీస్‌పై చిత్రీకరించారు. పదే పదే పాడుకోడానికి వీలుగా, హాయిగా వుండే ట్యూన్ ఇది. ముఖ్యంగా- అంతూ పొంతూ అంటూ లేదా -అనే చరణం మిగిలిన చరణాలకు భిన్నంగా వుండి ఎంత బావుంటుందో వర్ణించలేం! మెలోడీ అంటే ఇదీ అని అనిపించేట్టుగా వుంటుందా చరణం!! ఇక ఈ పాట రెండో చరణం మూడోలైనులో 'ఆతని రాకకు ఆత్రుత లేకా' అని పాడడం జరిగింది. ఆరుద్ర పాటలతో వెలువడిన 'వలపుల కథకిది తొలిపలుకు' పుస్తకంలో 'ఆత్రుతలేలా' అని ప్రింటయివుంది. ప్రాసపరంగా చూసుకుంటే 'ఓ బేలా ముస్తాబేలా'కి 'ఆత్రుతలేలా' అన్నదే కరెక్టుగా వుంటుంది. ఇక 'అతనికి లోబడి-ఆశలలో బడి/ఓ బేలా-ముస్తాబేలా' వంటి పద ప్రయోగాలు ఆరుద్రకు హ్యాట్సాఫ్ అనిపించేస్తాయి.

విధి రాకాసి కత్తులు దూసి
నను వేపునే ప్రేయసీ - ఓ... ॥విధి॥
రావాలనున్నా రాలేను నేను
తోడెవరూ లేరయ్యో ॥రావాల॥
వెన్నెల కురిసే పున్నమి బ్రతుకే
అమావాస్య అయిపోయే - ఓ... ॥విధి॥
ఆశాజ్యోతి ఘనమగురీతి
వీచెను సుడిగాలి ॥ఆశాజ్యోతి॥
జీవన వ్యవధి దాటెను అవధీ
ముదిరెను - నా వ్యాధీ...ఓ... ॥విధి॥







ఈ పాటను ఎ.ఎం.రాజా పాడగా రాజ్‌కపూర్‌పై చిత్రీకరించారు. నర్గీస్ కూడా సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తుంది. ఒరిజినల్ వెర్షన్ 'రాత్ ఆంధేరీ-దూర్ సవేరా' పాట (చీకటి రాత్రి కమ్ముకుంది ఉదయం దూరమై పోతోంది) అర్థంతో సంబంధం లేకుండా స్వేచ్ఛగా రాసిన పల్లవి యిది. రెండో చరణంలో 'ఆశాజ్యోతి ఘనమగు రీతి' అనే వాక్యాన్ని గమనించండి. 'దీపం ఆరిపోయింది' అని కొందరు అనరు. ఏ తాడైనా సరే తెగిపోతే తెగిపోయిందనే అంటారు. మంగళసూత్రం విషయంలో మాత్రం తెగిపోయింది అని అనకుండా పెరిగిపోయింది అని అంటున్నట్టే 'దీపం ఆరిపోయింది' అని అనడానికి బదులు 'ఘనం అయిపోయింది' అని అంటారు. ఈ పాటలో ఆరుద్ర చేసిన ప్రయోగం కూడా అదే! 'జీవన వ్యవధి-దాటెను అవధి-ముదిరెను నా వ్యాధి' అనే ప్రయోగం వెనక అంత్యప్రాసలు, వాటికి తగ్గ పదాల్ని ఎన్నుకోవటంతో పాటు - ఓ చిన్న దరహాసం కూడా విన్న వారికి కలిగించే అవకాశం వుంది (ఇది విషాద గీతం కావచ్చు గాక అది వేరే సంగతి). ఈ పాట కూడా శ్రోతల ఆదరణకు నోచుకుంది. 'విధి రాకాసి - పెనం మీది దోసి (దోసె అన్నమాట) మాడిందె ఓ ప్రేయసీ' అంటూ ఆ రోజుల్లో పేరడీ పాటలు వచ్చాయి కూడా!

ఏకాంతము - సాయంత్రము ఎద నీకై వేగేను ॥ఏకాం॥
చిగురాకుల సడి విన్నను ఏదో దడ రేగేనూ
చిగురాకుల సడి విన్నను ఏదో దడ రేగేనూ ॥ఏకాం॥
ఏ దారి ద్వారా - నీ రాకయో ॥ఏ దారి॥
ఆ దారి జాడే కనరాదయో ॥ఆ దారి॥
పేరాశలై నా కోర్కెలే - ఈ మంచుగ కరిగేను ॥2॥ ॥ఏకాం॥
ఇన్నాళ్ళ ప్రేమ కన్నీరుగ ॥2॥
కన్నీరు మారె మున్నీరుగ ॥2॥
నన్నీగతి విడనాడితే - నా హృదయమూ పగిలేనూ ॥2॥ ॥ఏకాం॥



జిక్కి పాడిన ఈ పాటను నర్గీస్‌పై చిత్రీకరించారు. నేటికే కాదు ఏనాటికైనా సజీవంగా వుండే పాట యిది. యమన్ రాగంలోని జీవస్వరాలన్నిటినీ కలిపి అమృతధారలతో తడిపి తయారు చేసిన పాట యిది. ఈ పాటను లతా కంఠంలో 'ఏ శామ్ కీ తన్ హాయియా'గా విన్నా, జిక్కి స్వరంతో 'ఏకాంతము సాయంత్రము' గా విన్నా హృదయం అనిర్వచనీయమైన రసస్పందనతో నిండిపోతుంది. శంకర్-జైకిషన్ తర్వాతి రోజుల్లో 'చోరీ చోరీ' (1956)లో 'రసిక్ బల్ మా' పాటను స్వరపరిచినా, దానికి దీటుగా ఎస్.డి.బర్మన్ అంతటి సంగీత దర్శకుడు కూడా పేయింగ్ గెస్ట్ (1957)లో 'చాంద్ ఫిర్ నిక్ లా' పాటను స్వరపరిచినా ఆయా పాటలకు మౌలికంగా ఈ 'ఏ శామ్ కీ తన్ హాయియా' (ఏకాంతము సాయంత్రము) పాట ట్యూన్ ప్రభావం వుందని కొందరు పరిశీలకుల అభిప్రాయం.

రారాదా... రారాదా మది నిన్నే పిలిచే కాదా
కన్నీట తడిసె బాధ - కడలేనిదా యీ వ్యధా ॥రారాదా॥
చావు నా మీదకే రానున్నది
మనసు నీ మీదకే పోతున్నది
కారుచీకట్లు పగలే మూసెను ॥2॥
ఆశ పేరాశ అవబోతున్నదీ ॥రారాదా॥
ఓ...చెలి బాధ తెలుసుకోవా ॥2॥
కలలోనికైన రావా ॥2॥
రావోయీ మది నిన్నే పిలిచేనోయీ
కన్నీట కరిగె హాయి కడలేనిదా యీ వ్యధా ॥రావోయీ॥
గుండె గాయాలు కూడా చూడవా
రెండు నిముసాలు - ప్రియము లాడవా
పంచప్రాణాలు బాసే వేళలో ॥2॥
నించు మన ప్రేమ నీ కన్నీళ్లలో ॥రారాదా॥



ఈ పాటను ఎ.ఎం.రాజా, జిక్కి పాడగా రాజ్‌కపూర్, నర్గీస్‌పై చిత్రీకరించారు. ఇది కూడా ఓ మంచి పాట, ఆ రోజుల్లో ప్రతివారూ తరచుగా పాడుకునే పాట అని తప్పితే ఇంక ప్రత్యేకించి విశ్లేషించడానికి (ఈ వ్యాసకర్తకుసంబంధించినంత వరకూ) ఇంకేంలేదు.

నీ పేరు విన్నా నీ రూపు కన్నా
ఉయ్యాలలూగు మది సై సై సై ॥నీ పేరు॥
నా కంట పడక దాగినవాడు ॥2॥
నీవని మనసు గుర్తించెను ॥2॥
నా కళ్లలోకి నీ కళ్లు చూస్తే
ఉల్లాసమగును - సై సై సై ॥నీ పేరు॥
ఏ ప్రేమ ముందు కాదనినావో ॥2॥
ఆ వలపేల ఆశింతువో
నీ వైపు గాలి నా వైపు వీస్తే
ఉర్రూతలూగెద సై సై సై ॥నీ పేరు॥
ఇన్నాళ్ల దాకా మారని మనసు ॥2॥
ఈ దినమేల ఇటులాయెనో ॥2॥
నీ చేయి తగిలి , నా ప్రేమ రగిలె
ఉయ్యాల లూగెనూ సై సై సై ॥నీ పేరు॥



ఈ పాటను జిక్కి పాడగా విజయలక్ష్మి అభినయించింది. రాజ్‌కపూర్, ప్రాణ్ తదితర నటీనటులు సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. శంకర్-జైకిషన్ మార్క్‌ని పట్టియిచ్చే పాట యిది. ముఖ్యంగా తాళగతి, అకార్డియన్‌ను ఉపయోగించే విధానం ఇవన్నీ ఆ జంట యొక్క బ్రాండ్. ఈ బ్రాండ్‌కి ప్రభావితులైన సంగీత దర్శకులలో మన తెలుగు వరకూ సత్యంగారిని, ఎం.ఎస్.ప్రకాష్‌ని చెప్పుకోవాలి. ఎం.ఎస్.ప్రకాష్ అయితే 'ఇంటిగుట్టు' (1958) సినిమాలో 'నీ లీలలన్నీ చాలించవోయీ' అనే పాటని ఏకంగా ఈ 'నీ పేరు విన్నా' పాట గుర్తొచ్చేలా స్వరపరిచేశాడు కూడా!

పందిట్లో పెళ్లవుతున్నది - కనువిందవుతున్నదీ
నటనమే ఆడెదను...ఓ...నటనమే ఆడెదను... ॥పందిట్లో॥
పెండ్లి కుమార్తెకు పూజాఫలము చేతికందేను...ఆ...చేతికందేను
గోరింటాకు కోయగ బోతే - గోళ్లు కందేను నా గోళ్లు కందేను
కోరికలు తీరుచున్నవి - అవి పేరుచున్నవీ -
నటనమే ఆడెదను...ఓ...నటనమే ఆడెదను ॥పందిట్లో॥
వధువూ వరుడూ పల్లకిలోన
పరదేశ మేగెదరూ...ఆ... ॥వధూవూ॥
వారిని తలచి బంధువులంతా
సతతము వగచెదరూ ॥2॥
కన్నీరే కురియుచున్నది - మది తరుగుచున్నది
ఒంటరిగా ఆడెదనూ...ఓ...ఒంటరిగా ఆడెదనూ
పందిట్లో పెళ్లవుతున్నది - కనువిందవుతున్నదీ
ఒంటరిగా ఆడెదనూ...ఆ...ఒంటరిగా ఆడెదనూ ॥పందిట్లో॥



ఈ పాటను జిక్కి పాడగా నర్గీస్ అభినయించింది. రాజ్‌కపూర్,ప్రాణ్, విజయలక్ష్మి తదితరులు సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. తెలుగు నాట ప్రతి యింటా మారుమ్రోగి పోయిన పాటల్లో ఇదొకటి. ఆ రోజుల్లో ఈ పాట స్పీకర్‌లో వేయని పెళ్ళిపందిరి, బ్యాండ్‌పై వాయింపజేయని పెళ్ళి లేవనే చెప్పాలి. అంతేకాదు ఈనాటికీ ఈ పాటను పాడకుండా జిక్కి స్టేజి దిగిన సంగీత కార్యక్రమం కూడా లేదనే చెప్పొచ్చు. ఇదిలా వుండగా 'పెళ్ళవు తున్నాది-విందవుతున్నాదీ' అంటూ 'న'కు దీర్ఘం యిచ్చి పాడించటం పట్ల కొన్ని ఆక్షేపణలు వెలువడినా అవి మేధావుల వరకే పరిమితం అయిపోయాయి. సామాన్య శ్రోతలు మాత్రం ఇవేవీ పట్టించుకోకుండా హ్యాపీగా పాటను హిట్ చేసేశారు.

పాడు జీవితమూ - యౌవ్వనం
మూడునాళ్లా ముచ్చటలోయి - అయ్యయ్యో
నీడు పరుగూలెచటకోయి ॥పాడు॥
చీకటి దారి చుట్టూ ఎడారి - చేయునదేమి
నీ చెలి యిలు చేరీ - ప్రేయసీ ఇలు చేరి ॥చీకటి॥
దారిలో మూఢా తడబడకోరి! తడబడకోరి! ॥పాడు॥
కంటికి రెప్ప మన పుట్టిల్లు
కాని దానికి నీ ఋణమే చెల్లు - నీ ఋణమే చెల్లు ॥కంటికి॥
ఎడబాటంటే ఎదలో ముల్లు...ఎదలో ముల్లు ॥పాడు॥



ఈ పాటను ఎ.ఎం.రాజా పాడగా రాజ్‌కపూర్‌పైనా, మరొక ప్రముఖ వ్యక్తి పైనా చిత్రీకరించారు. ఆ ప్రముఖవ్యక్తి - రాజ్‌కపూర్ 'ఇతడు నా ఆత్మ' అని చెప్పుకునే నేపథ్య గాయకుడు - ముఖేష్! ఈ పాట సాహిత్యాన్ని ఆసాంతం గమనిస్తే - రాసేముందు ఆరుద్రపై 'దేవదాసు' పాటల ప్రభావం వుందేమోనని అనిపిస్తుంది. 'కొండలే రగిలే వడగాలి నీ సిగలో పూవేలోయ్, లాయిరి నడిసంద్రములోనా లంగరుతో పని లేదోయ్' వంటి వాక్యాలు 'చేయునదేమి నీ చెలి యిలు చేరి ప్రేయసి ఇలు చేరి, కంటికి రెప్ప మన పుట్టిల్లు-కాని దానికి నీ ఋణమే చెల్లు' అనే వాక్యాలను చూస్తుంటే గుర్తొస్తాయి. బహుశా ఆ ప్రభావమే కృష్ణ 'దేవదాసు' లోని 'ఇది నిశీధి సమయం' పాటలో 'తానే లేని సదనంలో తలుపులు ఎందుకురా/తిరిగి రానే రాని పయనంలో పిలుపులు ఎందుకురా/మరలా పుట్టుక మరలా చచ్చుట ఇరుసే లేని చక్రం/వచ్చేవారు పోయేవారు జగతి పురాతన సత్రం/రాకడకైనా పోకడకైనా కర్తవు కావురా నీవు/అన్ని అంచెలు దాటిన పిదప ఉన్నది కడపటి రేవు' వంటి వాక్యాలను రాయడానికి ఉపయోగపడిందేమో!? ఎందుకంటే 'ప్రేమలేఖలు' సినిమా క్లయిమాక్స్ 'దేవదాసు' సినిమాలోని పతాక సన్నివేశాలను పోలివుందని ఆ రోజుల్లోనే అనుకున్నారు. కనుక ఇవన్నీ మనసులో అంతర్లీనంగా మెదిలి, తనదైన ముద్రతో బైటికి వచ్చే అవకాశం ఎవరికైనా వుంటుంది.

ఈ సినిమా సంగీతానికి సంబంధించి-మరొక ముఖ్యమైన విశేషం వుంది. తెలుగు, తమిళ వెర్షన్‌లో కూడా లతా, ముఖేష్‌లతో పాడిద్దామనుకున్నారు. రెండు పాటలు రికార్డు చేశారుకూడా... రాజ్‌కపూర్ తెలుగు, తమిళం తెలిసిన తన స్నేహితులకు వినిపించాడు. తెలుగు వరకు లత పట్ల వంకలు పెట్టలేదు గాని తమిళం విషయంలో మాత్రం కొన్ని లోపాలు వారు సూచించారట. అప్పుడు తెలుగు తమిళ వెర్షన్‌లకు దక్షిణాది గాయనీ గాయకులైతేనే బావుంటుందన్న నిర్ణయానికి రాజ్‌కపూర్ వచ్చేశాడు. ఆ తర్వాత ఎం.ఎల్.వసంత కుమారిని అనుకున్నారు. ఆరుద్రగారే జిక్కి పేరుని సూచించారు. ఆ సమయంలో ఘంటసాలగారికి స్వల్ప అనారోగ్యం కారణంగా కొద్ది రోజులపాటు రికార్డింగులకు వెళ్ళటం లేదుట. అంచేత ఎ.యమ్.రాజా పేరుని కూడా ఆరుద్రగారే సూచించారు. తనతో పాడించక పోవడం పట్ల లత మాత్రం అలిగింది. 'నా గొంతు మీ భాషకు పనికిరాకుండా పోయింది!?' అంటూ బాధ పడింది. 'చూస్తూ వుండండి...ఏదో రోజు మద్రాసులోనే తమిళ ప్రేక్షకుల ముందు త్యాగరాజ కీర్తన కచ్చేరీ చేసి ఒప్పిస్తాను' అని శపథం కూడా చేసిందట. ఇవన్నీ ఆరుద్రగారు తన 'సినీ మినీ కబుర్లు' లో రాసుకున్నారు.

హిందీలో ఆశించినంత విజయం సాధించకపోయినా తెలుగులో (తమిళంలో కూడా) ఈ 'ప్రేమలేఖలు' చిత్రం అద్భుతమైన విజయాన్ని పొందిందీ అంటే అందుకు కారణం నిస్సందేహంగా పాటలే! ●

పద్మశ్రీ కమల్‌హాసన్

సమర్పించు

దశరథ సంగిశెట్టి సారధ్యంలో






సిరి సాయి సూర్య మూవీస్

# సత్యమే శివం

సంగిశెట్టి సబిత

లక్ష్మినారాయణ

సుందర్,

విద్యాసాగర్

వెన్నెలకంటి, ఆర్థర్, విల్సన్, విక్రమ్ ధర్మ, ప్రభాకరన్, బృందా, దినేష్, ఐ.అర్జున్‌రావు